History is a continuum; a dialogue between the past and the present, historians say. Past holds clues to the present and helps us understand it better. We believe, as do many , that a society that does not remember its past has a dim future.

Telangana had had a great past. The region produced great works of art, architecture, literature and witnessed many progressive and revolutionary movements. But that past had not found its rightful place in the pages of history owing to the bias of the historians.

In the context of 'identity' movement currently sweeping the region, there is urgent need to correct the distortions in history and claim our rightful place. We welcome you all to join us in our endeavour.




తెలంగాణ హిస్టరీ సొసైటి

# ఆంధ్రప్రదేశ్ ఏర్పాటు విద్రోహ చరిత్ర






తెలంగాణ హిస్టరీ సొసైటి

# ఆంధ్ర ప్రదేశ్ ఏర్పాటు
# విద్రోహ చరిత్ర

తడకమళ్ల వివేక్
ఎన్. వేణుగోపాల్
పరవస్తు లోకేశ్వర్
ఎమ్. రాఘవాచారి
శ్రీధర్ దేశ్‌పాండే
సంగిశెట్టి శ్రీనివాస్



TELANGANA
HISTORY SOCIETY
తెలంగాణ హిస్టరీ సొసైటీ

# మేము...

"తెలంగాణా ప్రాంతంగా వ్యవహరింపబడుతున్న తొమ్మిది జిల్లాలలో చరిత్ర, శిల్పం, శాసనాలు, చిత్రలేఖనం, తాళపత్ర గ్రంథాలు, తటాకాలు, కోటలు, వీరగాధలు ఎన్నో ఉన్నాయి. సాహిత్య కారులు, కళావేత్తలు ఎందరో ఉన్నారు. అంతే గాక ఏండ్ల తరబడి కాలాన్ని తీర్చిదిద్దడానికి, దేశాన్ని పురోగమింప జేయడానికి ఎడతెగకుండా జరిపిన ఉద్యమాలున్నాయి". అంటూ తెలంగాణ ఆంధ్ర రాష్ట్రంలో విలీనమై ఆంధ్రప్రదేశ్ ఏర్పడుతున్నప్పుడు 1956లో ప్రచురించిన 'తెలంగాణం' వ్యాస సంపుటానికి ముందుమాటగా వట్టికోటి ఆళ్వారుస్వామి రాశారు.

అంత ఘనమైన చరిత్ర గల తెలంగాణ చరిత్ర ఆ తర్వాత యాభై సంవత్సరాలలో మరింతగా విస్మరణకు గురయింది. వివక్షకు బలి అయింది. వక్రీకరణకు వేదిక అయింది. అంతకు ముందరి శతాబ్దాల చరిత్రలో తెలంగాణ ప్రాంతం, తెలంగాణ ప్రజలు సాధించిన అసాధారణ విజయాలన్నీ, నిర్మించిన వైభవోపేత చరిత్రంతా ఎక్కడా నమోదు కాని స్థితి వచ్చింది. నమోదయిన చోట అరకొరగా నమోదయింది. మేధోపూర్వకమైన వివరణ, చర్చ, విశ్లేషణ జరగకుండా పోయింది. ఇక 1956 తర్వాత గడిచిన యాభై సంవత్సరాల లోనయితే ఆంధ్రప్రదేశ్ చరిత్ర పేరిట విద్యార్థులకూ, సమాజానికీ అందిన చరిత్రలో తెలంగాణకు దక్కవలసిన న్యాయమైన వాటా దక్కనేలేదు. ఈ వివక్ష కారణంగా చరిత్ర రచనకు అత్యవసరమైన వనరుల, చారిత్రకాధారాల పరిరక్షణ కూడ పెద్ద

సమస్యగా మారింది. నీళ్లు, నిధులు, నియామకాలలో తెలంగాణకు జరిగిన వివక్ష గురించి చర్చ జరుగుతున్నది గాని చరిత్ర రచనలో తెలంగాణకు జరిగిన అన్యాయాన్ని గుర్తించేపని ఇంకా పూర్తిగా జరగడం లేదు.

ఈ అవగాహనతో, తెలంగాణ చరిత్రను తవ్వితీసి, పరిశోధించి, వెలుగులోకి తేవాలనే లక్ష్యంతో తెలంగాణ హిస్టరీ సొసైటీ ఏర్పడింది. ఆ ప్రయత్నాలలో భాగంగా 2006 జూన్ 4న హైదరాబాద్‌లోని ఫతేమైదాన్ క్లబ్బులో ఒక సన్నాహక సమావేశం ఏర్పాటు చేశాం. ఆ సమావేశానికి నలభై మందికి పైగా చరిత్ర పరిశోధకులు, విశ్వవిద్యాలయ అధ్యాపకులు, విద్యార్థులు, తెలంగాణ అభిమానులు హాజరయి, అక్కడి చర్చలను విజయవంతం చేశారు.

సంస్థ స్థాపించిన నాటి నుండి 'తెలంగాణ చరిత్ర పునర్నిర్మాణం', '1857 హైదరాబాద్ తిరుగుబాటు కథలు', '17 సెప్టెంబర్ 1948 - భిన్న దృక్కోణాలు', '1969 ఉద్యమం-చారిత్రక పత్రాలు' అనే గ్రంథాలు, ఎన్నో సెమినార్లు నిర్వహించడం జరిగింది. తెలంగాణ జిల్లాల చరిత్రను విస్తారంగా నమోదు చేయాలనే ప్రాజెక్టును కూడా చేపట్టడం జరిగింది. ప్రాంతీయ సమావేశాలు నిర్మల్, మహబూబ్ నగర్‌లో నిర్వహించినాము. త్వరలో ఇతర జిల్లాలలో ఈ సమావేశాలను ఏర్పాటు చేయబోతున్నాము.

ఈ సంస్థ ఉద్దేశాలతో ఏకీభావం ఉన్న తెలంగాణ పౌరులందరికి ఇదే మా ఆహ్వానం.

– తెలంగాణ హిస్టరీ సొసైటి



# ముందుమాట

ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ఏర్పాటు రెండు రాష్ట్రాల ప్రజల కోరికతో, ఒకే భాష మాట్లాడే ప్రజలు ఒక రాష్ట్రంగా ఏర్పడాలని లేదా కలసి ఉండాలని కోరుకోవడం వల్ల జరిగిందని అందుకే ఈనాటి తెలంగాణ రాష్ట్రం కోసం జరుగుతున్న ఉద్యమాన్ని వేర్పాటు వాదంగా చెప్పడం జరుగుతున్నది. అయితే రాష్ట్రం ఏర్పాటుకు దారి తీసిన సంఘటనలు, నాటి రాజకీయాలు, ఒప్పందాలు, కమిటీల సిఫార్సులు ఏమిటి అనే వివరాల్లోకి పోతే ఇప్పటి వరకు అత్యధిక ప్రజానీకం చారిత్రక నిజాలుగా భావిస్తున్న సత్యాలు ఎంత అసత్యమో, అవి అట్లా చారిత్రక సత్యాలుగా రూపాంతరం చెందడానికి జరిగిన వక్రీకరణ ఏమిటో, గతంలోకి తొంగిచూస్తే కాని తెలవదు.

నాటి హైదరాబాద్-ఆంధ్రరాష్ట్రాల కలయిక ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంగా ఏర్పడిన రోజు నవంబర్ 1, 1956. ఈ రెండు రాష్ట్రాలలో ప్రజలు తెలుగు మాట్లాడే వాళ్లు కాబట్టి ఆ ప్రాంతాలను ఒక రాష్ట్రంగా ఏర్పాటు చేయడం సమంజసమని నాటి ఢిల్లీ పాలకులు, రెండు భిన్న సంస్కృతుల ప్రజలను భౌగోళికంగా జత పర్చినారు. ఇందులో ప్రధానంగా ఆంధ్రరాష్ట్రం నాటి మద్రాస్ రాష్ట్రం నుండి విడిపోవలసిన రాజకీయ అనివార్య పరిస్థితి, రాయలసీమ, ఆంధ్రప్రజల మధ్య తలెత్తిన అపోహలు, శ్రీ బాగ్ ఒప్పందం ఉల్లంఘనలు, హైదరాబాద్ రాష్ట్ర రాజధానిగా హైదరాబాద్ నగరంలోని వసతులు కొన్ని కారణాలుగా చెప్పుకోవచ్చు.

కొంత వరకు నాటి తెలంగాణ ప్రముఖ నాయకులు కూడా రాష్ట్రాల కలయిక ప్రతిపాదనను వారి సంకుచిత రాజకీయ ప్రయోజనాల కోసం స్వాగతించడం జరిగింది. ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం ఏర్పాటుకు ఇది ఒక కోణమైతే, హైదరాబాద్ రాష్ట్రంగా పిలువబడే తెలంగాణ ప్రాంతంలోని సహజవనరులు, ఆ వనరుల తరలింపు ద్వారా ఒనగూడే

ప్రయోజనాలు, ఇక్కడి ప్రజల వెనుక బాటుతనం, తద్వారా చేకూరే ఆర్థిక-రాజకీయ లబ్ధి మరో కోణంగా చెప్పుకోవచ్చు. ఈ క్రమంలో ఏర్పాటయిన రాష్ట్రం రెండు అసమాన ప్రాంతాల మధ్య జరిగే కలయికల దుష్పరిణామాలు ఎట్లా ఉంటాయో, ఆ ప్రభావం ఆర్థికంగా వెనుకబడి ఉన్న ప్రాంత ప్రజలపై ఎట్లా ఉంటుందో అధ్యయనం చేయడానికి సమైక్యరాష్ట్రంలో తెలంగాణ ప్రాంతం ఒక సజీవ ఉదాహరణ.

ఈ పుస్తకం ద్వారా ఆంధ్రప్రదేశ్ ఏర్పాటు ఏ ప్రాతిపదికన జరిగింది, ఆ సందర్భంగా ఏ ఒడంబడికలు జరిగినయి, ఏ రక్షణలు తెలంగాణ ప్రాంతానికి / ప్రజలకు ఇవ్వాలని అంగీకారం కుదిరింది, వాటి ఉద్దేశాలు ఏమిటి వివరించడానికి ప్రయత్నించాము. ఆ ఒప్పందాల అంశాల ప్రాధాన్యత, అమలు / ఉల్లంఘనలు తెలంగాణ ఉద్యమానికి ఏ విధంగా కారణమయినవో తెలిపే ప్రయత్నం చేసినాము. ఈ ప్రయత్నంలో చారిత్రక ఘట్టాలను ఎంపిక చేసుకొని వాటిని సమకాలీన ఉద్యమ కోణం నుంచి పరిశీలిస్తూ మా దృక్పథాన్ని కూడా చెప్పే ప్రయత్నం చేసినాము.

అనుబంధంలో ఒడంబడికలు/ఒప్పందాలు/కమిటీల సిఫార్సులు వగైరా ఒరిజినల్ ప్రతులు ప్రచురించినాము. ఆ విధంగా పాఠకులకు రాష్ట్రం ఏర్పాటులోని అంశాలను యధాతథంగా తెలియజేసి మరింత చర్చకు, ఇంకా లోతైన విశ్లేషణకు స్వాగతం పలుకుతున్నాము. చరిత్ర కేవలం సంఘటనల సమాహారం కాదని, సంఘటనల మధ్య సంబంధాన్ని అర్థవంతంగా చెప్పే ప్రయత్నం అని మా విశ్వాసం. వర్తమానాన్ని అర్థం చేసుకోవడానికి చరిత్రను ఉపయోగించుకొని భవిష్యత్తులోకి వెళ్లడమే చరిత్ర ఉద్దేశం. ఎన్నో రెఫరెన్సుల ఆధార్గంగా నిర్మించిన ఈ సుదీర్ఘ వ్యాసం ఆంధ్రప్రదేశ్ ఏర్పాటులోని అనేక అంశాలను వివిధ కోణంలో నుండి స్పృశించి ఒక సమగ్రమైన తీర్పుగా మీకు అందిస్తున్నాం. చదివి మీ అభిప్రాయాన్ని చెప్పండి.

– తెలంగాణ హిస్టరీ సొసైటీ



మలి ముద్రణకు

# ముందుమాట

ఈ పుస్తకము మొదటి ముద్రణ విశేష ఆదరణ పొందిన కారణంగా, ఎన్నో సూచనలు, చేయదగిన మార్పులు పాఠకులు మాకు అందించిన కారణంగా ఈ పుస్తకం మలి ముద్రణ చేపట్టడం జరిగింది. పాఠకుల విలువైన సూచనలను గౌరవిస్తూ పుస్తకం పఠనీయత పెంచటం కోసం అధ్యాయాలుగా విభజించి కూర్చటమైనది. అనుబంధంలో శ్రీ నారాయణ రెడ్డి (ex-MP) గారి వ్యాసం కూడా అదనంగా చేర్చబడినది. ఈ ప్రయత్నం ద్వారా ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ఏర్పాటులోని అనేక అంశాలను మరోసారి పాఠకులకు మరియు ఉద్యమకారులకు మరింత చేరవేయాలని మా ప్రయత్నం. ఎప్పటిలాగే మీ సూచనలు, సలహాలు కోరుతూ.

– తెలంగాణ హిస్టరీ సొసైటీ

# 'విద్రోహ దినం' వైపు గడియారం నడక

1956 నవంబర్ 1. ఆంధ్రప్రదేశ్ అవతరణ దినమా? తెలంగాణకు విద్రోహం జరిగిన దినమా? తెలుగు సమాజ చరిత్రలో చాలా ప్రాధాన్యత ఉన్న ఈ తేదీ యాభై సంవత్సరాలు దాటిన తర్వాత కూడా ఒక్కొక్కరిలో ఒక్కొక్కరకమైన, భిన్నమైన ఉద్వేగాల్ని ప్రేరేపిస్తున్నది. అసలు ఆ తేదీని ఎలా గుర్తించాలనే అంశంలోనే చాలా భిన్నాభిప్రాయాలు, ఒకే శిబిరంలో కూడా అభిప్రాయభేదాల ఛాయలు ఉన్నాయి. కొందరికి అది ఉత్తేజం కలిగించే ఆంధ్రప్రదేశ్ అవతరణ దినం. కొన్ని శతాబ్దాల పాటు పరాయి పాలనల కింద జీవించిన తెలుగు భాషా ప్రాంతాలు ఒకే పాలన కింద ఐక్యమైన సమైక్యతా దినం. సాంస్కృతిక పునరేకీకరణ దినం. మరి కొందరికి అది బలవంతపు ఐక్యతా దినం. ఒక ప్రాంతాన్ని దోపిడీ పీడనలకు గురి చేయడానికి మరొక ప్రాంతం అవకాశం దొరికించుకున్న విద్రోహ దినం. అంతకు ముందరి ఖండిత చరిత్రను చూపి ఒకే భాష, ఒకే సంస్కృతి కల ఒక జాతి ప్రజలు ఒకే రాజకీయ, భౌగోళిక అస్తిత్వంలో ఏకమైన పండుగగా జరపాలనే వాళ్లు కొందరు కాగా, ఆ తర్వాత గడిచిన యాభై సంవత్సరాలలో సాగిన అన్యాయాలు, ఉల్లంఘనలు, మోసాలు, వివక్ష నిండిన చరిత్రను చూపి ఈ విషాద చరిత్ర ప్రారంభమైన ఆ తేదీని విద్రోహ దినంగా జరిపేవాళ్లు కొందరు. ఆ రోజున ఏకీకరణ జరిగినప్పుడు దానికి నాయకత్వం వహించినవారికి కుట్రపూరిత ఆలోచనలు లేకపోవచ్చునని, కేవలం భాషా సాంస్కృతిక ఐక్యత అనే దృష్టి మాత్రమే ఉండిందని అనుకున్నప్పటికీ, ఆ తర్వాత జరిగిన యాభై సంవత్సరాల పరిణామాల వల్ల ఆ తేదీని దురదృష్టకరమైన చరిత్రకు నాందిగా చూడకతప్పదు. కనీసం ఆ తేదీ నుంచి అమలులోకి రావలసిన వాగ్దానాలు, హామీలు నెరవేరి ఉంటే జాతి ఐక్యత సంగతి ఎలా ఉన్నా ప్రస్తుతం ఉన్నంత తీవ్రమైన వైమనస్యాలు, ఘర్షణ వాతావరణం నెలకొని ఉండేవి కాదు. అందువల్ల కూడా ఆ తేదీ ఆశలు ప్రారంభమైన తేదీగా మాత్రమే కాక నిరాశలకు, ఘర్షణకు తెరతీసిన రోజుగా కూడా ఉంటుంది.

ఒక సమీప గతంలోని చారిత్రక దినం పట్ల ఇంత తీవ్రమైన భిన్నాభిప్రాయాలుండడం, ఆ చారిత్రక దినం ఎలా రూపొందిందో తెలిపే చరిత్ర సక్రమంగా, సమగ్రంగా పాఠకులకు



అందుబాటులో లేకపోవడం ఆశ్చర్యకరం. బహుశా ఆశ్చర్యకరం కాదేమో కూడ. ఆ తేదీన జరిగిన ఏకీకరణ వల్ల లాభపడిన రాజకీయార్థిక శక్తులే ఈ యాభై సంవత్సరాలుగా సమైక్య రాష్ట్రంలో అధికారం చలాయిస్తుండడం వల్ల అధికారిక చరిత్రలో ఆ తేదీ గురించి సానుకూల దృక్పథమే కొనసాగుతున్నదేమో. ఎప్పుడయినా అధికారిక చరిత్ర విజేతలదే కావడం సహజమే. కాని ఆ సమయానికి పరాజితులయిన వాళ్లు కాలక్రమంలోనయినా తమ అపజయాన్నీ గుర్తిస్తారు. అధికారిక చరిత్రను ప్రశ్నిస్తారు, ధిక్కరిస్తారు. ప్రత్యామ్నాయ చారిత్రక ఆధారాలను తవ్వితీసి, భిన్నమైన, తమకు సాధికారికమని అనిపించిన చరిత్రను రాయడం మొదలుపెడతారు. అట్లాగే 1956 నవంబర్ 1 గురించి కూడా 1969 ప్రత్యేక తెలంగాణ ఉద్యమం నాటి నుంచీ, కనీసం తెలంగాణలో భిన్నమైన దృక్పథం ప్రాచుర్యంలోకి వస్తున్నది. ఆ మాటకు వస్తే 1956 నాటికే ఆ దృక్పథం ఉన్నది. 1996 నుంచీ ఆ దృక్పథం ఇంకా ఎక్కువ విస్తరిస్తున్నది.

ఈ నేపథ్యంలో 1956 నవంబర్ 1 కి దారితీసిన చరిత్రను ఉన్నది ఉన్నట్లుగా, ఏ అతిశయోక్తులూ, వక్రీకరణలూ, అర్ధసత్యాలూ లేకుండా నమోదు చేయాలనే ప్రయత్నమే ఈ రచన. తెలంగాణకు సంబంధించి చరిత్ర రచనలో ఇప్పటివరకూ ప్రబలంగా ఉన్న అసత్యాలనూ, అర్ధసత్యాలనూ, వక్రీకరణలనూ, వివక్షనూ సవరించాలనే ఆశయంతో ఏర్పడిన తెలంగాణ హిస్టరీ సొసైటీ (టిహెచ్ఎస్) గతంలో '17 సెప్టెంబర్ 1948 – భిన్న దృక్కోణాలు' అనే పుస్తకాన్ని ప్రచురించింది. మీర్ ఉస్మాన్ అలీఖాన్ పాలనపై సైనికచర్య జరిపి, హైదరాబాదు రాజ్య స్వతంత్ర అస్తిత్వాన్ని రద్దు చేసి, హైదరాబాదును భారత యూనియన్ లో ఒక రాష్ట్రంగా విలీనం చేసిన ఆ తేదీ పట్ల ఉన్న భిన్న కోణాలన్నింటినీ ఆ పుస్తకంలో పొందు పరచడం జరిగింది. ఆ పుస్తకానికి కొనసాగింపుగా, 1948 నుంచి 1956 దాకా జరిగిన పరిణామాలను, అవి ఆంధ్రప్రదేశ్ అవతరణకు దారి తీసిన వైనాన్ని వివరించడం ఈ రచన లక్ష్యం.

1956 నవంబర్ 1 న జరిగిన ఆంధ్రప్రదేశ్ అవతరణ గురించి అధికారిక చరిత్ర కథనంలో ఎన్నో గుర్తించదగిన అబద్ధాలు, అర్ధసత్యాలు, వక్రీకరణలు ఉన్నాయి. వాటిలో కొన్ని.

పొట్టి శ్రీరాములు బలిదానం వల్ల ఆంధ్రప్రదేశ్ ఏర్పడింది.

దేశంలో ఏర్పడిన తొలి భాషా ప్రయుక్త రాష్ట్రంగా ఆంధ్రప్రదేశ్ తెలుగు భాషా ప్రజల ఆకాంక్షలను నెరవేర్చింది.

స్వాతంత్ర్యానంతరం కేంద్రప్రభుత్వం నియమించిన రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ కమీషన్ సిఫారసుల మేరకే ఆంధ్రప్రదేశ్ ఏర్పడింది.

బ్రిటిష్ పాలనలో అభివృద్ధి చెందిన కోస్తాంధ్ర-రాజయలసీమ ప్రాంతాన్ని, నిజాం పాలనలో వెనుకబడిన తెలంగాణ ప్రాంతాన్ని సమైక్యం చేసినప్పుడు, తెలంగాణ ప్రాంతం ఎదుర్కోగల ఇబ్బందుల్ని అధిగమించడానికి లిఖితపూర్వకమైన రక్షణలు కల్పించడం జరిగింది.

తెలంగాణ, ఆంధ్ర ప్రాంతాల ప్రజాభీష్టం మేరకే, ప్రజానాయకుల అంగీకారంతోనే ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర అవతరణ జరిగింది.

ఈ అబద్ధాలను, పాక్షిక సత్యాలను చాలా మంది విజ్ఞులు, విద్యావంతులు కూడా నమ్మే పరిస్థితి ఉంది. ఈ అబద్ధాలను పటాపంచలు చేయగల చారిత్రక ఆధారాలు ఎన్నో ఉన్నప్పటికీ అవి విస్తృతంగా ప్రజలందరికీ అందుబాటులో లేకపోవడం వల్ల, పాఠ్యపుస్తకాలలోనూ, ప్రామాణిక చరిత్ర గ్రంథాలనబడే వాటిలోనూ, ప్రభుత్వ కార్యక్రమాలలోనూ ఈ అబద్ధాలే ప్రచారంలో ఉండడం వల్ల అవే నిజమని నమ్మే పరిస్థితి ఉంది. కాని అవన్నీ నిజం కావని చూపగల సమకాలిక ఆధారాలు, తదనంతరం పరిశోధనా ఫలితాలు ఎన్నో ఉన్నాయి. గత రెండు మూడు దశాబ్దాలుగా ఆ ఆధారాల వెలికితీత మీద శ్రద్ధ పెరిగింది.

పొట్టి శ్రీరాములు నిరాహారదీక్ష, ప్రాణత్యాగం వాటికవిగా ఉదాత్తమైనవీ, గొప్పవీ కావచ్చు గాని వాటికీ ఆంధ్రప్రదేశ్ అవతరణకూ ఎటువంటి సంబంధమూ లేదు. నిజానికి ఆయన ఆమరణ నిరాహారదీక్ష పూనినది ఉమ్మడి మద్రాసు రాష్ట్రం నుంచి తెలుగు జిల్లాలను వేరు చేసి ఆంధ్ర రాష్ట్రం ఏర్పాటు చేయాలని మాత్రమే. అటు మద్రాసు రాష్ట్రంలోనూ ఇటు నిజాం పాలనలోనూ ఉన్న తెలుగు ప్రజలను ఏకం చేయాలనే కోరిక అప్పటికే కొంతమంది వ్యక్తం చేసి ఉన్నప్పటికీ, పొట్టి శ్రీరాములు నిరాహారదీక్ష ఆ డిమాండ్ పైన జరగలేదు. మద్రాసు రాష్ట్రం నుంచి తెలుగు జిల్లాలను వేరు చేసి ఒక ప్రత్యేక రాష్ట్రం ఏర్పాటు చేయాలనీ, దానికి రాజధానిగా మద్రాసు ఉండాలనీ కోరికలతో శ్రీరాములు 1952 అక్టోబర్ 19న నిరాహారదీక్ష ప్రారంభించారు. ప్రత్యేక రాష్ట్రం ఏర్పాటు చేస్తామనీ, కాని మద్రాసు కావాలనే డిమాండ్ వదులుకోవాలనీ ప్రధాన మంత్రి జవహర్ లాల్ నెహ్రూ డిసెంబర్ 9న లోక్ సభలో ప్రకటించారు. ఆ హామీని కూడా శ్రీరాములు అంగీకరించలేదంటే, మద్రాసు కావాలనే కోరికే ఆయనకు ప్రబలంగా ఉండేదని అర్థమవుతుంది. ఆ తర్వాత వారం రోజులకు డిసెంబర్ 15న ఆయన మరణించారు. ఆ తర్వాత పది నెలలకు గాని (అక్టోబరు 1, 1953) మద్రాసు నుంచి వేరు చేసిన ఆంధ్ర రాష్ట్రం ఏర్పాటు కాలేదు. అందువల్ల పొట్టి శ్రీరాములు అమరత్వం ఎక్కువలో ఎక్కువ ఆంధ్ర రాష్ట్రాన్ని సాధించిందని అనవచ్చుగాని, ఆంధ్రప్రదేశ్ ఏర్పాటుతో దానికి ఎటువంటి సంబంధమూ లేదు.



ఆంధ్రప్రదేశ్ ఏర్పాటు ప్రధానంగా భాషా ప్రాతిపదిక మీద జరిగిందని అధికారిక చరిత్ర చెపుతుంది గనుక అసలు ఆ ప్రాతిపదిక గురించి లోతుగా అర్థం చేసుకోవలసి ఉంది. రాష్ట్రాల ఏర్పాటు భాష ప్రాతిపదిక మీద ఉండాలా లేదా అనేది జాతీయోద్యమంలో చాల పెద్ద ఎత్తున చర్చ జరిగిన విషయం. దాని మీద జాతీయోద్యమ రాజకీయ పక్షాలలో అనేక భిన్నాభిప్రాయాలున్నాయి. బ్రిటిష్ వలస వాద పాలకులు, ఆరువందల స్వతంత్ర సంస్థానాలలో పాలనను స్థానిక రాజులకు వదిలివేసిన తర్వాత మిగిలిన భారత ఉపఖండాన్ని పాలించడానికి పాలనా యూనిట్లను ప్రావిన్స్‌లుగా విభజించారు. ఈ విభజన శాస్త్రీయ ప్రాతిపదిక మీద జరగలేదని, వలస పాలనను కూలదోసిన తర్వాత జాతీయ సంస్కృతుల ప్రాతిపదిక మీద విభజన జరుగుతుందని జాతీయోద్యమం స్థూలంగా భావించింది. యూరప్ లోని జాతుల స్వయం నిర్ణయాధికార ఉద్యమాలతో, జాతి రాజ్యాల ఏర్పాటుతో ప్రభావితమైన భారత జాతీయోద్యమ నాయకులందరూ భారత దేశం విభిన్న జాతుల సమాఖ్య అని భిన్నత్వంలో ఏకత్వాన్ని గుర్తించారు. ఆయా జాతులకు స్వతంత్ర అస్తిత్వాలు ఉన్నాయి గనుక, ఆయా జాతులు తమ సొంత పాలనలలో ఉండాలని కోరుకుంటాయని ఆశించారు. బెంగాల్ విభజనకు వ్యతిరేకంగా ఉద్యమం జరిగిన 1905 నాటి నుంచీ కూడా భారత జాతీయోద్యమ నాయకులలో ఇటువంటి భావాలు ఉన్నాయి. విభిన్న జాతుల ప్రజలు యూనియన్ ఆఫ్ సోవియట్ సోషలిస్ట్ రిపబ్లిక్స్‌గా తమ స్వతంత్ర రిపబ్లిక్ స్వభావాన్ని కాపాడుకుంటూనే సమాఖ్యగా ఏకం కావచ్చుననే ఉదాహరణ కూడ భారత జాతీయోద్యమ నాయకుల ముందు ఉండింది.

అందువల్లనే అటు భారత జాతీయ కాంగ్రెస్ నుంచి ఇటు భారత కమ్యూనిస్టు పార్టీ వరకూ దేశాన్ని జాతుల సమాఖ్యగా గుర్తిస్తూ, విడివిడిగా ఆ జాతుల ఆకాంక్షలను గౌరవించాలని భావించాయి. "ఒక ఉమ్మడి భూభాగం, ఒక ఉమ్మడి భాష, ఒక ఉమ్మడి ఆర్థిక జీవనం, ఒక ఉమ్మడి సంస్కృతిగా వ్యక్తమయ్యే ఉమ్మడి మానసిక స్థితి కలిగి ఉన్న ప్రజలు చారిత్రకంగా ఒకే సమూహంగా ఉన్నట్టయితే దాన్ని జాతి అనవచ్చును" అని జోసెఫ్ స్టాలిన్ చేసిన నిర్వచనాన్ని భారత జాతీయోద్యమ నాయకులందరూ నేరుగా గాని, పరోక్షంగా గాని అంగీకరించారు. నిజానికి ఈ ఐదు లక్షణాలను బట్టి భారత జాతిని గాని, విభిన్న భాషా జాతులను గాని పూర్తి స్థాయి జాతులుగా గుర్తించడం సాధ్యం అవుతుందా కాదా అనే చర్చ ఉండనే ఉంది. ఎందుకంటే ఈ ఐదు లక్షణాలూ సంపూర్ణంగా భారత జాతి అనేదానికీ వర్తించవు, దేశంలోని భిన్న సాంస్కృతిక సముదాయాలకూ వర్తించవు. బహుశా ఆ సంక్లిష్టత వల్లనేనేమో చివరికి ఈ ఐదు లక్షణాలలో భాష అనే ఏకైక లక్షణానిదే పైచేయి కూడా అయింది.

కాని వలసవాద పాలన తొలగిపోయి, భారతజాతీయ కాంగ్రెస్ చేతికి అధికారం బదలయిస్తామనే సరికి ఈ జాతుల సమాఖ్య అవగాహనలో, రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ అవగాహనలో చెప్పుకోదగిన మార్పులు వచ్చాయి. బహుశా 1947 జూన్ భారత స్వాతంత్ర్య ప్రకటనలో స్వతంత్ర సంస్థానాలను భారతదేశం నుంచీ, పాకిస్తాన్ నుంచీ కూడ విడిగా, స్వతంత్ర రాజ్యాలుగా ఉండడానికి అంగీకరిస్తామని మౌంట్ బాటన్ పెట్టిన మెలిక వల్ల, భారత జాతీయ కాంగ్రెస్ రాష్ట్రాల పునర్విభజనకు జాతి ప్రాతిపదికనూ, భాషా ప్రాతిపదికనూ వదిలేసింది. కొత్తగా దేశ సమగ్రత, సార్వభౌమత్వాల ప్రాతిపదికలను ముందుకు తెచ్చింది. భారత కమ్యూనిస్టు పార్టీతో సహా మిగిలిన రాజకీయ పక్షాలు కూడా క్రమక్రమంగా దాదాపుగా ఈ అవగాహనకు వచ్చాయి. భారతజాతి ఒకటేననే వైఖరి ప్రబలింది. అప్పుడిక కేవలం పాలనా సౌలభ్యం కొరకు మాత్రమే రాష్ట్రాల పునర్విభజన జరగాలనే వాదన తలెత్తింది. గత విశ్వాసాల అవశేషంగా కమ్యూనిస్టులు భాషా ప్రాతిపదికను మరికొన్ని సంవత్సరాలపాటు కొనసాగించగా, కాంగ్రెస్ మాత్రం తన బెంగాల్ విభజన నాటి నుంచీ, నాగపూర్ కాంగ్రెస్ తీర్మానం (1920) నాటి నుంచీ నమ్ముతున్న విశ్వాసాన్ని పూర్తిగా వదిలివేసింది. అలా వదిలివేసే ప్రక్రియలో భాగంగానే ధార్ కమిటీ, జెవిపి కమిటీ, వాంచూ కమిటీ, రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ కమిషన్ వంటివన్నీ వచ్చాయి.

అలా దేశం మొత్తానికీ రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణకు భాషా ప్రాతిపదిక సరయిన ప్రాతిపదిక కాదని గుర్తిస్తూనే, భిన్న భాషా ప్రాంతాలను, భిన్న చరిత్ర ఉన్న ప్రాంతాలను ఒకే రాష్ట్రంగా, ఒకే భాషా ప్రజలను భిన్న రాష్ట్రాలుగా ఏర్పరస్తూనే, ఆంధ్రప్రదేశ్ ఏర్పాటులో మాత్రం భాషా ప్రాతిపదికను పాటించాలని కేంద్రప్రభుత్వం భావించింది. అంటే భారత జాతీయ కాంగ్రెస్ వైఖరిలో 1948 నుంచి 1956 మధ్య సైద్ధాంతికంగానూ, ఆచరణలోనూ కొట్టవచ్చినట్టుగా కనిపించే పిల్లి మొగ్గలు ఉన్నాయి.

ఆ వైవిధ్య భరితమయిన చరిత్రనంతా నిశితంగా, సూక్ష్మంగా పరిశీలిస్తే గాని 1956 నవంబర్ 1 కి దారి తీసిన పరిస్థితులను అర్థం చేసుకోలేము. ఈ రచన అటువంటి నిశిత, సూక్ష్మ పరిశీలనకు అవసరమైన దృక్పథాన్ని, ఆధారాలను అందిస్తుంది.

ఇక హైదరాబాద్ రాష్ట్ర ప్రజలు, ముఖ్యంగా తెలుగు భాషాప్రాంతమైన తెలంగాణ ప్రజలు ఆంధ్రప్రాంతంతో విలీనం కావాలని కోరుకున్నారా, వారి కోరిక మేరకే విలీనం జరిగిందా అనేది వివాదాస్పదమైన, లోతయిన పరిశీలన అవసరమైన అంశం. సమకాలీన ఆధారాలు చూస్తే హైదరాబాద్ రాష్ట్రం చారిత్రకంగా భిన్న భాషల సమాహారంగా కొన్ని వందల సంవత్సరాలు కొనసాగింది గనుక అట్లాగే కొనసాగాలని భావించిన వారు, లేదా, తెలుగు జిల్లాలు ఒక



ప్రత్యేక రాష్ట్రంగా ఏర్పరచాలనే వారు అత్యధిక సంఖ్యాకులుగా ఉన్నారనేది కనబడుతుంది. ఫజల్ అలీ కమీషన్ ముందుకు వచ్చిన వాంగ్మూలాలతో, మహజరులలో ఆ కోరికలే వ్యక్తమయ్యాయి. అప్పటి హైదరాబాద్ రాష్ట్ర కాంగ్రెస్‌లో ఒక పక్షం, అప్పటి కమ్యూనిస్టు పార్టీ నాయకత్వం, సాహిత్యకారులు, బహుశా కొందరు ప్రజలు కూడా విశాలాంధ్ర ఏర్పడాలని కోరుకున్నారని కూడా సమకాలిక ఆధారాలు చూపుతున్నాయి. ఈ మూడు రకాల అభిప్రాయాలలో ఏది అత్యధిక సంఖ్యాకుల అభిప్రాయమనేది తేల్చడానికి జనాభిప్రాయ సేకరణ ఏదీ జరగకపోయినా, ఫజల్ అలీ కమీషన్ హైదరాబాద్ రాష్ట్రంలోని తెలుగు జిల్లాలను వేరు చేసి ప్రత్యేక రాష్ట్రంగా ఉంచాలని సిఫారసు చేసింది. తెలంగాణ ప్రజల మనసులలోని అనుమానాలను నివృత్తి చేసేలా ఆంధ్రప్రజల వైఖరి ఉంటే ఆ తర్వాతి ఎన్నికలలో విలీనం సంగతి ఆలోచించవచ్చునని సూచించింది. కాని ఫజల్ అలీ కమిషన్ సిఫారసు విశాలాంధ్ర ఏర్పాటుకు అనుకూలంగా లేదు గనుక దాన్ని విస్మరించాలని, ఆంధ్రప్రదేశ్ ఏర్పాటు చేయాలని కేంద్రప్రభుత్వం భావించింది. హైదరాబాద్ రాష్ట్ర కాంగ్రెస్ లో ప్రత్యేక రాష్ట్ర ఆలోచనలు ఉన్న నాయకుల మెడలు వంచి ఆంధ్రప్రదేశ్ ఏర్పాటుకు అంగీకరింపజేసింది.

కనుక 1948 సెప్టెంబర్ 18 నుంచి 1956 నవంబర్ 1 వరకు ఎనిమిది సంవత్సరాల పాటు, ఇంకా కచ్చితంగా చెప్పాలంటే 1953 అక్టోబర్ 1 న ఆంధ్ర రాష్ట్రం ఏర్పాటయిన నాటి నుంచి 1956 నవంబర్ 1 వరకు మూడు సంవత్సరాలపాటు కేంద్రప్రభుత్వంలో, ఆంధ్ర, హైదరాబాదు రాష్ట్ర ప్రభుత్వాలలో, భారత జాతీయ కాంగ్రెస్ కేంద్ర, ఆంధ్ర, హైదరాబాద్ నాయకత్వాలలో, భారత కమ్యూనిస్టు పార్టీలో, విభిన్న రాజకీయ, సాంస్కృతిక సంచలనాలలో జరిగిన వ్యవహారాలన్నీ వివరంగా అర్థం చేసుకున్నప్పుడు మాత్రమే ఎవరి ప్రయోజనాల కొరకు, ఏ భిన్నాభిప్రాయాలను అణగదొక్కి ఆంధ్రప్రదేశ్ ఏర్పాటు జరిగిందో అర్థమవుతుంది. అటువంటి వివరమైన పరిశోధనకు మార్గం ఏర్పరచడమే ఈ పుస్తక లక్ష్యం.

ఇక పెద్ద మనుషుల ఒప్పందం గురించి, తెలంగాణ ప్రాంత నాయకుల అంగీకారంతోనే ఆంధ్రప్రదేశ్ ఏర్పడిందనే వాదన గురించి కూడా అధికారిక చరిత్ర అర్థ సత్యాల మీద ఆధారపడిందని చెప్పడానికి ఎన్నో ఆధారాలున్నాయి. అది అంతవరకూ కొనసాగిన రెండు రాష్ట్రాల ముఖ్యమంత్రులు, రెండు రాష్ట్రాల మంత్రివర్గాలలోని సీనియర్ సభ్యులు, రెండు రాష్ట్రాల కాంగ్రెస్ నాయకులు కుదుర్చుకున్న ఒప్పందం. దానిలోని హామీలను పాటించక పోతే, ఉల్లంఘిస్తే పరిహారం ఏమిటనే విషయం దానిలో ఎక్కడా స్పష్టంగా రాయలేదు గనుక అది ఒక చట్టసమ్మతమైన ఒప్పందం కాజాలదు. ఆ విషయం అర్థం అయినందు వల్లనే ఆ ఒప్పందంలోని అంశాలకు చట్టబద్ధత కల్పించడానికి ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వం ఎన్నో

ఉత్తర్వులు జారీ చేసింది. కాని ఆ తర్వాత ఆ ఒప్పందాలు, ఆ చట్టబద్ధ ఉత్తర్వులు కూడ చెత్తబుట్టలో చేరిపోయాయి. అలాగే పెద్ద మనుషుల ఒప్పందాన్ని ప్రజానాయకుల అంగీకారం అనడం కూడ సరయినది కాదు. అప్పటికి రెండు రాష్ట్రాలలోనూ ఎన్నికయిన ప్రభుత్వాలు మాత్రమే కాక, విభిన్న ప్రజా సమూహాలకు ప్రాతినిధ్యం వహించే రాజకీయ, సామాజిక, సాంస్కృతిక బృందాలెన్నో ఉన్నాయి. అటువంటి డజన్ల కొద్దీ బృందాలలో ఒక్క కాంగ్రెస్ రాష్ట్ర అధ్యక్షులను మాత్రమే ఆ ఒప్పందం సంతకం దార్లుగా ఎలా ఎంపిక చేశారో తెలియదు. అలాగే, నిశితంగా పరిశీలిస్తే, పెద్ద మనుషుల ఒప్పందం రెండు ప్రాంతాల మధ్య కుదిరిన అంగీకారం కాదు, అది ఒక ప్రాంతం అన్యాయానికి గురవుతుందేమోననే అనుమానంతో, అలా జరగనివ్వబోమని మరొక ప్రాంతం రాసి ఇచ్చిన రక్షణల, హామీల పత్రం. అది తెలంగాణకు అనుకూలమైన షరతులకు ఆంధ్ర నాయకులు అంగీకరించి రాసి ఇచ్చిన ఒప్పందాల పత్రం. అంటే సమైక్య రాష్ట్రం ఏర్పాటు షరతుల మీద జరిగినదే తప్ప, అంగీకారం మీద జరిగినది కాదు. అడుగడుగునా ఆ షరతుల ఉల్లంఘన జరిగినందు వల్ల ఆంధ్రప్రదేశ్ ఏర్పాటుకు ప్రాతిపదికే రద్దయిపోయినట్టవుతుంది. అందువల్ల 1956 నవంబర్ 1కి పునాది ఆ తర్వాతి కాలంలో లేకుండా పోయిందని తేలుతుంది.

ఈ స్థూలమైన అవగాహనలతో, భవిష్యత్ పరిశోధనలకూ, విశ్లేషణకూ సూచికలుగా ఉపయోగపడగల ఆలోచనలతో ఈ పుస్తకాన్ని ప్రచురిస్తున్నాం. భవిష్యత్తులో మరింత నిర్దిష్టమైన పరిశోధన జరుగుతుందనీ, ఆ పరిశోధనకు ఇది ఒక తొలి మెట్టు కావాలనీ ఆశిస్తున్నాం.



# రాష్ట్రాల ఏర్పాటు - ప్రాతిపదికలు

తెలంగాణ ప్రజలు నవంబర్ 1న విద్రోహ దినాన్ని పాటించి నిరసన వ్యక్తం చేయడం, ప్రత్యేక తెలంగాణ రాష్ట్రాన్ని ఏర్పాటు చేయాలని డిమాండ్ చేయడం, ప్రతీ సంవత్సరం జరుగుతున్నది. నవంబర్ 1న అటు ప్రభుత్వం, సీమాంధ్ర పాలక వర్గాలు ఆంధ్రప్రదేశ్ అవతరణ దినోత్సవాన్ని జరుపుకోవటం జరుగుతూ ఉన్నది. ఆ రోజున తెలంగాణ చరిత్రను ఎంత వక్రీకరించి చెప్తారో మనకు తెలవంది కాదు. పొట్టి శ్రీరాములు అమరత్వం కారణంగానే ఆంధ్రప్రదేశ్ ఏర్పాటయ్యిందని, హైదరాబాద్ దానికి రాజధాని నగరమైందని ఒక అబద్ధాన్ని చారిత్రక వాస్తవంగా మన మెదళ్లలోకి సంవత్సరాలుగా ఎక్కిస్తూనే ఉన్నారు. 1956 నవంబర్ 1 కి ముందున్న చరిత్రను, అందులో తెలంగాణ చరిత్రను, తెలంగాణ ప్రజల వీరోచిత పోరాటాలను, మహోన్నతమైన సాహిత్య, సాంస్కృతిక అంశాలను మరుగున పర్చి, తెలుగువారి చరిత్ర అంటె, ఆంధ్రప్రదేశ్ చరిత్ర, ఆంధ్రప్రాంత చరిత్రగానే, తెలుగువారి పోరాటాలంటే ఆంధ్రప్రాంతంలో జరిగిన బ్రిటిష్ వ్యతిరేక పోరాటాలుగానే చిత్రీకరించి తెలుగువారి చరిత్రలో, ఆంధ్రప్రదేశ్ చరిత్రలో తెలంగాణకు స్థానమే లేకుండా చేశారు. ఇటీవలి తెలంగాణ ఉద్యమం తీసుకొచ్చిన ఒత్తిడి ఫలితంగా నిజాం వ్యతిరేక పోరాటాలను, తెలంగాణ సాయుధ రైతాంగ పోరాటాలను సీమాంధ్ర పత్రికలు, మీడియా, సీమాంధ్ర పాలకవర్గాలు పట్టించుకోక తప్పలేదు. 17 సెప్టెంబర్‌న రాష్ట్రంలోని అన్ని రాజకీయ పార్టీల కేంద్ర కార్యాలయాల్లో తెలంగాణ విముక్తి దినాన్ని జరిపి జాతీయ జెండాను ఎగురవేశారు. నిజాం వ్యతిరేక పోరాటంలో, తెలంగాణ సాయుధ రైతాంగ పోరాటంలో పాల్గొన్న సమర యోధులను సత్కరించారు. అదే విధంగా బత్కమ్మ పండుగను, బోనాల పండుగను మీడియా, పత్రికలు బాగానే పట్టించుకొని ప్రసారాలు చేశాయి. వార్తలు, వ్యాసాలు రాసాయి. అయినా ఇప్పటికీ సీమాంధ్ర పాలకవర్గాలు, పత్రికలు, మీడియాలు మాత్రం నవంబర్1, 1956కు ముందున్న చారిత్రక వాస్తవాల్ని మరుగు పర్చి ఇంకా అబద్ధాల్ని నిజాలుగా ప్రజల ముందు ఉంచుతున్నాయి. ఆంధ్రప్రదేశ్ ఏర్పాటుకు,

పొట్టిశ్రీరాములు అమరత్వానికి ఏ సంబంధం లేదు. ఆయన మరణించింది ఆంధ్రరాష్ట్రం ఏర్పాటుకని, ఇంకా చెప్పాలంటె మద్రాసు నగరం కోసమని తెలంగాణ ఉద్యమం గత 15 సంవత్సరాలుగా చెప్తున్నటికీ సీమాంధ్ర పాలకవర్గాలు మాత్రం అబద్ధాన్నే చారిత్రిక వాస్తవంగా ప్రచారం చేస్తున్నారు. నవంబర్ 1, 2008 రోజున ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం పత్రికలకు ఇచ్చిన ప్రకటనలే ఇందుకు తాజా రుజువు. తెలంగాణ ప్రజలు నవంబర్ 1ని విద్రోహ దినంగా జరుపుకోవడానికి ఒక సుధీర్ఘ చారిత్రక నేపథ్యం ఉంది. విద్రోహదినం చరిత్రను ఈనాటి తరానికి తెలియచెయ్యాల్సిన అవసరం ఉన్నది. ఆంధ్రప్రదేశ్ అవతరణనే ఒక విద్రోహ చర్య కనుక ఆంధ్రప్రదేశ్ అవతరణకు దారితీసిన పరిస్థితులను తెలంగాణ దృష్టికోణం నుంచి విశ్లేషించవలసి ఉన్నది. ఇప్పటివరకు మనం విన్న, చదివిన ఆంధ్రప్రదేశ్ చరిత్ర అంతా సీమాంధ్ర పాలకవర్గాల దృష్టికోణంలోంచి రాసిందే. అబద్ధాలతో నిండిన ఆ చరిత్రను తిరస్కరించి మరుగున ఉంచబడిన చారిత్రక వాస్తవాల్ని తవ్వితీసి మనదైన దృష్టికోణం నుంచి విశ్లేషించవలసి ఉన్నది.

## రాష్ట్రాల ఏర్పాటు పరిణామ క్రమం

రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ ఎప్పుడు ప్రారంభమయ్యిందని పరిశీలిస్తే, ఈ ప్రక్రియ రెండు వందల సంవత్సరాల క్రితమే ప్రారంభమయ్యిందని తెలుస్తున్నది. 1857 సిపాయిల తిరుగుబాటును అణిచివేసిన తర్వాత బ్రిటిష్ వలసవాదులు తమ సామ్రాజ్య విస్తరణ కోసం, తమ పరిపాలనా అవసరాల కోసం, తమ సైనిక అనసరాల కోసం, తమ ఆర్థిక దోపిడీని వ్యవస్థీకృతం చేసుకోవడం కోసం కొత్త ప్రావిన్స్‌లను ఏర్పాటు చేస్తూ వచ్చింది. ఈ ప్రావిన్స్‌ల ఏర్పాటులో సహజమైన సాంస్కృతిక సారూప్యతలు, ప్రజల ఉమ్మడి ఆర్థిక ప్రయోజనాలను అసలు పట్టించుకోలేదు. స్థూలంగా చెప్పాలంటే రాష్ట్రాల ఏర్పాటులో స్థానిక ప్రజల ఆకాంక్షలకన్నా బ్రిటిష్ వలసవాదుల ప్రయోజనాలే కీలకంగా పనిచేశాయి. పందొమ్మిదవ శతాబ్దం చివరి నాటికి భారతదేశంలో జాతీయవాదం బలపడింది. జాతీయవాదం ఒత్తిడి ఫలితంగా రాష్ట్రాల ఏర్పాటుకు పరిపాలనా సౌలభ్యమే ప్రాతిపదికగా ఉండే పరిస్థితి మారి ప్రజల భాషా, సాంస్కృతిక, ఆర్థిక ఆకాంక్షలకు ప్రాధాన్యత లభించసాగింది. భారత ప్రజల జాతీయ ఆకాంక్షల్ని ప్రతిబింబించే సంస్థగా భారత జాతీయ కాంగ్రెస్ పందొమ్మిదవ శతాబ్దాంతానికి బలపడింది.



## రాష్ట్రాల ఏర్పాటు - భారత జాతీయ కాంగ్రెస్ వైఖరి

భారత జాతీయ కాంగ్రెస్ మొదటి నుంచీ భాషనే ప్రాతిపదికగా రాష్ట్రాలు ఏర్పడాలని వాదించింది. ఈ వాదాన్ని ముందుకు తేవడానికి 1905లో బెంగాల్ రాష్ట్ర విభజన దోహదం చేసింది. బ్రిటిష్ వలస ప్రభుత్వం బెంగాల్ రాష్ట్రాన్ని రెండు రాష్ట్రాలుగా విడగొట్టింది. అస్సామీ భాషా ప్రాంతాలను, బెంగాలీ భాషీయులైనప్పటికీ ముస్లింలు మెజారిటీగా ఉన్న ప్రాంతాన్ని విడదీసి తూర్పు బెంగాల్ (ఇప్పటి బంగ్లాదేశ్) రాష్ట్రంగా విభజన చేసినపుడు, బెంగాల్ విభజనని వ్యతిరేకిస్తూ బెంగాల్ రాష్ట్రంలోనూ, దేశంలోని బ్రిటిష్ పాలిత ప్రాంతాలలోనూ ఉద్యమాలు చెలరేగాయి. భారత జాతీయ కాంగ్రెస్ బెంగాలీ భాషీయులైన ప్రజలను ఎట్టి పరిస్థితుల్లోనూ విడదీయరాదని వాదిస్తూ దేశవ్యాప్త ఆందోళనలు చేపట్టింది. రాష్ట్రాల ఏర్పాటు భాష ప్రాతిపదికనే జరగాలని వాదించింది. ఆరేండ్ల అనంతరం 1912లో భారత ప్రజలు, ముఖ్యంగా బెంగాలీ ప్రజలు సాగించిన ఉద్యమం ఫలితంగా బ్రిటిష్ ప్రభుత్వం తూర్పు, పశ్చిమ బెంగాల్ ప్రాంతాలను ఏకం చేసింది. అట్లానే బెంగాల్ రాష్ట్రం నుండి అస్సామీ భాషా ప్రాంతాలతో అస్సాం రాష్ట్రాన్ని, హిందీ మాట్లాడే ప్రాంతాలు, ఒరియా మాట్లాడే ప్రాంతాలను, ఆదివాసీ ప్రాంతమైన ఛోటానాగ్‌పూర్‌లను విడదీసి బీహార్-ఒరిస్సా రాష్ట్రాన్ని ఏర్పాటు చేసింది. ఈ ఏర్పాట్ల వల్ల బ్రిటిష్ ప్రభుత్వం ప్రజల ఆకాంక్షలను మొదటిసారి గౌరవించినట్లయ్యింది.

ఆనాటి నుండి భాషా రాష్ట్రాల సిద్ధాంతాన్నే తన విధానంగా భారత జాతీయ కాంగ్రెస్ అనుసరిస్తూ వచ్చింది. 1908లోనే బెంగాల్ రాష్ట్రంలో భాగంగా ఉన్న హిందీ భాషా ప్రాంతానికి కాంగ్రెస్ కమిటీని ప్రకటించింది. 1917లో మద్రాసు రాష్ట్రంలో భాగంగా ఉన్న ఆంధ్రకు, పంజాబ్ రాష్ట్రంలో భాగంగా ఉన్న సింధ్‌కు ప్రత్యేక కాంగ్రెస్ కమిటీలు వేసింది. భారత జాతీయ కాంగ్రెస్ సీనియర్ నాయకులైన అన్నీబీసెంట్ భాషా రాష్ట్రాల సిద్ధాంతాన్ని వ్యతిరేకిస్తున్నప్పటికీ కాంగ్రెస్ భాషా రాష్ట్రాల సిద్ధాంతాన్నే అనుసరించింది. 1920లో నాగ్‌పూర్‌లో జరిగిన జాతీయ మహాసభల్లో కాంగ్రెస్ రాష్ట్రాల ఏర్పాటు భాషా ప్రాతిపదికనే జరగాలని తీర్మానించింది. తన సంస్థాగత నిర్మాణం కూడా అదే ప్రాతిపదికన జరగాలనికూడా తీర్మానించింది. 1927లో బ్రిటిష్ ప్రభుత్వం Indian Statutory commission ని (ఇదే సైమన్ కమీషన్) వేసినప్పుడు భాష ప్రాతిపదికనే రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ జరగాలని, అందులో భాగంగా మొదట ఆంధ్ర, ఉత్కళ్, సింధ్, కర్నాటక రాష్ట్రాలను ఏర్పాటు చెయ్యాలని కమీషన్‌కు నివేదించింది. రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ అంశాన్ని 1928లో అఖిలపక్ష సదస్సు

నియమించిన నెహ్రూ కమిటి కూడా పరిశీలించింది. ప్రజల ఆకాంక్షలు, భాషా సారూప్యత, భౌగోళిక ఏకత, ఆర్థిక స్వయంసమృద్ధిలు ప్రాతిపదికగా రాష్ట్రాల ఏర్పాటు జరగాలని కమిటి అభిప్రాయపడింది. అయితే అధిక ప్రాధాన్యత మాత్రం ప్రజల ఆకాంక్షలకు, భాషకు మాత్రమే ఇవ్వాలని కమిటి సిఫారసు చేసింది.

1928-1947 సంవత్సరాల మధ్య కాంగ్రెస్ అనేక సందర్భాలలో భాషా రాష్ట్రాల ఏర్పాటును సమర్థిస్తూ తీర్మానించింది. 1937 అక్టోబరులో జరిగిన కలకత్తా కాంగ్రెస్‌లో భాషా రాష్ట్రాల ఏర్పాటును సమర్థిస్తూ ఆంధ్ర, కర్నాటక రాష్ట్రాల ఏర్పాటుకు తీర్మానించింది. 1938 జూలైలో వార్ధాలో జరిగిన కాంగ్రెస్ వర్కింగ్ కమిటి సమావేశంలో తాము అధికారంలోకి వస్తే భాషా ప్రాతిపదికన ఆంధ్ర, కర్నాటక, కేరళ రాష్ట్రాలను ఏర్పాటు చేస్తామని ఆయా రాష్ట్రాల ప్రతినిధులకు హామీ ఇచ్చింది. 1945-46లో తమ ఎన్నికల ప్రణాళికలో భాషా, సంస్కృతుల సారూప్యతల ఆధారంగా రాష్ట్రాలను పునర్వ్యవస్థీకరణ జరుపుతామని ప్రతిపాదించింది.

స్వాతంత్ర్యానంతరం కాంగ్రెస్ వైఖరిలో కొద్ది మార్పు కన్పించింది. ఎందుకంటె స్వాతంత్ర్యానంతరం దేశంలో ఏర్పడిన భౌతిక పరిస్థితులు సంక్లిష్టమైనవి. దేశభద్రతకు, దేశ సమైక్యతకు ముప్పు దాపురించిన పరిస్థితి ఏర్పడిందని కాంగ్రెస్ భావించింది. ఆనాడు దేశం ముందున్న సమస్య 600 సంస్థానాలను దేశంలో విలీనం చెయ్యడం. ఈ స్వతంత్ర సంస్థానాలు దేశ భూభాగంలో 45% విస్తీర్ణం కలిగి ఉండేవి. దేశ జనాభాలో 24% సంస్థానాలదే. జూన్ 1947లో బ్రిటిష్ ప్రభుత్వం భారత స్వాతంత్ర్య చట్టాన్ని ఆమోదించింది. ఈ చట్టం ద్వారా బ్రిటిష్ఇండియా భారత్, పాకిస్థాన్ దేశాలుగా విభజన చెందింది. ఆగస్టు 15, 1947న భారత్, పాకిస్థాన్‌లు స్వతంత్ర దేశాలుగా అవతరించాయి. అయితే భారత స్వాతంత్ర్య చట్టం సెక్షన్ 7(1)(బి) ప్రకారం సంస్థానాలపై బ్రిటిష్ ఆధిపత్యం తొలగిపోతుంది. బ్రిటిష్ ప్రభుత్వంతో సంస్థానాలు కుదుర్చుకున్న ఒప్పందాలు రద్దవుతాయి. కాబట్టి వారు భారత్‌లో కలవాలో, పాకిస్థాన్‌లో కలవాలో లేదా స్వతంత్ర రాజ్యంగా ఉండాలో నిర్ణయించుకునే హక్కు స్వేచ్ఛ సంస్థానాలకు లభించింది. దేశ విభజన తర్వాత భారతదేశంలో గవర్నర్ల పాలనలో ఉండే తొమ్మిది ప్రావిన్సులు, చీఫ్ కమీషనర్‌ల పాలనలో ఉన్న అయిదు ప్రావిన్సులు, కొన్ని అదివాసీ ప్రాంతాలు, అండమాన్ నికోబార్ దీవులు (ఉండేవి. ఇవి) భారత ప్రభుత్వం అధీనంలో (ఉండేవి). హైదరాబాద్ సహా 600 స్వతంత్ర సంస్థానాలు ఉండేవి. వీటిలో కొన్ని సంస్థానాలు పాకిస్థాన్‌లో కలువగా అత్యధిక సంస్థానాలు భారత్‌లో కలిసాయి. హైదరాబాద్, జమ్మూకాశ్మీర్, ట్రావన్కూర్,



భోపాల్, ఇండోర్, ధోల్‌పూర్, నభా, జునాగఢ్, జోద్‌పూర్ అనే తొమ్మిది సంస్థానాల ప్రభువులు మాత్రం భారత ప్రభుత్వం ప్రతిపాదించిన విలీన ఒప్పందాలపై సంతకాలు చేయ నిరాకరించారు. వీటిలో 15 ఆగస్టు 1947 నాటికల్లా హైదరాబాద్, జమ్ము కాశ్మీర్, జూనాగడ్‌లు తప్ప మిగతావి భారతదేశంలో కల్సిపోవడానికి నిర్ణయించాయి. భారతదేశ వాయవ్య సరిహద్దులో ఉండే జునాగఢ్ సంస్థాన పాలకుడు జునాగఢ్‌ను పాకిస్థాన్‌లో విలీనం చేయ సంకల్పించారు. అత్యధిక హిందూ జనాభా కలిగిన జునాగఢ్ సంస్థాన ప్రజలు సంస్థాన పాలకునిపై తిరుగుబాటు జరిపి అతన్ని జునాగఢ్ నుండి తరిమివేసారు. నవంబర్ 1947లో జునాగఢ్ దివాన్ భారతప్రభుత్వాన్ని జునాగఢ్ పరిస్థితినీ చక్కదిద్దమనికోరాడు. జునాగఢ్‌లో ప్లెబిసైట్ నిర్వహించి అందులో ప్రకటితమైన ప్రజాభిప్రాయం మేరకు జునాగఢ్‌ని భారత్‌లో ఫిబ్రవరి 1948లో విలీనం చేశారు.

స్వదేశీ సంస్థానాలలో హైదరాబాద్ రాజ్యం అన్నిటికన్నా పెద్దది. సంపద్వంతమైన, శక్తివంతమైన రాజ్యం. హైదరాబాద్ పరిపాలకుడైన మీర్ ఉస్మాన్ అలీఖాన్ భారతయూనియన్‌లో కలువ నిరాకరించి స్వతంత్రంగా ఉండాలని నిర్ణయించుకున్నాడు. హైదరాబాద్ రాజ్యం భారత భూభాగంతో పరివేష్ఠితమై ఉన్న కారణంగా నిజాం భారత ప్రభుత్వంతో యధాతథ ఒప్పందాన్ని కుదుర్చుకున్నాడు. 1948 సెప్టెంబరులో భారత ప్రభుత్వం నిర్వహించిన పోలీస్ ఆక్షన్ అనే మిలటరీ చర్య ద్వారా హైదరాబాద్ రాజ్యం భారత యూనియన్‌లో విలీనం అయ్యింది. జమ్మూకాశ్మీర్ సంస్థానంపై పాకిస్థాన్ దళాలు దాడికి పూనుకోవడంతో జమ్మూకాశ్మీర్ పాలకుడు భారత ప్రభుత్వం శరణుజొచ్చి విలీన ఒప్పందంపై సంతకం చేశాడు. అప్పటికే పాకిస్థాన్ మూడింట ఒక వంతు కాశ్మీర్ భూభాగాన్ని ఆక్రమించుకుంది. ఈ ఘటనల్లో జమ్మూ-కాశ్మీర్ ప్రజలు నిమిత్తమాత్రులుగా ఉండిపోయారు. వారి ఆకాంక్షల్ని ఇరు దేశాల ప్రభుత్వాలు పట్టించుకోలేదు. జమ్మూకాశ్మీర్ ఇప్పటికీ ఒక వివాదంగా రగులుతూనే ఉన్నది. ఈ విధంగా 1950లో భారత రాజ్యాంగం అమల్లోకి వచ్చేనాటికి భారత యూనియన్‌లో ఉన్న రాష్ట్రాలను మూడు గ్రూపులుగా వర్గీకరించారు. 'ఏ' గ్రూపులో 9 గవర్నర్ ప్రావిన్సులు, గ్రూపు 'బి'లో 9 సంస్థానాలు. వీటి అధిపతులుగా సంస్థాన పాలకులను రాజ్‌ప్రముఖ్‌లుగా నియమించారు. గ్రూప్ 'సి'లో రాష్ట్రపతి పాలనలో కొనసాగే 10 రాష్ట్రాలు. వీటికి రాష్ట్రపతి తరపున పాలనాధికారులుగా చీఫ్ కమీషనర్, లెఫ్టినెంట్ గవర్నర్‌లు ఉండేవారు. గ్రూపు 'డి'లో అండమాన్ నికోబార్ దీవులు ఉండేవి.

## ధర్ కమీషన్

ఆగస్టు 1947 నాటికి రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణపై కాంగ్రెస్ తన పూర్వపు వైఖరి నుండి దిగివచ్చి దేశ భద్రత, దేశ సమైక్యతలకే అధిక ప్రాధాన్యత ఇవ్వాలని భావించింది. 27 నవంబర్, 1947న రాజ్యాంగ నిర్ణాయక సభని ఉద్దేశించి ప్రసంగిస్తూ ప్రధాన మంత్రి నెహ్రూ భాషా రాష్ట్రాల ఏర్పాటును సమర్థిస్తూనే ఇపుడు దేశం ముందున్న ప్రధాన సమస్య దేశ భద్రత, దేశ సమైక్యత అని నొక్కి చెప్పాడు. దేశ భద్రతను, దేశ సమైక్యతను దృష్టిలో ఉంచుకొనే రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణకు సిఫారసులు చెయ్యాలని భాషా రాష్ట్రాల కమీషన్‌కు సూచించారు. ఈ కమీషనే 'ధర్ కమీషన్'గా ప్రసిద్ధి పొందింది. డిసెంబర్ 1948లో ధర్ కమీషన్ రాజ్యాంగ నిర్ణాయక సభకు తన నివేదికను సమర్పించింది. ధర్ కమీషన్ రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ భాషాపరంగా జరగాలన్న సిద్ధాంతాన్ని వ్యతిరేకించింది. పరిపాలనా సౌలభ్యమే ప్రధాన ప్రాతిపదిక కావాలని అభిప్రాయపడింది. ఈ పరిమితికి లోబడే భాషా సారుప్యతను పరిగణనలోకి తీసుకోవాలని చెప్పింది. భారత జాతీయతకు భంగం కల్గించే ఏ డిమాండ్‌నైనా తిరస్కరించాలన్నది. రాష్ట్రాల ఏర్పాటు భారత జాతీయతని పెంపొందించే విధంగా ఉండాలన్నది. రాష్ట్రాల ఏర్పాటులో ఆయా ప్రాంతాల చరిత్ర, భౌగోళికత, ఆర్థికం, సంస్కృతి వంటి అంశాలకు కూడా తగిన ప్రాధాన్యత ఇవ్వాలని ప్రతిపాదించారు. ఈ అంశాలన్నింటితీ పరిగణలోనికి తీసుకున్న తర్వాత భాషా సారూప్యత తోడైతే అది అదనపు ప్రయోజనమేనని కమీషన్ అభిప్రాయపడింది. రాష్ట్రాల ఏర్పాటుకు కావల్సిన ప్రాతిపదికలని ధర్ కమీషన్ ఈ విధంగా క్రోడీకరించింది.

1. భౌగోళిక అవిచ్ఛిన్నత (Geographical Contiguity)
2. ఆర్థిక స్వయంసమృద్ధి (Financial Self Sufficiency)
3. పరిపాలనా సౌలభ్యత (Administrative convenience)
4. భవిష్యత్‌లో అభివృద్ధి చెందగలిగే సామర్థ్యం (Capacity for future development)
5. అత్యధిక ప్రజల ఆమోదం (a large measure of agreement amongst the people)



## జె.వి.పి. కమిటి

ధర్ కమీషన్ తన నివేదికను రాజ్యాంగ నిర్ణాయక సభకు సమర్పించిన వెను వెంటనే డిసెంబర్ 1948లో జైపూర్‌లో జరిగిన కాంగ్రెస్ మహాసభల్లో మరో కమిటీని నియమించారు. ధర్ కమీషన్ సిఫారసుల వెలుగులో, స్వాతంత్ర్యానంతరం దేశంలో ఏర్పడిన కొత్త పరిస్థితుల నేపథ్యంలో రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ అంశాన్ని అధ్యయనం చేసి పార్టీకి నివేదిక సమర్పించాలని ఆదేశించింది. ఈ కమిటీయే జెవిపి కమిటిగా ప్రసిద్ధి చెందింది. ఈ కమిటిలో జవహర్‌లాల్ నెహ్రూ, వల్లభాయ్‌పటేల్, పట్టాభిసీతారామయ్య సభ్యులుగా ఉన్నారు. జెవిపి కమిటి ఈ విధంగా తన అభిప్రాయాలను వెల్లడించింది.

1. తొలినాళ్లలో భారతజాతీయ కాంగ్రెస్ భాషారాష్ట్రాల సిద్ధాంతాన్ని ప్రతిపాదించినపుడు దేశంలో ఉన్న అంతర్గత పరిస్థితులు వేరు. ఇపుడున్న పరిస్థితులు వేరు. ఈనాడున్న పరిస్థితుల్లో భాషా రాష్ట్రాల ఏర్పాటు ద్వారా తలఎత్తే పరిణామాలపై కాంగ్రెస్ అధ్యయనం చెయ్యలేదు.

2. ఇవ్వాళ్ల దేశం ముందున్న ప్రధాన సమస్య దేశభద్రత, దేశ సమైక్యత, దేశ ఆర్థికాభివృద్ధి. దేశ సమగ్రతకు, సమైక్యతకు భంగం కలిగించే ఎటువంటి డిమాండ్‌నైనా నిరాకరించాలి.

3. భాష ఒక్కటే ప్రజలను సమైక్యంగా ఉంచే సూత్రం కాదు. అది ప్రజలను చీల్చేందుకు సాధనంగా కూడా పనికివస్తుంది.

4. భాషా రాష్ట్రాలను ఏర్పాటు చేసేటప్పుడు ఒక్కొక్క రాష్ట్రం యొక్క ప్రత్యేక పరిస్థితిని విడిగా పరిగణించి నిర్ణయించాలి. రాష్ట్రంలో ప్రజల మధ్య ఘర్షణలు తలెత్తకుండా జాగ్రత్తపడాలి. ఈ ఏర్పాటు దేశంలో రాజకీయ అస్థిరతకు, ఆర్థిక అనిశ్చితికి కారణం కాకూడదు.

5. భాషా రాష్ట్రం ఏర్పాటుకు బలమైన డిమాండ్ ప్రజలనుండి వచ్చినప్పుడు, నిర్దిష్టమైన ప్రదేశంలో అత్యధిక ప్రజల ఆమోదం ఉన్నప్పుడు అటువంటి డిమాండ్‌ని అంగీకరించవచ్చు. ఆంధ్రరాష్ట్ర ఏర్పాటుతో ఈ ప్రయోగాన్ని ప్రారంభించవచ్చు.

జెవిపి కమిటి నివేదికను కాంగ్రెస్ వర్కింగ్ కమిటి ఏప్రిల్ 1948లో ఆమోదించింది. దీంతో మొట్టమొదటిసారిగా కాంగ్రెస్ పార్టీ తన సాంప్రదాయిక భాషా రాష్ట్రాల సిద్ధాంతానికి తిలోదకాలు ఇచ్చినట్లయ్యింది. అప్పట్నించీ కాంగ్రెస్ స్థూలంగా ఈ నివేదికలోని అభిప్రాయాలకే కట్టుబడి ఉన్నది. 1949లో ఆమోదించిన తీర్మానాల్లో, 1951లో వెలువడిన ఎన్నికల ప్రణాళికలోనూ ఇవి వ్యక్తం అయినాయి. జెవిపి కమిటి నివేదికలో పేర్కొన్నట్లుగా నిర్దిష్టమైన ప్రదేశంలో అత్యధిక ప్రజల ఆమోదం ఉన్న కారణంగానే ఆంధ్రరాష్ట్రాన్ని భాష ఆధారంగా

ప్రకటించింది. అత్యధిక ప్రజల ఆమోదం లేదన్న కారణంగా కర్నాటక రాష్ట్రం ఏర్పాటును మాత్రం ప్రభుత్వం వాయిదా వేసింది. 1953 జనవరిలో హైదరాబాద్‌లో జరిగిన కాంగ్రెస్ మహాసభల్లో తిరిగి రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ అంశం చర్చకు వచ్చింది. కాంగ్రెస్ ఆమోదించిన తీర్మానంలో రాష్ట్రాల ఏర్పాటుకు పరిశీలించవలసిన ప్రాతిపదికలను ప్రాధాన్యతాక్రమంలో చూసినపుడు ఇట్లా ఉన్నాయి. ఎ) దేశ సమైక్యత, బి) దేశ భద్రత, సి) భాషా సాంస్కృతిక సారూప్యత డి) పరిపాలనా సౌలభ్యం ఇ) ఆర్థిక స్వయంసమృద్ధి, ఎఫ్) రాష్ట్ర, దేశ ఆర్థికాభివృద్ధి.

## ఆంధ్రరాష్ట్రం ఏర్పాటు

1949లో జెవిపి కమిటి ఆంధ్రరాష్ట్రం ఏర్పాటుకు స్పష్టమైన సిఫారసు చేసినప్పటికీ రాష్ట్రం ఏర్పాటుకు కాంగ్రేస్ ఎటువంటి చర్యలు తీసుకోలేదు. దీనికి ప్రధాన కారణం మద్రాసు నగరం ఎవరికి చెందాలన్న వివాదమే. కేంద్రప్రభుత్వ నిర్లక్ష్య వైఖరిని నిరసిస్తూ వెంటనే ఆంధ్రరాష్ట్రం ఏర్పాటు చెయ్యాలన్న డిమాండ్‌తో మొదట స్వామి సీతారాం ఆమరణ నిరాహారదీక్షని చేపట్టాడు. 45 రోజుల దీక్ష అనంతరం ఆచార్య వినోబాభావే సలహా మేరకు దీక్ష విరమించారు. మద్రాసు నగరం విషయంలో ఆంధ్రులు, తమిళులు ఒక శాంతియుత అంగీకారానికి రావాలని కేంద్రప్రభుత్వం ఇరు ప్రాంతాల నాయకులకు సూచించింది. ఈ లోపలే పొట్టిశ్రీరాములు ఆమరణ నిరాహార దీక్షకు పూనుకోవడం, 56 రోజుల దీక్ష అనంతరం ఆయన డిసెంబర్ 15, 1952న మరణించడం, అటు తరువాత ఆంధ్రలో పెద్దఎత్తున అల్లర్లు చెలరేగడం, పోలీసు కాల్పుల్లో అనేక మంది బలికావడం వెనువెంటనే జరిగిపోయాయి. ఆంధ్ర ప్రాంతంలో పరిస్థితి అదుపు తప్పుతున్నట్లు తెలియడంతో ప్రధాన మంత్రి నెహ్రూ పొట్టిశ్రీరాములు మరణించిన నాలుగు రోజుల అనంతరం ఆంధ్రరాష్ట్ర ఏర్పాటును అధికారికంగా ప్రకటించారు. ఆంధ్రరాష్ట్రం ఏర్పాటు వల్ల ఏర్పడబోయే ఆర్థిక, పాలనాపర, ఇతర పర్యావసానాలను అధ్యయనం చేసి నివేదిక సమర్పించమని జస్టిస్ వాంచూను నియమించింది కేంద్రప్రభుత్వం. బళ్లారి జిల్లాను ఆంధ్రరాష్ట్రానికే ఇవ్వాలని, అయితే భవిష్యత్‌లో కర్నాటక రాష్ట్రం ఏర్పాటైతే గనుక కన్నడ భాషా ప్రాంతాలను కర్నాటకలో కలపాలని వాంఛూ సిఫారసు చేశాడు. అయితే భారత ప్రభుత్వం బళ్లారి జిల్లాలో మూడు తెలుగు మాట్లాడే ప్రాంతాలను మాత్రమే ఆంధ్రలో కలిపి తక్కిన తాలూకాలను మైసూర్ రాష్ట్రానికి బదలాయించింది. ఆగస్టు 10, 1953న పార్లమెంటులో ఆంధ్రరాష్ట్రం ఏర్పాటును ప్రతిపాదిస్తూ ప్రభుత్వం బిల్లు ప్రవేశపెట్టింది. 17 ఆగస్టు, 1953న బిల్లు పార్లమెంటు ఆమోదం పొందింది. అక్టోబరు 1, 1953న కర్నూలు రాజధానిగా



ఆంధ్రరాష్ట్రం ఉనికిలోకి వచ్చింది.

ఆంధ్రరాష్ట్రం ఏర్పడేనాటికే హైదరాబాద్ రాజధానిగా హైదరాబాద్ రాష్ట్రం ఉనికిలో ఉన్నది. సెప్టెంబర్ 1948లో నిజాం లొంగుబాటుతో హైదరాబాద్ రాజ్యం భారత యూనియన్‌లో విలీనమయ్యింది. సెప్టెంబర్ 1948 నుంచి 1952లో ఎన్నికలు జరిగి ప్రజా ప్రభుత్వం ఏర్పాటు అయ్యేదాక వెల్లోడి అనే సివిల్ అధికారిని పాలనాధికారిగా నియమించింది కేంద్రప్రభుత్వం. 1952లో ఎన్నికలు జరిగి బూర్గుల రామకృష్ణారావు ముఖ్యమంత్రిగా హైదరాబాద్ రాష్ట్రంలో ఒక ప్రజాప్రభుత్వం ఏర్పాటయ్యింది. హైదరాబాద్ రాష్ట్రంలో మూడు భాషాప్రాంతాలు ఉండేవి. మరాఠి మాట్లాడే మరాఠ్వాడ ప్రాంతం, కన్నడ మాట్లాడే కర్నాటక ప్రాంతం, తెలుగు మాట్లాడే తెలంగాణ ప్రాంతం. ఈ మూడు ప్రాంతాలు 600 సంవత్సరాలుగా ఒకే ఏలుబడిలో ఉన్నవి. భిన్న భాషలు, భిన్న సంస్కృతులు వెల్లివిరిసిన రాష్ట్రంగా, నిజమైన సాంస్కృతిక సమ్మేళనానికి ప్రతీకగా హైదరాబాద్ రాష్ట్రం ఆనాడు అందరి దృష్టిని ఆకర్షించింది. ఆనాడు హైదరాబాద్ రాష్ట్రం జనాభా సుమారు 1.87 కోట్లు. ఇందులో 47.8% ప్రజలు తెలుగు, 24.3% మరాఠి, 11.6% ఉర్దూ, 10.5% కన్నడ భాషలు మాట్లాడేవారు. మిగతా 5.8% ప్రజలు ఇతర భాషీయులు. ఇంగ్లీషు అధికార భాషగా, ఉర్దూ, తెలుగు, మరాఠి, కన్నడ భాషలు బోధనా భాషలుగా ఉండేవి. అయితే 1948 వరకు 200 ఏండ్లుగా ఉర్దూ అధికారభాషగా ఉన్నందువల్ల ఈ మూడు ప్రాంతీయ భాషలపై ఉర్దూ ప్రభావం అనివార్యంగా పడింది.

## ఫజల్ అలీకమీషన్

1953లో ఆంధ్రరాష్ట్రం ఏర్పాటుతో దేశవ్యాప్తంగా ప్రత్యేక రాష్ట్రాల డిమాండ్లు వెలువెత్తినాయి. కర్నాటక రాష్ట్రం ఏర్పాటు కోసం సంయుక్త కర్నాటక పరిషత్ ఆధ్వర్యంలో ప్రజాఉద్యమం నిర్మాణం అయింది. 1953లో జరిగిన ఉపఎన్నికల్లో సంయుక్త కర్నాటక పరిషత్ అభ్యర్థులు ఘన విజయం సాధించడంతో కేంద్రప్రభుత్వం తాత్సారం చేయకుండా రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ సంఘాన్ని (States Reorganisation commission - SRC) ఏర్పాటు చేస్తున్నట్లు ప్రకటించింది. డిసెంబర్ 22, 1953న నెహ్రూ ఎస్సార్సీ ఏర్పాటును పార్లమెంటులో అధికారికంగా ప్రకటించాడు. ఆ తర్వాత కేంద్రప్రభుత్వం 29 డిసెంబర్ 1953న జస్టిస్ ఫజిల్ ఆలీ చైర్మన్‌గా, హృదయనాథ్ కుంజ్రూ, కె.ఎం. ఫణిక్కర్‌లు సభ్యులుగా రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ సంఘం ఏర్పాటుకు సంబంధించి ఉత్తర్వులు జారీ చేసింది. కమీషన్

ప్రకటించింది. అత్యధిక ప్రజల ఆమోదం లేదన్న కారణంగా కర్నాటక రాష్ట్రం ఏర్పాటును మాత్రం ప్రభుత్వం వాయిదా వేసింది. 1953 జనవరిలో హైదరాబాద్‌లో జరిగిన కాంగ్రెస్ మహాసభల్లో తిరిగి రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ అంశం చర్చకు వచ్చింది. కాంగ్రెస్ ఆమోదించిన తీర్మానంలో రాష్ట్రాల ఏర్పాటుకు పరిశీలించవలసిన ప్రాతిపదికలను ప్రాధాన్యతాక్రమంలో చూసినపుడు ఇట్లా ఉన్నాయి. ఎ) దేశ సమైక్యత, బి) దేశ భద్రత, సి) భాషా సాంస్కృతిక సారూప్యత డి) పరిపాలనా సౌలభ్యం ఇ) ఆర్థిక స్వయంసమృద్ధి, ఎఫ్) రాష్ట్ర, దేశ ఆర్థికాభివృద్ధి.

## ఆంధ్రరాష్ట్రం ఏర్పాటు

1949లో జెవిపి కమిటి ఆంధ్రరాష్ట్రం ఏర్పాటుకు స్పష్టమైన సిఫారసు చేసినప్పటికీ రాష్ట్రం ఏర్పాటుకు కాంగ్రేస్ ఎటువంటి చర్యలు తీసుకోలేదు. దీనికి ప్రధాన కారణం మద్రాసు నగరం ఎవరికి చెందాలన్న వివాదమే. కేంద్రప్రభుత్వ నిర్లక్ష్య వైఖరిని నిరసిస్తూ వెంటనే ఆంధ్రరాష్ట్రం ఏర్పాటు చెయ్యాలన్న డిమాండ్‌తో మొదట స్వామి సీతారాం ఆమరణ నిరాహారదీక్షని చేపట్టాడు. 45 రోజుల దీక్ష అనంతరం ఆచార్య వినోబాభావే సలహా మేరకు దీక్ష విరమించారు. మద్రాసు నగరం విషయంలో ఆంధ్రులు, తమిళులు ఒక శాంతియుత అంగీకారానికి రావాలని కేంద్రప్రభుత్వం ఇరు ప్రాంతాల నాయకులకు సూచించింది. ఈ లోపలే పొట్టిశ్రీరాములు ఆమరణ నిరాహార దీక్షకు పూనుకోవడం, 56 రోజుల దీక్ష అనంతరం ఆయన డిసెంబర్ 15, 1952న మరణించడం, అటు తరువాత ఆంధ్రలో పెద్దఎత్తున అల్లర్లు చెలరేగడం, పోలీసు కాల్పుల్లో అనేక మంది బలికావడం వెనువెంటనే జరిగిపోయాయి. ఆంధ్ర ప్రాంతంలో పరిస్థితి అదుపు తప్పుతున్నట్లు తెలియడంతో ప్రధాన మంత్రి నెహ్రూ పొట్టిశ్రీరాములు మరణించిన నాలుగు రోజుల అనంతరం ఆంధ్రరాష్ట్ర ఏర్పాటును అధికారికంగా ప్రకటించారు. ఆంధ్రరాష్ట్రం ఏర్పాటు వల్ల ఏర్పడబోయే ఆర్థిక, పాలనాపర, ఇతర పర్యావసానాలను అధ్యయనం చేసి నివేదిక సమర్పించమని జస్టిస్ వాంచూను నియమించింది కేంద్రప్రభుత్వం. బళ్లారి జిల్లాను ఆంధ్రరాష్ట్రానికే ఇవ్వాలని, అయితే భవిష్యత్‌లో కర్నాటక రాష్ట్రం ఏర్పాటైతే గనుక కన్నడ భాషా ప్రాంతాలను కర్నాటకలో కలపాలని వాంఛూ సిఫారసు చేశాడు. అయితే భారత ప్రభుత్వం బళ్లారి జిల్లాలో మూడు తెలుగు మాట్లాడే ప్రాంతాలను మాత్రమే ఆంధ్రలో కలిపి తక్కిన తాలూకాలను మైసూర్ రాష్ట్రానికి బదలాయించింది. ఆగస్టు 10, 1953న పార్లమెంటులో ఆంధ్రరాష్ట్రం ఏర్పాటును ప్రతిపాదిస్తూ ప్రభుత్వం బిల్లు ప్రవేశపెట్టింది. 17 ఆగస్టు, 1953న బిల్లు పార్లమెంటు ఆమోదం పొందింది. అక్టోబరు 1, 1953న కర్నూలు రాజధానిగా



ఆంధ్రరాష్ట్రం ఉనికిలోకి వచ్చింది.

ఆంధ్రరాష్ట్రం ఏర్పడేనాటికే హైదరాబాద్ రాజధానిగా హైదరాబాద్ రాష్ట్రం ఉనికిలో ఉన్నది. సెప్టెంబర్ 1948లో నిజాం లొంగుబాటుతో హైదరాబాద్ రాజ్యం భారత యూనియన్‌లో విలీనమయ్యింది. సెప్టెంబర్ 1948 నుంచి 1952లో ఎన్నికలు జరిగి ప్రజా ప్రభుత్వం ఏర్పాటు అయ్యేదాక వెల్లోడి అనే సివిల్ అధికారిని పాలనాధికారిగా నియమించింది కేంద్రప్రభుత్వం. 1952లో ఎన్నికలు జరిగి బూర్గుల రామకృష్ణారావు ముఖ్యమంత్రిగా హైదరాబాద్ రాష్ట్రంలో ఒక ప్రజాప్రభుత్వం ఏర్పాటయ్యింది. హైదరాబాద్ రాష్ట్రంలో మూడు భాషాప్రాంతాలు ఉండేవి. మరాఠి మాట్లాడే మరాఠ్వాడ ప్రాంతం, కన్నడ మాట్లాడే కర్నాటక ప్రాంతం, తెలుగు మాట్లాడే తెలంగాణ ప్రాంతం. ఈ మూడు ప్రాంతాలు 600 సంవత్సరాలుగా ఒకే ఏలుబడిలో ఉన్నవి. భిన్న భాషలు, భిన్న సంస్కృతులు వెల్లివిరిసిన రాష్ట్రంగా, నిజమైన సాంస్కృతిక సమ్మేళనానికి ప్రతీకగా హైదరాబాద్ రాష్ట్రం ఆనాడు అందరి దృష్టిని ఆకర్షించింది. ఆనాడు హైదరాబాద్ రాష్ట్రం జనాభా సుమారు 1.87 కోట్లు. ఇందులో 47.8% ప్రజలు తెలుగు, 24.3% మరాఠి, 11.6% ఉర్దూ, 10.5% కన్నడ భాషలు మాట్లాడేవారు. మిగతా 5.8% ప్రజలు ఇతర భాషీయులు. ఇంగ్లీషు అధికార భాషగా, ఉర్దూ, తెలుగు, మరాఠి, కన్నడ భాషలు బోధనా భాషలుగా ఉండేవి. అయితే 1948 వరకు 200 ఏండ్లుగా ఉర్దూ అధికారభాషగా ఉన్నందువల్ల ఈ మూడు ప్రాంతీయ భాషలపై ఉర్దూ ప్రభావం అనివార్యంగా పడింది.

## ఫజల్ అలీకమీషన్

1953లో ఆంధ్రరాష్ట్రం ఏర్పాటుతో దేశవ్యాప్తంగా ప్రత్యేక రాష్ట్రాల డిమాండ్లు వెలువెత్తినాయి. కర్నాటక రాష్ట్రం ఏర్పాటు కోసం సంయుక్త కర్నాటక పరిషత్ ఆధ్వర్యంలో ప్రజాఉద్యమం నిర్మాణం అయింది. 1953లో జరిగిన ఉపఎన్నికల్లో సంయుక్త కర్నాటక పరిషత్ అభ్యర్థులు ఘన విజయం సాధించడంతో కేంద్రప్రభుత్వం తాత్సారం చేయకుండా రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ సంఘాన్ని (States Reorganisation commission - SRC) ఏర్పాటు చేస్తున్నట్లు ప్రకటించింది. డిసెంబర్ 22, 1953న నెహ్రూ ఎస్సార్సీ ఏర్పాటును పార్లమెంటులో అధికారికంగా ప్రకటించాడు. ఆ తర్వాత కేంద్రప్రభుత్వం 29 డిసెంబర్ 1953న జస్టిస్ ఫజల్ అలీ చైర్మన్‌గా, హృదయనాథ్ కుంజ్రూ, కె.ఎం. ఫణిక్కర్‌లు సభ్యులుగా రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ సంఘం ఏర్పాటుకు సంబంధించి ఉత్తర్వులు జారీ చేసింది. కమీషన్

ఏం చెయ్యాలో నిర్దేశిస్తూ ఉత్తర్వుల్లో ఈ విధంగా పేర్కొన్నారు.

"కమీషన్ రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణకు సంబంధించిన సమస్యలను, చారిత్రక నేపథ్యాన్ని, ప్రస్తుత పరిస్థితిని, పునర్వ్యవస్థీకరణకు పరిగణించవలసిన అన్ని అంశాలను దృష్టిలో ఉంచుకొని అధ్యయనం చేసి సిఫారసులతో కూడిన నివేదిక సమర్పిస్తుంది. పునర్వ్యవస్థీకరణకు ఏ ప్రతిపాదననైనా పరిశీలించడానికి కమీషన్‌కు స్వేచ్ఛ ఉంది. కమీషన్ సిఫారసుల వెనుక ఉన్న మార్గదర్శక సూత్రాలను, ఏ రాష్ట్రం ఎందువల్ల ఏర్పాటు చెయ్యాలో సూచిస్తూ ప్రభుత్వ పరిశీలనకు పంపుతుంది."

ఫజల్ అలీ నేతృత్వంలోని కమీషన్‌ని కేంద్రప్రభుత్వం స్పష్టంగానే రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ కమీషన్'గా పేర్కొన్నప్పటికీ పత్రికలు మాత్రం దీన్ని 'భాషారాష్ట్రాల కమీషన్'గా తప్పుడు పదజాలంతో సంభోదించాయి. స్వాతంత్ర్యం అనంతరం కాంగ్రెస్ తన పూర్వపు భాషా రాష్ట్రాల సిద్ధాంతాన్ని వదిలేసి దేశ భద్రత, దేశ సమగ్రతలే రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణకు ముఖ్య ప్రాతిపదికలుగా గుర్తించినప్పటికీ కాంగ్రెస్ నాయకులు గాని, పత్రికా విలేఖరులుగాని ఆ సంగతిని పట్టించుకోలేదు. ఫజల్ అలీ కమీషన్ కూడా భాషా ప్రాతిపదికనే సిఫారసులు చేస్తుందని భావించారు.

23 ఫిబ్రవరి 1954న కమీషన్ వ్యక్తులు, ప్రజాసంఘాలు రాతపూర్వకంగా తమ అభిప్రాయాలను సమర్పించాలని కోరుతూ ప్రెస్‌నోట్‌ను జారీ చేసింది. కమీషన్ జారీ చేసిన ప్రెస్‌నోట్‌కు ప్రతిస్పందిస్తూ వ్యక్తులు, ప్రజాసంఘాలు లేఖలు, నివేదికలు, టెలిగ్రాంలు పంపించారు. కమీషన్‌కు అందిన మొత్తం డాక్యుమెంట్లు 1,52,250. వీటిలో అత్యధిక భాగం టెలిగ్రాంలు, తీర్మానాల రూపంలో ఉన్న లేఖలు. వీటిలో 2000 డాక్యుమెంట్లను కమీషన్ నిశితంగా పరిశీలించింది. వీటితోపాటు కమీషన్ దేశవ్యాప్తంగా విస్తృతంగా పర్యటించి వ్యక్తులను, ప్రజాసంఘాల ప్రతినిధులను, రాజకీయ పార్టీల ప్రతినిధులను, సంఘసేవకులను, పత్రికా ప్రతినిధులను మున్సిపాలిటి, జిల్లా బోర్డుల ప్రతినిధులను, సాంస్కృతిక, విద్యా, భాషా వికాసోద్యమ ప్రతినిధులను కలుసుకొని వారి అభిప్రాయాలను సేకరించింది. కమీషన్ 22 నెలల కాలంలో 38,000 మైళ్లు ప్రయాణించి, దేశవ్యాప్తంగా 104 ప్రదేశాలను సందర్శించి, 9000 మందిని ఇంటర్వ్యూ చేసింది. 10 అక్టోబరు, 1955న కమీషన్ 267 పేజీల సిఫారసులతో కూడిన నివేదికను ప్రభుత్వానికి సమర్పించింది. కమీషన్ రిపోర్టును నాలుగు భాగాలుగా విభజించింది. మొదటి భాగంలో రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ సమస్యలు, వాటి చారిత్రక నేపథ్యాన్ని చర్చించింది. రెండోభాగంలో పునర్ వ్యవస్థీకరణ ప్రాతిపదికలను



చర్చించింది. మూడోభాగంలో పునర్వ్యవస్థీకరణ ప్రతిపాదనలు, సిఫారసులు ఉన్నాయి. నాలుగో భాగంలో పునర్వ్యవస్థీకరణ వల్ల తలఎత్తే పాలనాపరమైన సమస్యలు వాటి పరిష్కారానికి సూచనలు ఉన్నాయి.

రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ కోసం ఫజల్ అలీ కమీషన్ కొన్ని ప్రాతిపదికలను గుర్తించింది. అవి ప్రాధాన్యతా క్రమంలో...

1. భారతదేశ సమైక్యతను, దేశ భద్రతను పరిరక్షించి పెంపొందించాలి.
2. భాషా సాంస్కృతిక సారూప్యత
3. ఆర్థిక స్వయం సమృద్ధి, ఆర్థికాభివృద్ధి, పరిపాలనా సౌలభ్యం.
4. జాతీయ ప్రణాళికలను విజయవంతంగా అమలు పరచడం.

పైన పేర్కొన్న ప్రాతిపదికలన్నింటిని కూలంకషంగా చర్చించి, విశ్లేషించి కమీషన్ ఈ క్రింది నిర్ధారణలకు వచ్చింది.

☞ రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ భాషా లేదా సంస్కృతిని మాత్రమే ప్రాతిపదికలుగా తీసుకొని చేయడం సాధ్యంకాదు. వాంఛనీయం కూడా కాదు. అయితే సమతుల్యత కల్గిన మార్గాన్ని, దేశ సమైక్యతను దృష్టిలో ఉంచుకొని ఎంచుకోవాలి.

☞ సమతుల్యత అనగా భాషా పరమైన సారూప్యత పరిపాలనా సౌలభ్యతకు అనుకూలంగా ఉండాలి. పరిపాలనా సౌలభ్యత, ఆర్థిక స్వయం సమృద్ధి, రాజకీయ సుస్థిరత తదితర అంశాలపై భాషా సారూప్యతది పైచేయి కారాదు.

☞ 'ఒక భాష-ఒక రాష్ట్రం' అన్న వాదన న్యాయమైంది కాదు. ఎందుకంటే ఒక భాష మాట్లాడే ప్రజలకు ఒకటికన్న ఎక్కువ రాష్ట్రాలు ఉండే అవకాశం ఉన్నది. ఈ ఏర్పాటు కూడా భాషా సారూప్యతకు వ్యతిరేకం కాదు. హిందీ మాట్లాడే ప్రజలకు విశాలమైన ఒకే రాష్ట్రాన్ని ఏర్పర్చటం సాధ్యంకాదు, ఆచరణీయమూ కాదు. భాషా సారూప్యతకు విఘాతం కలుగకుండానే ఒక భాషకు ఒకటి కన్నా ఎక్కువ రాష్ట్రాలను ప్రతిపాదించవచ్చు.

☞ సంస్కృతిని భాషకు విడిగా ఒక స్వతంత్ర ప్రాతిపదికగా మేం ఆంగీకరించలేము. సంస్కృతికి పరిమితికి మించిన ప్రాధాన్యత ఇవ్వడానికి మేం సుముఖంగా లేము.

☞ భాషా రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణలో ఆర్థిక స్వయంసమృద్ధి అత్యంత కీలకమైన ప్రాతిపదిక అని మేం భావిస్తున్నాం. అయితే మిగతా ప్రాతిపదికలను కూడా పరిగణనలోకి తీసుకొని సమతుల్యతతో జాతీయ ప్రయోజనాలను దృష్టిలో ఉంచుకొని నిర్ణయించాలి.

☞ రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ ప్రతిపాదనలను రూపొందించేటప్పుడు ఏదేని ఒక్క ప్రాతిపదికను కాక రాష్ట్రాల ప్రత్యేక పరిస్థితులను మొత్తంగా బేరీజు వేసుకొని మాత్రమే నిర్ణయించాము.

ఫజల్ అలీ కమీషన్ రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణలో హైదరాబాద్ రాష్ట్రానికి చాలా ప్రాధాన్యతను ఇచ్చింది. హైదరాబాద్ రాష్ట్రంలో మూడు భాషా ప్రాంతాలు ఉండడంతో దక్షిణ భారతదేశంలో హైదరాబాద్ రాష్ట్రం భవిష్యత్తు కీలకంగా మారింది. హైదరాబాద్ రాష్ట్రం భాషా ప్రాతిపదికన పునర్వ్యవస్థీకరణ జరగాలన్న విషయంపై రాష్ట్రంలో ఎవరికీ భేదాభిప్రాయం పెద్దగా లేదు. అయితే తెలంగాణ ప్రాంతాన్ని విడిగా రాష్ట్రంగా ఉంచాలా లేదా ఆంధ్రతో కలిపి విశాలాంధ్రను ఏర్పర్చాలా అన్న విషయంలో రాష్ట్ర కాంగ్రెస్ నాయకుల్లోనే భేదాభిప్రాయాలు ఉండేవి. ముఖ్యమంత్రి బూర్గుల రామకృష్ణారావు, కొండా వెంకట రంగారెడ్డి, మర్రి చెన్నారెడ్డిలు తెలంగాణ ప్రత్యేక రాష్ట్రంగా కొనసాగాలని వాదిస్తే ప్రదేశ్ కాంగ్రెస్ అధ్యక్షులు స్వామి రామానందతీర్థ, వినాయకరావు విద్యాలంకార్ తదితరులు తెలంగాణను ఆంధ్రతో కలిపి విశాలాంధ్ర ఏర్పాటు చెయ్యాలని వాదించారు.

## విశాలాంధ్ర వాదం

విశాలాంధ్రవాదుల వాదన ఏమిటంటె... ప్రస్తుతం ఆంధ్రరాష్ట్రానికి రాజధాని ఒక సమస్యగా ఉన్నది. విశాలాంధ్ర ఏర్పాటు వల్ల ఆంధ్రకి రాజధాని సమస్య తీరిపోతుంది. తెలంగాణ, ఆంధ్ర రెండు విడివిడి రాష్ట్రాలుగా ఉంటె గోదావరి, కృష్ణా నీటి వినియోగంలో వివాదాలు ముందుకు వచ్చి సాగునీటి రంగం అభివృద్ధి కుంటుపడ్తుంది. విశాలాంధ్ర ఏర్పాటు వల్ల కృష్ణా, గోదావరి జలాలలను అభివృద్ధికరంగా వినియోగించుకొనే ప్రయత్నాలు ఏకీకృత నియంత్రణ కిందకి వస్తాయి. తెలంగాణను కలుపుకున్న విశాలాంధ్ర తగినంత తీరప్రాంతం, జల, విద్యుత్, వనరుల సమృద్ధి, చాలినంత ఖనిజ సంపద, విలువైన ముడిసరుకులు కలిగిన 32 మిలియన్ల జనాభా ఉన్న ఒక పెద్ద రాష్ట్రంగా అవతరిస్తుంది.



## తెలంగాణ వాదం

తెలంగాణ వాదుల వాదన ఏమిటంటే... ఆంధ్ర రాష్ట్రం అవతరించినప్పటి నుండీ ఆర్థిక సమస్యలను ఎదుర్కొంటున్నది. తెలంగాణతో పోల్చితే ఆంధ్ర రాష్ట్రంలో తలసరి ఆదాయం తక్కువ. లోటు బడ్జెటు. మరోవైపు హైదరాబాద్ రాష్ట్రంలో ఎక్సైజ్ ఆదాయం ఏటా 5 కోట్లు ఉంది. మిగులు బడ్జెట్‌తో రాష్ట్ర ఆర్థిక పరిస్థితి మెరుగ్గా ఉంది. విశాలాంధ్ర ఏర్పాటు వల్ల తెలంగాణ ఆదాయాన్ని ఆంధ్ర ప్రాంతం లోటును తీర్చడానికి, ఆంధ్ర అభివృద్ధి పథకాలకు ఖర్చు పెడతారు. కృష్ణా, గోదావరి జలాల వినియోగంపై ఇపుడున్న స్వతంత్ర హక్కులను వదులుకోవాల్సివస్తుంది. విద్య, ఉద్యోగాలలో అభివృద్ధి చెందిన కోస్తా ప్రజలు విద్యాపరంగా వెనుకబడిన తమను ముంచెత్తుతారని, తమ ప్రయోజనాలను కొల్లగొడతారని తెలంగాణ ప్రజలు భయపడుతున్నారు. ఆంధ్ర-తెలంగాణ విలీనం వల్ల తెలంగాణ ప్రాంతానికి ఎటువంటి లాభం ఉండకపోగా తాము అన్నిరంగాలలో దోపిడీకి, అన్యాయానికి గురి అయిపోతామని వారి అనుమానం. (తెలంగాణ ప్రజల ఈ భయాందోళనలు అన్నీ నిజమేనని 50 ఏండ్ల సమైక్యరాష్ట్ర చరిత్ర రుజువు చేసింది.)

## ఫజల్ అలీ కమీషన్ సిఫారసులు

ఇటువంటి భిన్న వాదాలను ఫజల్ అలీ కమీషన్ క్షుణ్ణంగా పరిశీలించి తన సిఫారసులను ఈ విధంగా నమోదు చేసింది. (పూర్తి పాఠం అనుబంధంలో చదవండి).

“ఈ అంశాలు అన్నింటిని దృష్టిలో ఉంచుకొని మేము ఒక నిర్ధారణకు వచ్చాము. ఆంధ్ర, తెలంగాణ రాష్ట్రాల ప్రయోజనాల దృష్ట్యా ప్రస్తుతానికి తెలంగాణ రాష్ట్రం ఒక ప్రత్యేక రాష్ట్రంగా అవతరించాలి. దానిని హైదరాబాద్ రాష్ట్రంగా పిలువవచ్చు. అయితే 1961లో లేదా ఆ దరిదాపుల్లో జరుగబోయే సార్వత్రిక ఎన్నికల తర్వాత హైదరాబాద్ రాష్ట్ర శాసన సభలోని మూడింట రెండు వంతుల మంది సభ్యులు సమ్మతిస్తే ఆంధ్రతో ఏకీకరణ చెందేలా నిబంధనను పొందుపర్చాలి”. (పేరా. 386, SRC Report)

పేరా 388లో కమీషన్ ఈ క్రింది విధంగా పేర్కొంది.

“ఆంధ్ర, తెలంగాణలకు ఉమ్మడి ప్రయోజనాలు ఉన్నాయి. ఈ ప్రయోజనాలు ఈ రెండు ప్రాంతాల ప్రజలను సన్నిహితం చేయగలవని మేము ఆశిస్తున్నాం. అయితే మేం ఆశించినట్లు రెండు ప్రాంతాల ఏకీకరణకు తోడ్పడగల వాతావరణం వృద్ధి చెంది, సానుకూల పరిస్థితులు

సృష్టించని పక్షంలో, తెలంగాణ ప్రజల మనోభావాలు ఏకీకరణకు వ్యతిరేకంగా స్పష్టరూపును ధరించిన పక్షంలో తెలంగాణ ప్రత్యేక రాష్ట్రంగా కొనసాగుతుంది" (పే-388, SRC Report).

"ప్రస్తుతానికి ఏర్పర్చవలసిన హైదరాబాద్ రాష్ట్రం (ఈ విభాగాన్ని ఇలాగే పేర్కొనడానికి మేం ఇష్టపడుతున్నాం) - మహబూబ్‌నగర్, నల్లగొండ, ఖమ్మం సహా వరంగల్, కరీంనగర్, ఆదిలాబాద్, నిజామాబాద్, హైదరాబాద్, మెదక్, బీదర్, ప్రస్తుత ఆంధ్రరాష్ట్రంలోని కృష్ణాజిల్లాలో నల్లగొండ జిల్లాను ఆనుకొని ఉన్న మునగాల లతో ఏర్పర్చాలి" (పే.389, SRC Report).

హైదరాబాద్ రాష్ట్రంకు సంబంధించి కమీషన్ సిఫారసులు, వాటి వెనుక కమీషన్ పరిశీలించిన వాస్తవాలను విశ్లేషించుకున్నప్పుడు కమీషన్ సభ్యులు తమ మేధస్సును, అనుభవాలని గరిష్ట స్థాయిలో వినియోగించి నివేదికను తయారు చేసినట్లుగా మనకు బోధపడ్తుంది. (ఇవ్వాళ తెలంగాణ అంశాన్ని తేల్చడానికి రెండో ఎస్సార్సీని వేయాలని డిమాండ్ చేస్తున్నవారు ఫజల్ అలీ కమీషన్ నివేదికను చదవాలి. వారు రెండో ఎస్సార్సీ చర్చించడానికి ఏ అంశాన్నీ వదిలిపెట్టలేదు) ఇంతటి వివేకవంతమైన సిఫారసులను కేంద్రప్రభుత్వం ఎట్లా బుట్టదాఖలు చేసి తన ఇష్టానుసారం రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణను చేపట్టిందో పరిశీలించాలి.

కమీషన్ తన నివేదికను సెప్టెంబర్ 30, 1955న సమర్పిస్తే కేంద్రప్రభుత్వం జనవరి 16, 1956న తన నిర్ణయాలను ప్రకటించింది. ఏప్రిల్, 1956లో పార్లమెంటులో ప్రవేశపెట్టిన రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ బిల్లు జూలై 1956లో ఆమోదం పొంది 1 నవంబర్ 1956 నుండి అమలులోకి వచ్చింది. కమీషన్ 16 రాష్ట్రాలను, 3 కేంద్రపాలిత ప్రాంతాలను ఏర్పాటు చెయ్యాలని సిఫారసు చేసింది. ఇందులో భాషారాష్ట్రాలు ఉన్నాయి, ఒక భాషకు ఒకటి కన్నా ఎక్కువ రాష్ట్రాలు ఉన్నాయి. మిశ్రమ భాషా రాష్ట్రాలు కూడా ఉన్నాయి. వాటి వివరాలను కింది పట్టికలో చూడవచ్చు.

| | రాష్ట్రం | భాష | విస్తీర్ణం (చ.మై) | జనాభా (మిలియన్లు) |
|---|---|---|---|---|
| 1. | మద్రాసు | తమిళం | 50170 | 30.0 |
| 2. | కేరళ | మళయాళం | 14980 | 13.6 |
| 3. | కర్నాటక | కన్నడ | 72730 | 19.0 |
| 4. | హైదరాబాద్ | తెలుగు | 45300 | 11.3 |
| 5. | ఆంధ్ర | తెలుగు | 64950 | 20.90 |
| 6. | బొంబాయి | మరాఠి, గుజరాతి | 151360 | 40.20 |
| 7. | విదర్భ | మరాఠి | 36880 | 7.60 |
| 8. | మధ్యప్రదేశ్ | హిందీ | 171200 | 26.10 |
| 9. | రాజస్థాన్ | రాజస్థానీ | 132300 | 16.0 |
| 10. | పంజాబ్ | పంజాబి, హిందీ | 58140 | 17.20 |
| 11. | ఉత్తరప్రదేశ్ | హిందీ | 113410 | 63.20 |
| 12. | బీహార్ | హిందీ | 66,520 | 38.50 |
| 13. | పశ్చిమబెంగాల్ | బెంగాలీ | 34590 | 26.50 |
| 14. | అస్సాం | అస్సామీ | 89040 | 9.70 |
| 15. | ఒరిస్సా | ఒరియా | 60140 | 14.60 |
| 16. | జమ్మూ & కాశ్మీర్ | కశ్మీరీ & హిందీ | 92780 | 4.40 |

**కేంద్రపాలిత ప్రాంతాలు**

| | | | | |
|---|---|---|---|---|
| 1. | ఢిల్లీ | హిందీ | 578 | 1.74 |
| 2. | మణిపూర్ | మణిపూరీ | 8628 | 0.57 |
| 3. | అండమాన్ & నికోబార్ | ఆదివాసీ భాషలు | 3215 | 0.03 |

(1 మిలియన్ = 10 లక్షలు ; అంకెలు 1955 నాటివని గమనించాలి)

పై పట్టికను గమనించినపుడు 16 రాష్ట్రాల్లో - తెలుగు భాష మాట్లాడే ప్రజలకు రెండు రాష్ట్రాలు, హిందీ మాట్లాడే ప్రజలకు మూడు రాష్ట్రాలు, మిశ్రమ భాషా రాష్ట్రాలు మూడు, భాషా రాష్ట్రాలు ఎనిమిది ఉన్నట్లుగా తెలుస్తున్నది. పైన సూచించిన రాష్ట్రాలకు భిన్నంగా ప్రభుత్వం 14 రాష్ట్రాలను, 6 కేంద్రపాలిత ప్రాంతాలను ఏర్పాటు చెయ్యాలని నిర్ణయించింది. కమీషన్ మధ్యప్రదేశ్ రాష్ట్రంలోని మరాఠి భాషా ప్రాంతాలయిన బుల్దానా, అకోలా, అమరావతి, యవత్మాల్, వార్ధా, నాగ్‌పూర్, భండారా, చాందా జిల్లాలతో ప్రత్యేక విదర్భ రాష్ట్రాన్ని ఏర్పాటు చెయ్యాలని సిఫార్సు చేస్తే, ఆ సిఫార్సును అప్పుడూ అమలు చెయ్యలేదు. ఆ తర్వాత 50 ఏండ్లలోనూ అమలు చెయ్యలేదు. ఇక హైదరాబాద్ రాష్ట్రం విషయానికి వస్తే హైదరాబాద్

రాష్ట్రంలోని మరాట్వాడా జిల్లాలను బొంబాయి రాష్ట్రంలో, కన్నడ భాషా జిల్లాలను కర్నాటకలో కలపాలన్న సిఫారసును అమలు చేసి, తెలంగాణ ప్రత్యేక రాష్ట్రంగా ఉండాలన్న సిఫారసును బుట్టదాఖలు చేసి, తెలంగాణ-ఆంధ్ర ప్రాంతాలను కలిపి ఆంధ్రప్రదేశ్ రాష్ట్రాన్ని ఏర్పాటు చేసింది. కమీషన్ హర్యానా, జార్ఖండ్, నాగాలాండ్ రాష్ట్రాలు ఏర్పాటు చేయనక్కరలేదని సూచించింది. అప్పటికి ఆ సిఫారసును ఆమోదించినా ఆ తర్వాత రాజకీయ కారణాల వల్ల 1963లో నాగాలాండ్, 1966లో హర్యానా, 1998లో జార్ఖండ్ ప్రత్యేక రాష్ట్రాలను ఏర్పాటు చేసింది. ఇవిగాక 1956 నుండి ఇప్పటిదాకా గుజరాత్, ఛత్తీస్‌గడ్, ఉత్తరాఖండ్, మణిపూర్, గోవా, ఢిల్లీ, త్రిపుర, మేఘాలయ, అరుణాచల్ ప్రదేశ్, సిక్కిం, రాష్ట్రాలను ఎటువంటి ఎస్సార్సీ సిఫారసులు లేకుండానే ఏర్పాటు చేసింది.

## ఆంధ్రప్రదేశ్ ఏర్పాటు - విద్రోహ పర్వం

తెలంగాణ విషయంలో ఎస్సార్సీ సిఫారసులు బుట్టదాఖలు కావడానికి కాంగ్రెస్ ప్రధానకారణం. కాంగ్రెస్ అనుసరించిన కుట్ర పూరిత విధానాలు. హైదరాబాద్ కాంగ్రెస్ నాయకత్వంలో ఉన్న బేధాభిప్రాయాలను ఆంధ్ర నాయకులు పావుగా వాడుకొని విలీనాన్ని సంభవింపచేశారు. విశాలాంధ్ర ఏర్పాటుకు ప్రధానమంత్రి నెహ్రూ కూడా వ్యతిరేకమే. అక్టోబరు 1953లో పత్రికా విలేఖరులతో మాట్లాడుతూ విశాలాంధ్ర భావన వెనుక దోపిడీ దురుద్దేశ పూరిత సామ్రాజ్యవాద భావాలున్నాయి అని అభిప్రాయపడినాడు. ఫజల్ అలీ కమీషన్ సిఫారసులు సహజంగానే విశాలాంధ్రవాదులను ముఖ్యంగా ఆంధ్రప్రాంత నాయకులైన బెజవాడ గోపాలరెడ్డి, నీలం సంజీవరెడ్డి, అయ్యదేవర కాళేశ్వరరావు, వావిలాల గోపాలకృష్ణయ్య మొదలైనవారిని నిరాశపర్చాయి. కలవరానికి గురిచేశాయి. తెలంగాణవాదులైన బూర్గుల రామకృష్ణారావు, కొండావెంకట రంగారెడ్డి, మర్రి చెన్నారెడ్డి తదితరులు సంతోషించారు, హర్షం వెలిబుచ్చారు. 1961 దాకా విశాలాంధ్ర ఏర్పాటును వాయిదా వేయాలన్న కమీషన్ సూచనను వమ్ము చేయడానికి ఆంధ్రనాయకులు ఢిల్లీకి పరుగులు తీసారు. ఢిల్లీలో జాతీయనాయకులతో తమకున్న పరిచయాలతో నెహ్రూ లాంటి విశాలాంధ్ర వ్యతిరేకులను సైతం బుట్టలో వేసుకున్నారు. తెలంగాణలో బలంగా ఉన్న కమ్యూనిస్టుపార్టీ విశాలాంధ్రకు మద్దతు పలికింది. తెలుగు ప్రజలకు ఒక్కటే రాష్ట్రం ఉంటే తెలుగు భాషా సంస్కృతులు వికాసం పొందుతాయన్న భావన కాళోజీ, దాశరథి లాంటి తెలంగాణ కవులను, మేధావులను కూడా ఆకర్షించి వారిని విశాలాంధ్రకు అనుకూలంగా మార్చింది.



మరోవైపు ఆంధ్ర నాయకత్వం తెలంగాణకు కోరినన్ని రక్షణలు కల్పిస్తామన్న హామీలు ఇచ్చింది. అసెంబ్లీలో తీర్మానాలు చేసింది. నవంబర్ 25, 1955 రోజున ఆంధ్ర అసెంబ్లీలో ముఖ్యమంత్రి బెజవాడ గోపాలరెడ్డి ప్రవేశపెట్టగా అసెంబ్లీ ఈ కింది తీర్మానాన్ని ఆమోదించింది.

"తెలంగాణ ప్రాంతాన్ని అభివృద్ధి పరచడమనేది ప్రత్యేక బాధ్యతగా భావిస్తాము.

ఉద్యోగ అవకాశాలలో, విద్యా సంస్థలలో ఆ ప్రాంతానికి జనాభా ప్రాతిపదికమీద రక్షణలు కల్పిస్తాము.

ఇతర అభివృద్ధి విషయాలన్నింటిలోనూ న్యాయబద్ధమైన వాటాను అందిస్తాము.

ఆ ప్రాంతపు ప్రజలకు చెందవలసిన వనరులన్నింటినీ వారికే భద్రపరుస్తాము.

వారి పట్ల చాలా ఉదారంగా వ్యవహరిస్తాము.

ఇవేవికావాలని తెలంగాణ ప్రజలు మమ్మల్ని అడగలేదు. ఇవి అసెంబ్లీలో అన్ని పక్షాలు ఏకగ్రీవంగా ఇస్తున్న హామీలు."

ఇటువంటి తీర్మానాన్నే తిరిగి ఫిబ్రవరి 1, 1956న ఉపముఖ్యమంత్రి నీలం సంజీవరెడ్డి ప్రవేశపెట్టగా ఆంధ్ర అసెంబ్లీ ఆమోదించింది.

ఢిల్లీలో లాబీయింగ్ జరిపి జాతీయనాయకులను తమ వైపు తిప్పుకున్నట్లే తెలంగాణ నాయకుడు, హైదరాబాద్ రాష్ట్ర ముఖ్యమంత్రి బూర్గుల రామకృష్ణారావును విలీనానికి అనుకూలంగా మార్చడంతో పరిస్థితి అంతా తలకిందులయ్యింది. బూర్గుల ఆకస్మిక, విషాదకర, ఏకపక్ష నిర్ణయం పట్ల తెలంగాణ వ్యాప్తంగా నిరసన వెల్లువెత్తింది. ప్రత్యేక తెలంగాణ రాష్ట్రం ఏర్పడితే కాంగ్రెస్ పార్టీలోని మామా అల్లుళ్ల రెడ్డి గ్రూపు రాజకీయాలు బ్రాహ్మణ వర్గాన్ని తొక్కివేస్తాయన్న భయంతోనే ఆయన విశాలాంధ్ర వైపు మొగ్గుచూపారని ఆనాటి పరిస్థితిని విశ్లేషించిన వారు అంటారు. దీనికి తోడు ఆంధ్ర కాంగ్రెస్ నాయకులైన బెజవాడ గోపాలరెడ్డి, నీలం సంజీవరెడ్డిల మధ్య నాయకత్వం పోరులో మధ్యే మార్గంగా ఏర్పడబోయే ఆంధ్రప్రదేశ్ రాష్ట్రానికి తనను ముఖ్యమంత్రిని చేస్తారని ఆశపడి కూడా విశాలాంధ్రకు సమ్మతించాడని మరికొందరి విశ్లేషణ. ఏది ఏమైనా బూర్గుల లొంగుబాటుతో విశాలాంధ్ర ఏర్పాటుకు మార్గం సుగమమైంది. తెలంగాణ ప్రజలు సమ్మతిస్తేనే విశాలాంధ్రను ఏర్పాటు చేస్తామని హోం మంత్రి గోవింద వల్లభ పంత్, కేంద్ర ప్రతినిధిగా పరిస్థితి అధ్యయనం చేయడానికి వచ్చిన ఎస్.కే. పాటిల్‌లు ప్రకటించారు.

ఈ వాద వివాదాలు, ఈ అనిశ్చితి రాష్ట్రంలో కొనసాగుతుండగానే మార్చి 5, 1956న నిజామాబాద్‌లో భారత్ సేవక్ సమాజ్ వారు ఏర్పాటు చేసిన బహిరంగ సభలో ప్రధానమంత్రి

నెహ్రూ విశాలాంధ్ర స్థాపనకు కేంద్రప్రభుత్వం నిర్ణయించిందని ప్రకటించాడు. అయితే ఈ ఏర్పాటు నచ్చకపోతే భవిష్యత్తులో ఎప్పుడైనా విడిపోవచ్చునని కూడా ఆయన ప్రకటించాడు. ఆయన మాటల్లోనే చెప్పాలంటే....

"ఒక అమాయకురాలి (తెలంగాణ) పెండ్లి ఒక తుంటరి పిల్లవానితో (ఆంధ్ర) జరుగుతున్నది."

"తెలంగాణ ఆంధ్ర ప్రాంతాలు కలిసి ఉండే పొంతన కుదరకపోతే ఆలుమగలు విడాకులు ఇచ్చుకున్నట్లే కొంత కాలం తర్వాత రెండు ప్రాంతాలు విడిపోవచ్చు."

ఇట్లా పెండ్లి ప్రకటన చేస్తూనే విడాకులు పత్రాన్ని కూడా రాసిచ్చాడు నెహ్రూ.

## పెద్దమనుషుల ఒప్పందం

నిజామాబాద్‌లో నెహ్రూ ప్రకటనకు ముందే ఆంధ్ర, తెలంగాణ కాంగ్రేస్ నాయకులను ఢిల్లీకి పిలిపించి హోం మంత్రి గోవింద వల్లభ్ పంత్ సమక్షంలో ఫిబ్రవరి 20, 1956న 'పెద్దమనుషుల ఒప్పందం'పై సంతకాలు చేయించారు. విశాలాంధ్ర ఏర్పాటుకు బూర్గుల సమ్మతించడంతో తెలంగాణ వాదులైన కొండా వెంకట రంగారెడ్డి, మర్రి చెన్నారెడ్డిలను తమదారికి తెచ్చుకోవడం కేంద్రనాయకులకు సులువయ్యింది. వారిపై ఒత్తిడి తెచ్చి పెద్ద మనుషుల ఒప్పందంపై సంతకాలు చేయించారు. ఇటువంటి ఒప్పందాలు ఏవీ కూడా తెలంగాణకు పనిచేయబోవని, తెలంగాణ అవసరాలకు సరిపోవని ఫజల్ అలీ కమీషన్ పేర్కొన్నది.

"ఈ తరహాలో చేయగల ఏర్పాట్లు గురించి మేము జాగ్రత్తగా పరిశీలించాం. శ్రీబాగ్ ఒప్పందం తరహాలోకాని, బ్రిటన్ స్కాటిష్ డివల్యూషన్ తరహాలోకాని రాజ్యాంగపరమైన ఏర్పాట్లు పనిచేయబోవని, లేదా తెలంగాణ అవసరాలకు సరిపోవని మాకు అనిపించింది. తెలంగాణ విషయంలో అటువంటి ఏర్పాటును సూచించడం మా పరిధిలోకి రాదు" (పేరా 384, SRC Report).

ఫజల్ అలీ కమీషన్ రిపోర్టును నిశితంగా చదివారో లేదో లేక మరే ఇతరమైన ఒత్తిళ్ళకు ప్రలోభాలకు లొంగిపోయారోకానీ తెలంగాణకు పనికిరాని పెద్దమనుషుల ఒప్పందంపై మన పెద్దలు సంతకాలు చేశారు.

ఈ ఒప్పందం ద్వారా తెలంగాణ ప్రజలకిచ్చిన హామీలలో ముఖ్యమైనవి ఇవి (పూర్తి పాఠం కోసం అనుబంధంలో చూడగలరు)



1. ఉమ్మడి రాష్ట్ర సాధారణ పరిపాలనా, రాష్ట్రస్థాయి ఉమ్మడి కార్యాలయాలపై అయ్యే ఖర్చు ఆంధ్ర, తెలంగాణ ప్రాంతాలు 2 : 1 నిష్పత్తిలో భరించాలి. అటుపై మిగిలిన తెలంగాణ ప్రాంతపు ఆదాయాన్ని ఆ ప్రాంతపు అభివృద్ధి కొరకే ఖర్చు పెట్టాలి.
2. తెలంగాణలో మద్య నిషేధం తెలంగాణ శాసన సభ్యుల అభీష్టం మేరకే అమలవుతుంది.
3. తెలంగాణ ప్రాంతంలోని విద్యా వసతులను ఆ ప్రాంతపు విద్యార్థుల కొరకే కేటాయించాలి. లేదా రాష్ట్రంలో ఉన్న మొత్తం విద్యా సంస్థల సీట్లన్నిటిలో మూడవ వంతు సీట్లను తెలంగాణ విద్యార్థులకు కేటాయించాలి. ఈ రెండింటిలో తెలంగాణ ప్రాంతం వారికి ఏది అనుకూలంగా ఉంటే దానిని అమలు పరచాలి.
4. విలీనం వలన అదనపు ఉద్యోగుల తొలగింపు తప్పనిసరి అయినపుడు రెండు ప్రాంతాల వారిని నిష్పత్తి ప్రకారమే తొలగించాలి. అటుతర్వాత నియమించే ఉద్యోగుల సంఖ్య ఉభయ ప్రాంతాల జనాభా ప్రాతిపదికపై ఉండాలి.
5. తెలంగాణ ప్రాంతంలోని ఉద్యోగాలను నిర్ణీత నిష్పత్తిలో పొందడానికి నివాస నిబంధన (ముల్కీ) ఉండాలి. దీని కొరకు ఈ ప్రాంతంలో 15 సంవత్సరాల స్థిర నివాసం అవసరం.
6. తెలంగాణ అవసరాలను దృష్టిలో ఉంచుకొని ఆ ప్రాంతపు సర్వతోముఖాభి వృద్ధిని సాధించుటకు ఒక ప్రాంతీయ మండలి ఉండాలి. తెలంగాణ ప్రాంతానికి సంబంధించిన ప్రణాళికలు, నీటి పారుదల, వ్యవసాయం, పారిశ్రామికాభివృద్ధి, ఉద్యోగ వ్యవహారాలు వంటి కీలక అంశాలు ప్రాంతీయ మండలి ఆధీనంలో ఉండాలి. తెలంగాణ ప్రాంతంలోని భూములను ఇతర ప్రాంతాల వారు ప్రాంతీయ మండలి అనుమతి లేకుండా కొనుటకు వీలుండదు.
7. ముఖ్యమంత్రి ఆంధ్ర ప్రాంతం వాడైతే ఉప ముఖ్యమంత్రి తెలంగాణ ప్రాంతం వాడై ఉండాలి. ఒక వేళ తెలంగాణ ప్రాంతం వాడు ముఖ్యమంత్రి అయితే ఉప ముఖ్యమంత్రి ఆంధ్ర ప్రాంతం వాడై ఉండాలి. మంత్రి మండలిలో ఆంధ్ర, తెలంగాణ ప్రాంతాలకు చెందిన ప్రతినిధుల సంఖ్య 3 : 2 నిష్పత్తిలో ఉండాలి.

పెద్ద మనుషుల ఒప్పందంపై సంతకాలు చేసిన 'పెద్దమనుషులు' వీరే –

ఆంధ్ర రాష్ట్రం నుండి

1. బెజవాడ గోపాలరెడ్డి (ముఖ్యమంత్రి)
2. నీలం సంజీవరెడ్డి (ఉపముఖ్యమంత్రి)
3. గౌతులచ్చన్న (మంత్రి)

4. అల్లూరి సత్యనారాయణ రాజు (ఆంధ్ర కాంగ్రెస్ కమిటీ అధ్యక్షుడు)

హైదరాబాద్ (తెలంగాణ) రాష్ట్రం నుండి

1. బూర్గుల రామకృష్ణారావు (ముఖ్యమంత్రి)
2. కొండా వెంకట రంగారెడ్డి (మంత్రి)
3. మర్రి చెన్నారెడ్డి (మంత్రి)
4. జె.వి. నర్సింగరావు (హైదరాబాద్ కాంగ్రెస్ కమిటి అధ్యక్షుడు)

ఈ పెద్దమనుషుల ఒప్పందం ఫజల్ అలీ కమీషన్ అభిప్రాయ పడినట్లు ఎందుకూ పనికిరాని చెత్త కాగితంగా మిగిలిపోయింది.

ముల్కీ నిబంధనలకు విరుద్ధంగా దొంగ ముల్కీ సర్టిఫికేట్లు ఇప్పించి వేలాది మందిని తెలంగాణ ఉద్యోగాలలో నియమించారు. ప్రాంతీయ మండలి అనుమతి లేకుండానే లక్షలాది ఎకరాల తెలంగాణ భూములను ఆంధ్ర నుండి వలస వచ్చిన ప్రజలు కొన్నారు. తెలంగాణ మిగులు ఆదాయాన్ని తెలంగాణ అభివృద్ధికి ఖర్చు చేయాల్సి ఉండగా వాటిని ఆంధ్ర ప్రాంతపు రెవెన్యూ లోటును భర్తీ చేయడానికి తరలించారు. లలిత్ కమిటి నివేదిక ఈ నిధుల తరలింపును బహిర్గతం చేసింది. తెలంగాణ ప్రాంతీయ మండలి వ్యవసాయం, నీటి పారుదల, విద్య, ఉద్యోగాలు, మిగులు నిధుల తరలింపు మొదలైన అంశాలపై ప్రభుత్వానికి సమర్పించిన నివేదికలన్నీ బుట్టదాఖలయినాయి. విస్తృతాధికారాలు కల్గిన ఈ చట్టబద్ధ సంస్థను ప్రభుత్వాలు నిర్వీర్యం చేస్తూ వచ్చాయి. ముల్కీ రూల్సు రాజ్యాంగ బద్ధమేనని సుప్రీం కోర్టు ధర్మాసనం 1972లో ధృవీకరించినా జై ఆంధ్ర ఉద్యమానికి లొంగిపోయి ఆరుసూత్రాల పథకం పేరిట చట్టబద్ధ సంస్థ అయిన తెలంగాణ రీజినల్ కమిటిని, ముల్కీ రూల్సుని రద్దు చేసి 'పెద్ద మనుషుల ఒప్పందాన్ని' పాతర వేసింది ప్రభుత్వం.

అసలు పెద్ద మనుషుల ఒప్పందానికి ఉన్న చట్టబద్దత ఏమిటి? పెద్ద మనుషుల ఒప్పందంపై సంతకం చేసింది అటు, ఇటూ కాంగ్రేస్‌కు చెందినవారే. కాంగ్రేస్ పెద్దలు మొత్తం రాష్ట్ర ప్రజలకు ప్రతినిధులు అవుతారా? ఆంధ్రలోనూ, తెలంగాణలోనూ కమ్యూనిస్టులు బలమైన పార్టీగా ఉన్నప్పటికీ వారిని ఎవరినీ ఈ ఒప్పందంలో భాగస్వాములుగా చేయలేదు. ఈ ఒప్పందం ఉల్లంఘించబడితే బాధ్యత ఎవరిది? ఒప్పందం రద్దయి పోతుందా? ఇవ్వాల్టి పరిస్థితుల్లో ఇవి కీలకమైన ప్రశ్నలు.

పెద్ద మనుషుల ఒప్పందమే ఆంధ్ర ప్రదేశ్ రాష్ట్ర ఏర్పాటుకు ప్రాతిపదిక కనుక ఆంధ్ర ప్రదేశ్ ఏర్పాటు షరతులతో కూడిన ఏర్పాటు. ఒప్పందాన్ని పరిశీలించినపుడు అందులోని



కొన్ని అంశాలు వివిధ చట్టాలు, ప్రభుత్వ ఉత్తర్వుల్లో చేర్చబడినట్లు తెలుస్తున్నది. అయితే మొత్తం ఒప్పందానికి ఎటువంటి చట్టబద్ధత లేదు. పెద్దమనుషుల ఒప్పందంలోని 2, 3, 7, 8, 10, 11 అంశాలు 'ఆంధ్రప్రదేశ్ రీజినల్ కమిటి ఆర్డరు'లో చేర్చబడినాయి. 4వ అంశాన్ని స్టేట్ రీ ఆర్గనైజేషన్ ఆక్టు, 1956లో చేర్చారు. 9 అంశాన్ని భారత రాజ్యాంగంలో ఆర్టికల్ 371లో చేర్చారు. రక్షణల (Safe gaurd's) లోని 2 నుండి 6 వరకు అంశాలు ఆంధ్రప్రదేశ్ రీజినల్ కమిటి ఆర్డర్‌లో చేర్చారు. అట్లనే 6 (బి)ని డొమెస్టిక్ రూల్స్ ఆఫ్ స్టేట్ గవర్నమెంట్ (ముల్కీరుల్సు) మరియు రీజినల్ కమిటి ఆర్డర్, 1957లో చేర్చారు. ఈ ఒప్పందంలోని అంశాలను ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఉల్లంఘిస్తే ఏం చెయ్యాలి? ఎవర్ని బాధ్యుల్ని చెయ్యాలి? ఈ విషయాలపై ఒప్పందంలో ఏమీలేదు. ఒప్పందానికి చట్టబద్దత లేదు, ఉల్లంఘిస్తే ఎవర్ని బాధ్యుల్ని చెయ్యాలో స్పష్టంగా లేదు కనుకనే ఉల్లంఘన పర్వం మొదటిరోజు నుంచే మొదలయ్యింది.

ఈ 52 ఏండ్ల కాలగమనంలో వివిధ సందర్భాలలో ఏర్పాటైన చట్టబద్ధ సంస్థలు, రాజ్యాంగ బద్ధ ఉత్తర్వులు, కమీషన్‌లు, శాసన సభా కమిటీలు ఏవీ కూడా తెలంగాణకు ప్రయోజనం కలిగించలేకపోయాయి. అవన్నీ నామమాత్రపు ఏర్పాట్లే. ఆనాడు ఉద్యమం ఒత్తిడిని తట్టుకునేందుకు ప్రజలకు చూపించిన తాయిలాలుగానే మిగిలిపోయాయి తప్ప తెలంగాణకు రక్షణలు ఇవ్వలేకపోయాయి. దేశ రాజ్యాంగాధినేత ద్వారా జారీ అయిన రాష్ట్రపతి ఉత్తర్వులకే దిక్కులేని పరిస్థితి రాష్ట్రంలో నెలకొని ఉన్నది. ఫజల్ అలీ కమీషన్ అభిప్రాయపడినట్లు రాజ్యాంగపరమైన ఏర్పాట్లు ఏవీ సరిపోవని ఈ 52 ఏండ్ల సమైక్య రాష్ట్రం నిర్ద్వందంగా రుజువు చేసింది.

ఈ నేపథ్యంలో సాధారణ మేధస్సుకు అర్థం అయ్యే విషయం ఏమిటంటే ఒప్పందం ఉల్లంఘించబడితే ఒప్పందం రద్దయిపోతుంది. పెద్ద మనుషుల ఒప్పందం రద్దయితే జరుగవలసింది తెలంగాణ ప్రత్యేక రాష్ట్రంగా ఏర్పడడమే. నెహ్రూ చెప్పింది అదే. ఇపుడు నెహ్రూ రాసిచ్చిన విడాకుల పత్రం దుమ్ము దులిపి చట్టబద్ధంగా విడాకులు మంజూరు చేయడమే కేంద్ర ప్రభుత్వ కర్తవ్యం.

52 ఏండ్ల సమైక్య రాష్ట్రంలో ఆంధ్ర, తెలంగాణ ప్రజల మధ్య భావసమైక్యత ఏర్పడలేదు. సమైక్య జీవనానికి పొంతన కుదరలేదు. తెలంగాణ పూర్తిగా ఆంధ్రకు వలస ప్రాంతంగా మారింది. సాంస్కృతిక అణిచివేతకు గురి అయ్యింది. ఇవ్వాళ తెలంగాణ వలసాధిపత్యం నుండి విముక్తిని కోరుకుంటున్నది. స్వయం పాలనతోనే తన వనరుల వినియోగంపై హక్కు

సంక్రమిస్తుంది. అపుడు మాత్రమే ఈ ప్రాంతం సర్వతోముఖాభివృద్ధి సాధ్యమవుతుంది. తెలంగాణ భాషా సంస్కృతులు వికాసం పొందుతాయని తెలంగాణ ప్రజల భావన.

ఆంధ్రప్రదేశ్ ఏర్పాటే ఒక విద్రోహచర్య కనుక ఆంధ్రప్రదేశ్ అవతరణ దినం నవంబర్ 1 తెలంగాణ ప్రజలకు విద్రోహదినమే.

ଔ ଐ ଏ ଓ



# ఆంధ్ర రాష్ట్రం ఏర్పాటు - సంక్షిప్త చరిత్ర

ఆంధ్రప్రాంత ప్రజలకు రాజధాని మద్రాసు దూరంగా ఉండడం, తమిళుల పక్షపాత ధోరణి ఇవి రెండూ అభివృద్ధిలో తమకు న్యాయమైన వాటా దక్కడం లేదనే భావన తెలుగు ప్రజల్లో పెంచింది. అంతేగాకుండా ఆంధ్రప్రాంతం ముఖ్యంగా ఉత్తర, కోస్తాంధ్రపై బెంగాల్ ప్రభావం అధికంగా ఉండేది. బెంగాల్ విభజన ప్రకంపనలు ఆంధ్రలో కూడా ప్రతిఫలించాయి. 1903లో పక్కనే ఉన్న ఒరిస్సాలో ఉత్కల్ యూనియన్ సభ ఏర్పాటు, ఇదే సంవత్సరంలో ప్రభుత్వం ఒరియా మాట్లాడే వారందరినీ ఒకే పరిపాలన శాఖకిందికి తీసుకురావడం కూడా ప్రత్యేక రాష్ట్ర ఉద్యమానికి దోహదపడింది. బిపిన్ చంద్రపాల్ ని 1906లో రాజమండ్రి, విజయవాడ తదితర ప్రాంతాలకు పిలిపించి సభలు సమావేశాలు నిర్వహించారు. వీటి నిర్వహణలో పత్రికాధిపతులు కీలక పాత్ర పోషించారు. కోపల్లె హనుమంతరావు, ముట్నూరి కృష్ణారావు, గాడిచర్ల హరిసర్వోత్తమరావులతో పాటుగా ఉన్నవ లక్ష్మీనారాయణ, చల్లా శేషగిరిరావు, న్యాపతి నారాయణరావు, చట్టి నరసింగరావు, జి. సీతారామ శాస్త్రి (తర్వాత ఆంధ్రరాష్ట్రం కోసం నిరాహార దీక్ష చేసిన స్వామి సీతారామ్, దుగ్గిరాల గోపాలకృష్ణ, ఎన్.వి.ఎల్. నరసింహరావు తదితరులు తెలుగువారి వెనుకబాటు తనాన్ని ఎలుగెత్తి ప్రచారం చేసింద్రు. సారస్వత సంఘాల ఏర్పాటు, పత్రికా స్వాతంత్ర్యం కోసం 'కలం' ఝులిపించినందుకు గాడిచెర్ల హరిసర్వోత్తమరావు జైలు కెళ్లడం కూడా ప్రజల్లో చైతన్యాన్ని ప్రోది చేసింది. పట్టాభి లాంటి వారు హిందూ తదితర పత్రికల్లో వ్యాసాలు వెలువరించారు. వీరికి స్ఫూర్తి బెంగాల్ విభజన నుంచే అంటే తప్పులేదు. పత్రికల స్థాపన, సభలు, సమావేశాల నిర్వహణ, సాహిత్య సంఘాల ఏర్పాటు, పుస్తక ప్రచురణ, పరిశోధన ఒకదానికొకటి అండగా నిలబడి ఆంధ్రప్రాంతీయుల ఆత్మ గౌరవం కోసం, అన్యాయాల పట్ల నినదించడం ,నిత్య కర్తవ్యంగా భావించి అక్కడి వ్యక్తులు పనిచేసింద్రు.

1911 సెప్టెంబర్‌లో గుంటూరులో సబ్‌జడ్జిగా పనిచేస్తున్న ఒక తమిళుడు అక్కడ ఖాళీగా ఉన్న దఫేదార్ (అటెండర్) పోస్టుని కుంభకోణంకు చెందిన సాటి తమిళునికి కట్టబెట్టడం జరిగింది. (బహుశా తెలుగులో పెద్ద ఎత్తున అవినీతి, అన్యాయం జరిగితే దాన్ని కుంభకోణంగా పోల్చడం నాటి నుండే ఆరంభమై ఉంటుంది). ఈ పోస్టుకు చాలామంది తెలుగువారు దరఖాస్తు చేసుకున్నప్పటికీ ప్రాంతేతరుడికి ఉద్యోగం కట్టబెట్టడంతో ఆంధ్రప్రాంత సామాజిక కార్యకర్తలు ఆందోళనకు దిగింన్రు. ప్రత్యేక ఆంధ్రరాష్ట్రం కావాలని 1911, డిసెంబర్ 12న ఢిల్లీలో బ్రిటీషువారి సింహాసన ప్రతిష్టాపన సందర్భంగా దర్బారు ముందు డిమాండ్ ఉంచారు. ఆ తర్వాత ఆంధ్రమహాసభ ఏర్పాటు చేసి దాని ద్వార ఆంధ్రుల అభ్యున్నతికి, ఆంధ్రరాష్ట్రం కోసం ఉద్యమాలు చేసింన్రు. ఇది వందేండ్ల నాటి మాట. అప్పుడు తమిళుల చేతిలో ఆంధ్రులు ఎట్లా అన్యాయానికి గురయ్యారో దానికి వేల రెట్లు ఎక్కువ స్థాయిలో తెలంగాణ ప్రజలు నేటికీ అనుభవిస్తున్నారు. ఇప్పుడు తెలంగాణ ప్రజలు చేస్తున్నది వేర్పాటు వాద ఉద్యమమని ఆంధ్ర వలసవాదులు ప్రచారం చేస్తుంన్రు. ఇదీ ఆంధ్రుల సమన్యాయం.

ఆంధ్రోద్యమం మొదట గుంటూరు, కృష్ణా (ఈ రెండు జిల్లాలు 1904 వరకు ఒకే జిల్లాగా ఉండేవి), గోదావరి జిల్లాల్లో ఉధృతంగా ఉండేది. వైజాగ్ లో కూడా ఉద్యమం తీవ్రంగానే ఉండింది. అయితే రాయలసీమ జిల్లాల్లో ఈ ఉద్యమం ప్రభావం మొదట్లో అంతగా లేదు. ఉద్యమానికి అండగా నిలిచి నడిపించిన కొండా వెంకటప్పయ్య పత్రికల్లో వ్యాసాలు, వివిధ ప్రదేశాల్లో ఉపన్యాసాల ద్వారా ప్రచారం చేసిండు. అలాగే పట్టాభి సీతారామయ్య హిందూ పత్రికలో స్కాట్లాండ్, యార్క్ షైర్, వేల్స్ సంబంధాలు ఇంగ్లాండ్‌తో ఎట్లా ఉన్నాయో తెలుగువారికి రాష్ట్రం ఏర్పడ్డ తర్వాత భారతదేశం పట్ల కూడా అదే వైఖరితో ఉంటుందని, ఇది వేర్పాటు వాద ఉద్యమం కాదని చెప్పిండు.

మద్రాసు ప్రభుత్వం తుంగభద్ర ప్రాజెక్టుని తొక్కిపెట్టి, కృష్ణా, కావేరి ప్రాజెక్టుని చేపట్టాలని నిర్ణయించింది. ఆ తర్వాత కరువు పీడిత కృష్ణా, గుంటూరు జిల్లాలకు జలాలందించే కృష్ణా ప్రాజెక్టు వ్యయం అధికంగా ఉందని చెబుతూ కావేరి ప్రాజెక్టుని ప్రారంభించారు. కృష్ణా ప్రాజెక్టు 1955లో చివరకి హైదరాబాద్ రాష్ట్ర ఆర్థిక సహాయ సహకారాలతో పూర్తి చేయడం జరిగింది. ఆంధ్ర, రాయలసీమలకు మద్రాసు వారిచేతిలో (తమిళుల) అన్యాయం జరిగిందని దానికి శాశ్వత పరిష్కారం ప్రత్యేక రాష్ట్ర సాధన ఒక్కటే మార్గమని భావించి దానికోసం ఉద్యమాలు చేపట్టింన్రు.



## ఆంధ్రరాష్ట్ర ఏర్పాటుకు అడ్డుపడ్డ రాజకీయాలు

1946-53 మధ్యన ఆంధ్రరాష్ట్ర రాజకీయాలు సీమ, కోస్తాల కలహాల కాపురంగా సాగాయి. ఒకరిపై ఒకరు పైచేయి సాధించేందుకు ఎత్తులు, జిత్తులు పన్నారు. శ్రీబాగ్ ఒడంబడికను సక్రమంగా అమలు చేయకపోవడం మూలంగా ఇరు ప్రాంతాల మధ్యన ఘర్షణ వైఖరి చోటు చేసుకుంది. అపనమ్మకం ఏర్పడింది. గాంధీజీ సలహాను ధిక్కరించి టంగుటూరి ప్రకాశం పంతులు మద్రాసు శాసన సభలో కాంగ్రెస్ పార్టీ నాయకుడిగా పోటీచేసి గెలుపొందాడు. 29 ఏప్రిలు 1946 నాడు మద్రాసు ప్రధానిగా (ముఖ్యమంత్రిగా) ప్రమాణ స్వీకారం చేసిండు. కేవలం 11 నెలలు మాత్రమే ప్రధానిగా కొనసాగారు. గాంధీజీ తన వియ్యంకుడు రాజాజీని ప్రధానిగా చేయాలని ప్రయత్నించాడు. ఇది రాజాజీ-ప్రకాశంల మధ్య గొడవకు దారి తీసింది. 1946 ఎన్నికల్లో కాంగ్రెస్ రాయలసీమ, కోస్తా రెండు ప్రాంతాల్లో గణనీయమైన సీట్లు గెలుచుకుంది. ఎన్నికల అనంతరం ప్రధాని పదవికి పోటీ పడ్డ ప్రకాశం పంతులుకు రాయలసీమ శాసన సభ్యులంతా మూకుమ్మడిగా మద్దతు ప్రకటించారు. దానికి ప్రతిఫలంగా రెండు మంత్రి పదవులు దక్కుతాయని ఆశించింన్రు. అయితే అందుకు విరుద్ధంగా రాయలసీమ వారికి ఒక్క మంత్రి పదవే దక్కింది. దీంతో ఆగ్రహంతో ఉన్న రాయలసీమ నేతలు సరైన అవకాశం కోసం ఎదురు చూస్తున్నారు. ఈ సమయంలో 1947 సెప్టెంబర్‌లో మద్రాసులో 19వ ఆంధ్ర రాజకీయ సభలు జరిగాయి. ఈ సభల్లో రాయలసీమ వారికి అవమానం జరిగిందని చెబుతూ మాజీ జస్టిస్ సి.ఎల్. నరసింహారెడ్డి అంతకు రెండేండ్ల ముందే కాంగ్రెస్ పార్టీలో చేరిండు. ఆయన నేతృత్వంలో జరిగిన సభలో ప్రత్యేక రాయలసీమ ఏర్పాటు చేయాలని డిమాండ్ చేస్తూ కేంద్ర ప్రభుత్వానికి తీర్మానాన్ని పంపింన్రు.

1937-42 మధ్యకాలంలో ఆంధ్రకాంగ్రెస్ కమిటీ సంయుక్త కార్యదర్శిగా పనిచేసిన నీలం సంజీవరెడ్డి 1946లో అనంతపురం అసెంబ్లీ నుంచి మద్రాసు శాసనసభకు ఎన్నికయిండు. ప్రకాశం క్యాబినెట్‌లో చోటు దక్కక పోవడంతో రాయలసీమ మహాసభతో ఎన్నడూ సంబంధం లేని సంజీవరెడ్డి 1947 అక్టోబర్‌లో నంద్యాలలో ఐదో మహాసభలు దగ్గరుండి జరిపించాడు. ఈ మేరకు ఏర్పాట్లు, పత్రికా ప్రకటన అంతా ఆయన ఆధ్వర్యంలోనే జరిగాయి. ఈ మహాసభల అధ్యక్షుని హోదాలో మాట్లాడుతూ రాయలసీమలోని ప్రతి జిల్లాకు మంత్రి పదవి ఇవ్వాలి, న్యాయమైన వసతులు, విద్యా సౌకర్యాలు, అన్ని రంగాల్లో సమాన అవకాశాలు కల్పించినట్లయితేనే రాయలసీమ ప్రజలు ఆంధ్రతో కలిసి పోతారని లేదంటే కలిసే ప్రసక్తే లేదని ప్రకటించిండు.

రాయలసీమకు ప్రత్యేకంగా పీసీసీ ఉండాలని కూడా ఈ సభ డిమాండ్ చేసింది. 1947 అక్టోబరు 25, 26 తేదీల్లో జరిగిన ఈ మహాసభల్లో నీలం సంజీవరెడ్డి మాట్లాడుతూ "..... అందుచేతనే మనకు రాజ్యమూ రాముడేలినా, రావణుడేలినా ఒకటేననే మనస్తత్వం ఏర్పడటానికి కారణమైంది. మనకు రాష్ట్ర ప్రసక్తి ఉత్సాహమును రేకిత్తించ లేకుండా పోతుంది. వేరే రాష్ట్రం వచ్చినా మనకు మోక్షం కలుగుతుందనే ఆశ ఇప్పటి మన ఉత్తరాది సోదరుల ఉపేక్ష భావాన్ని చూస్తే సన్నగిల్లుతోంది" అని తన అధ్యక్షోపన్యాసంలో చెప్పిండు.

1948 జూన్ నెలలో ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ కమిటీకి ఎన్నికలు జరిగాయి. ఈ ఎన్నికల్లో ప్రకాశం మద్దతిచ్చిన ఎన్జీ రంగా తన ప్రత్యర్థి నీలం సంజీవరెడ్డిపై విజయం సాధించిండు. ఈ దశలో రాయలసీమ వాసుల్ని మచ్చిక చేసుకునేందుకు కందుల ఓబుళరెడ్డిని కార్యదర్శిగా, పెద్దిరెడ్డి తిమ్మారెడ్డిని ఉపాధ్యక్షునిగా రంగా నియమించిండు. ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెస్ చరిత్రలో మొట్టమొదటి సారిగా రాయలసీమ నుంచి ఎక్కువమంది రెడ్లకు స్థానం దక్కింది. సంజీవరెడ్డి పలుకుబడిని తగ్గించే ఉద్దేశంతో రంగా వేసిన ఈ ఎత్తుగడ అసలుకే మోసం తీసుకొచ్చింది. కమ్మ, రెడ్డి కుల రాజకీయాల్లో ఒకరిపై ఒకరు పై చేయి సాధించేందుకు ఇందులో భాగంగా ఆంధ్ర-రాయలసీమ ఆదిపత్యం కోసం ప్రయత్నాలు జరిగాయి. 1948 ఆగస్టు నాటికి శ్రీబాగ్ ఒడంబడికను ఆంధ్ర కాంగ్రెస్ కమిటీ గుర్తించ నిరాకరించడంతో రాయలసీమ నేతల్లో ఆగ్రహం పెల్లుబికింది. ఇదే సమయంలో భాషా ప్రయుక్త రాష్ట్రాల ఆవశ్యకత తేల్చేందుకై ధార్ కమిటీ ఏర్పాటు కావడంతో దాని పట్ల రాయలసీమ మహాసభ వైఖరి కోస్తాతో పోలిస్తే భిన్నంగా ఉండింది. కోస్తా ప్రాంతం వారు ప్రత్యేక రాష్ట్రం కోసం ఉద్యమం చేపట్టగా, రాయలసీమ మహాసభ అధ్యక్షుడి హోదాలో సంజీవరెడ్డి ఆ ఉద్యమానికి రాయలసీమకు ఎలాంటి సంబంధం లేదని ప్రకటించిండు. ఇండియాలోని వివిధ ప్రాంతాల్లో, ముఖ్యంగా హైదరాబాద్ రాజ్యంలో ఏర్పడ్డ విపత్కర పరిస్థితుల దృష్ట్యా ఆంధ్ర రాష్ట్ర ఏర్పాటును ప్రశాంత వాతావరణం నెలకొనేదాకా వాయిదా వేయాలని విజ్ఞప్తి చేసిండ్రు.

20 మంది రాయలసీమ శాసన సభ్యుల తరపు సంజీవరెడ్డి భాషా ప్రయుక్త రాష్ట్రాల ఏర్పాటును వాయిదా వేయాలని కోరుతూ ధార్ కమిటీకి విజ్ఞాపన ఇచ్చిండు. ఒక వేళ ఆంధ్ర రాష్ట్ర ఏర్పాటు తప్పనిసరి అయినట్లయితే శ్రీబాగ్ ఒడంబడికలోని హామీలు అమలయ్యేలా చర్యలు తీసుకోవాలని పేర్కొన్నాడు. రాయలసీమ మహాసభ తరపున ఎన్.ఎమ్. శాస్త్రి, హెచ్. లింగారెడ్డిలు ధార్ కమిటీకి సమర్పించిన నివేదికలో ఆంధ్రరాష్ట్ర ఏర్పాటును వ్యతిరేకించారు.



ఒక వేళ ఆంధ్రరాష్ట్రం ఏర్పాటయినట్లయితే రాయలసీమను మద్రాసు రాజధానిగా ప్రత్యేక రాష్ట్రంగా ఏర్పాటు చేయాలని డిమాండ్ చేసింద్రు. దాదాపు ఇదే కాలంలో పట్టాభి సీతారామయ్య ఆలిండియా కాంగ్రెస్ అధ్యక్షుడిగా 1948 అక్టోబర్ లో ఎన్నికయిండు. ఈయనకు ప్రకాశం పంతులుకు మధ్య గ్రూపు తగాదాలుండేవి. ఇవి వివిధ సందర్భాల్లో బయటపడ్డాయి. 1946లో రాజాజీకి వ్యతిరేకంగా ప్రకాశంని గెలిపించడంలో కీలక పాత్ర వహించింది తమిళనాడు శాసన సభ్యులు. 13 మంది సభ్యుల మంత్రివర్గంలో ఐదుగురు బ్రాహ్మణులకు చోటు దక్కింది. ఇది తమిళనాడు సభ్యులకు నచ్చలేదు. దీంతో వారు ఆ తర్వాత జరిగిన స్పీకర్ పదవికి ప్రకాశం నిలబెట్టిన తెలుగు బ్రాహ్మణుడు (తెన్నేటి) విశ్వనాథంని ఓడించి ఆయన స్థానంలో తమిళనాడుకు చెందిన దళితుడు శివషణ్ముగంని 109-69 ఓట్ల తేడాతో గెలిపించుకున్నారు. ఆంధ్ర-ప్రదేశ్ కాంగ్రెస్ కమిటీ అధ్యక్ష పదవికి జరిగిన ఎన్నికల్లో పట్టాభి అనుచరుడు పల్లం రాజుని ఓడించేందుకు ఎన్జీరంగాకు ప్రకాశం మద్దతిచ్చాడు. దీంతో రాష్ట్ర కాంగ్రెస్‌లో ముఠా తగాదాలు జోరందుకున్నాయి. పట్టాభి వర్గానికి చెందిన బెజవాడ గోపాలరెడ్డి, కళా వెంకటరావులు మద్రాసు శాసనసభ పక్ష నేతగా ఓ.పి. రామస్వామిరెడ్డిని నిలబెట్టి ప్రకాశంని ఓడించారు. మరోసారి 1948 మార్చిలో కూడా ప్రకాశం తన పాత ప్రత్యర్థి చేతిలో అదే ముఖ్యమంత్రి పదవికి పోటీ చేసి ఓడిపోయిండు.

తర్వాతి కాలంలో బెజవాడ గోపాలరెడ్డి ఆయన అనుచరులు మద్రాసు శాసన సభా పక్ష నేతగా పి.ఎస్. కుమారస్వామి రాజాను సమర్థించగా ప్రకాశం పంతులు డాక్టర్ సుబ్బరాయన్ ని సమర్థించాడు. వీరిద్దరిలో కుమారస్వామి రాజా 105-89 ఓట్ల తేడాతో విజయం సాధించాడు. ఆ తర్వాత 1949 ఏప్రిల్ లో సంజీవరెడ్డికి మంత్రి వర్గంలో స్థానం దక్కింది. ఇలా కాంగ్రెస్ రాజకీయాలు పదవుల చుట్టే తిరిగినయి. మధ్యలో కొంత కాలం రాష్ట్రసాధన కోసం ఉమ్మడిగా కృషి చేయాలని భావించినప్పటికీ అది అంతగా సఫలీకృతం కాలేదు. అయినప్పటికీ అడపా దడపా మాత్రమే ఆంధ్ర నాయకులు ప్రభుత్వానికి విజ్ఞాపనలతో తమ డిమాండ్ ని ముందుంచారు. అంతకు మించి ముందుకు సాగలేదు.

మద్రాసు గవర్నర్ సలహాదారుగా ఉన్న నార్మన్ స్ట్రాథీ తన వ్యక్తిగత హోదాలో తిరుచ్చి కేంద్రంగా తమిళనాడు, బెజవాడ రాజధానిగా ఆంధ్రరాష్ట్రం, మద్రాసుని కేంద్రపాలిత ప్రాంతంగా ప్రకటించాలని 1946లో ఒక ప్రతిపాదన ముందుకు తీసుకొచ్చిండు. ఈ ప్రతిపాదనను మద్రాసు అసెంబ్లీలో ఎం. తిరుమలరావు లేవనెత్తిండు. 1946 ఫిబ్రవరి 27న మద్రాసు

అసెంబ్లీ ఈ తీర్మానాన్ని యథాతథంగా ఆమోదించింది. అయితే తదుపరి ఈ విషయమై ఎలాంటి చర్యలు తీసుకోలేదు. 1946 ఫిబ్రవరిలో గుంటూరులో జరిగిన ఆంధ్రమహాసభలో కూడా అధ్యక్షుడిగా ఉన్న సర్ విజయ ఒక తీర్మానాన్ని చర్చకు పెట్టిండు. ఆంధ్రరాష్ట్ర ఏర్పాటుకు మద్దతిచ్చే వారినే వచ్చే ఎన్నికల్లో ఎన్నుకోవాలి అనేది ఆ తీర్మాన సారాంశం. ఈ ఎన్నికల్లో కాంగ్రెసు గెలుపొందింది.

తాత్కాలిక ప్రభుత్వం సెప్టెంబర్ రెండు 1946 న బాధ్యతలు స్వీకరించింది. అంతకు ముందు క్యాబినెట్ మిషన్ ముస్లిం మెజారిటీ, హిందూ మెజారిటీ గలవిగా ప్రావిన్సులను విభజన చేసింద్రు. కాంగ్రెస్, ముస్లింలీగ్‌లను సంతృప్తి పరచేందుకు చేసిన ఈ చర్య, భాషా ప్రయుక్త రాష్ట్రాన్ని డిమాండ్ చేస్తున్న ఆంధ్రలో అసంతృప్తిని నింపింది. ఈ అసంతృప్తిని పారదోలేందుకు పట్టాభి పూనిక మేరకు భాషా ప్రయుక్త రాష్ట్రాల ఏర్పాటు ఆవశ్యకతపై తమ అభిప్రాయాలను తెలుపాల్సిందిగా వివిధ పిసీసీలకు అప్పటి అఖిలభారత కాంగ్రెస్ కార్యదర్శి శంకర్ రావ్ దేవ్ ఒక సర్క్యులర్ ని జారీ చేసిండు. అప్పుడు పట్టాభి సీతారామారావు కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ సభ్యుడిగా ఉన్నాడు. పట్టాభి వత్తిడి మేరకు రాజ్యాంగ నిర్ణాయక సభలో ప్రావిన్సుల ఏర్పాటులో భాష, సంస్కృతి కూడా పరిగణనలోకి తీసుకోవాలనేది అందులోని సారాంశం.

1947 ఏప్రిల్‌లోనే తమిళనాడు, కేరళ, ఆంధ్ర, కర్నాటక రాష్ట్రాలను ఏర్పాటు చేయాలని మద్రాసు అసెంబ్లీ ఒక తీర్మానాన్ని ఆమోదించింది. ఈ తీర్మానాన్ని పరిగణనలోకి తీసుకోవాలని డిమాండ్ చేస్తూ రాజ్యాంగ నిర్ణయ సభకు ఒక ప్రతిని కూడా పంపించారు. అర్జెంటుగా ఆంధ్ర రాష్ట్రం ఏర్పాటు కావడానికి వీలుగా ఒక సరిహద్దుల నిర్ణయ కమిటీని వెంటనే ఏర్పాటు చేయాలని ఆంధ్రమహాసభ తరపున రాజ్యాంగ నిర్ణాయక సభకు విజ్ఞప్తి చేశారు. వీరి నిర్ణయాన్ని రాజ్యాంగ నిర్ణాయక సభ్యుడిగా ఉన్న బొబ్బిలి రాజా ముందుకు తీసుకెళ్లిండు. బొబ్బిలి రాజా ఆంధ్రమహాసభ ఉపాధ్యక్షుడిగా కూడా ఉండేవాడు. అయితే ఆంధ్ర రాష్ట్ర ఏర్పాటు విషయాన్ని మిగత భాషా ప్రయుక్త రాష్ట్రాలతో మిళితం చేసినట్లయితే దాని ఏర్పాటు ఆలస్యం జరుగుతుందనే ఉద్దేశ్యంతో టంగుటూరి ప్రకాశం పంతులు, దుర్గాబాయి దేశ్‌ముఖ్, ఎన్.జి. రంగా, అనంతశయనం అయ్యంగార్‌లు ఢిల్లీలో పటేల్ ని కలుసుకున్నారు. ఉపప్రధానిగా కూడా ఉన్న పటేల్‌తో జరిగిన భేటీలో 1935 భారత చట్టం సెక్షన్ 290 ప్రకారం ఆంధ్రప్రావిన్సుని ఏర్పాటు చేయాలని వత్తిడి తీసుకొచ్చారు. అయితే ఆయన ఎటూ తేల్చకుండా నేను ఈ విషయాన్ని పరిశీలిస్తానని చెప్పి పంపడం జరిగింది.



1947 నవంబర్ 27న నెహ్రూ భారత రాజ్యాంగ నిర్ణాయక సభలో మాట్లాడుతూ ఆంధ్ర రాష్ట్ర ఏర్పాటు న్యాయసమ్మతం, అత్యంతావశ్యకం అని చెప్పడం జరిగింది. దీన్ని దృష్టిలో ఉంచుకొని ప్రకాశం పంతులు భారత చట్టం ద్వారా ఆంధ్రప్రావిన్సుని ఏర్పాటు చేయాలని 1948 జనవరిలో డిమాండ్ చేశాడు. మరోవైపు కన్నడిగులు తమ రాష్ట్రం ఏర్పాటు చేయకుండా మరే రాష్ట్రాన్ని ఏర్పాటు చేయకూడదని అంబేద్కర్‌కు విజ్ఞప్తి చేసింద్రు. అలాగే మహారాష్ట్రియన్లు కూడా ఆంధ్ర ప్రావిన్సు ఏర్పటును అడ్డుకున్నరు. దేశ విభజన మూలంగా వచ్చిన సమస్యలు ఇంకా పరిష్కారం కాలేదు. ఇప్పటికే ఉన్న రాష్ట్రాలను బలోపేతం చేయాల్సి ఉంది. ఇలాంటి సంక్షుభిత సమయంలో (భారత రాజ్యాంగం అమల్లోకి రావడానికి ముందే) ఆంధ్ర లాంటి పెద్ద ప్రావిన్సుని ఏర్పాటు చేసినట్లయితే సమస్యలు మరింత పెరుగుతాయని భావించి ఆంధ్ర ప్రావిన్సు ఏర్పాటును రాజ్యాంగ నిర్ణయ సభ వాయిదా వేసింది.

1948 మార్చిలో నెహ్రూ విశాఖపట్టణం వచ్చిన సందర్భంగా మాట్లాడుతూ వచ్చే నెలలో రాష్ట్రాల ఏర్పాటు ఆవశ్యకతకు సంబంధించి ఒక కమిటీని వేస్తున్నామని ఆ కమిటీ సూచనల మేరకు కొత్త రాష్ట్రాల ఏర్పాటు ఉంటుందని చెప్పిండు. దీనికి అనుగుణంగానే 1948 జూన్ 17న భాషా ప్రయుక్త రాష్ట్రాల కమీషన్ ఏర్పాటయింది. దీనికి అలహాబాద్ హైకోర్టు రిటైర్డ్ జడ్జ్ ఎస్.కె. దార్ చైర్మన్‌గా, రిటైర్డ్ ఐసిఎస్ అధికారి డాక్టర్ పన్నాలాల్, రాజ్యాంగ నిర్ణయ సభ సభ్యుడు జగత్ నారాయణ్ సభ్యులుగా కమిటీ ఏర్పాటయింది. దీన్నే దార్ కమిటీగా పిలుస్తారు. ఈ కమిటీ భాషా ప్రయుక్త రాష్ట్రాలు దేశ సమగ్రతకు ముప్పు అని వాటికి వ్యతిరేకంగా నివేదికను ఇచ్చింది.

ఈ నివేదిక పట్ల పూర్తి అసంతృప్తితో ఉన్న కాంగ్రెస్ పార్టీ జెవిపి కమిటీని నియమించింది. జవహర్ లాల్ నెహ్రూ, సర్దార్ వల్లభ్‌భాయి పటేల్, కాంగ్రెస్ పార్టీ అధ్యక్షుడు పట్టాభిలు ఇందులో ఉన్నారు. భాషా ప్రయుక్త రాష్ట్రాల ఏర్పాటును కొన్ని రోజులు వాయిదా వేయాలని 1949 ఏప్రిల్‌లో సమర్పించిన నివేదికలో పేర్కొనడం జరిగింది. కాని ఆంధ్ర విషయంలో మద్రాసు లేకుండా ఆంధ్ర రాష్ట్రాన్ని ఏర్పాటు చేయాలని సూచించింది. ఇది రాయలసీమ వాసులకు గానీ, ప్రకాశం పంతులుకు గానీ ఆమోదయోగ్యం కాలేదు. అయితే మద్రాసు విషయంలో పట్టాభి వివరణ ఇస్తూ రిపోర్టులో మద్రాసు తమిళనాడుకు చెందాలని ఎక్కడా చెప్పలేదని, దాన్ని ప్రత్యేక రాష్ట్రంగా కూడా చేయవచ్చని ఆంధ్రకాంగ్రెస్ నాయకులకు చెప్పిండు. దీంతో ఆంధ్ర కాంగ్రెస్ నాయకులు రాష్ట్రం ఏర్పాటుకు కేంద్రంపై వత్తిడి తెస్తూ రాష్ట్ర కాంగ్రెస్

కమిటీలో తీర్మానం చేసింద్రు. నవంబర్ 14లోగా ఆంధ్ర-తమిళనాడులు రాష్ట్రాల విభజన విషయంలో ఒక అభిప్రాయానికి రావాలని సూచించింది. నవంబర్ 12న తమిళనాడు కాంగ్రెస్ జెవిపి రిపోర్టుకు సమ్మతి తెలిపింది. దీంతో నవంబర్ 16న సమావేశమైన కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ ఆంధ్ర రాష్ట్ర ఏర్పాటు చర్యలు తీసుకోవాల్సిందిగా భారత ప్రభుత్వానికి విజ్ఞప్తి చేసింది.

## రాష్ట్ర విభజన కమిటీలో విభేదాలు

భారత ప్రభుత్వం రాష్ట్ర ఏర్పాటు విషయంలో వెంటవెంటనే చర్యలు తీసుకోవడం ప్రారంభించింది. భారత ప్రభుత్వ సలహా మేరకు మద్రాసు ప్రభుత్వం రాష్ట్ర విభజన కమిటీనొకదానిని ఏర్పాటు చేసింది. దీంట్లో టంగుటూరి ప్రకాశం, బెజవాడ గోపాలరెడ్డి, నీలం సంజీవరెడ్డి, కళా వెంకట్రావులు ఆంధ్ర తరపున, ఎం. భక్త వత్సలం, టి.టి. కృష్ణమాచారి, కె. మాధవ మీనన్‌లు మిగతా సభ్యులుగా ముఖ్యమంత్రి పి.ఎస్. కుమారస్వామి రాజా నేతృత్వంలో ఈ కమిటీ ఏర్పాటయింది. 1949 డిసెంబర్ 23న జరిగిన సమావేశంలో కొత్తగా ఏర్పడబోయే రాష్ట్రానికి నూతన రాజధాని నిర్మించుకునే వరకు మద్రాసు నుండి తమ కార్యకలాపాలు నిర్వహించుకోవచ్చని ఆంధ్రప్రాంతం వారు భావించారు. అయితే వారి ఆలోచనలను పటాపంచలు చేస్తూ తమిళనాడు సభ్యులు ఆంధ్రరాష్ట్ర అవతరణ నాటి నుంచే దాని కార్యకలాపాలు నూతన రాజధాని నుంచి జరగాలి, నూతన సెక్రటేరియట్‌ని ఏర్పాటు చేసుకోవాలి, నూతన అసెంబ్లీని కూడా ఆ ప్రాంతంలోనే ఏర్పాటు చేసుకోవాలని ఈ విభజన కమిటీలో తమిళ ప్రతినిధులు సూచించారు. ఈ వాదనకు ప్రకాశం అభ్యంతరం చెబుతూ కొత్త రాజధాని నిర్మించుకునే వరకు హై కోర్టు, శాసన సభ మద్రాసులోనే కొనసాగేందుకు హక్కుందని చెప్పిండు. ఆస్తులు-అప్పులు పంపకంలో కూడా ప్రకాశంకు అభ్యంతర ముండింది. దీనికి తమిళనాడు సభ్యులు అంగీకరించలేదు. 1950 ఆగస్టు వరకైనా అది సాధ్యం కానట్లయితే కనీసం ఏప్రిల్ 1950 నాటి వరకైనా మద్రాసులో ఉండేందుకు అనుమతించాలని ప్రకాశం విజ్ఞప్తి చేసిండు. డిమాండ్ చేయడం నుంచి విజ్ఞప్తి చేసే వరకు ఆంధ్రులు దిగిరావడంతో తమిళులు తమ పట్టు బిగించారు.

హై కోర్టు, శాసనసభ, ప్రభుత్వ కార్యాలయాల్ని మద్రాసులోనే కొనసాగనిచ్చినట్లయితే తర్వాత వారికి చట్టం అనుకూలించి ఇక్కడే తిష్ట వేసే ప్రమాదముందని ఆంధ్రుల విజ్ఞప్తిని తిరస్కరించారు. అవసరం ఆంధ్రులది కాబట్టి తమిళులు ఈ విషయంలో పట్టు విడుపులు



ప్రదర్శించలేదు. అన్నదమ్ముల్లా విడిపోవాల్సిన వారు దాయాదుల్లా పోట్లాడుకున్నారు. ఇదంతా ఎందుకు జరిగిందంటే 1950, జనవరి 26న నూతన రాజ్యాంగం అమల్లోకి వచ్చే కన్నా ముందే ఆంధ్ర రాష్ట్రం ఏర్పాటయినట్లయితే రాజ్యాంగ పరంగా పెద్దగా ఇబ్బందులుండవు. నూతన రాజ్యాంగం అమల్లోకి వచ్చినట్లయితే పార్లమెంటు ఆమోదం, మొదలయిన రాజ్యాంగ పరమైన ప్రక్రియలు పూర్తి కావడానికి చాలా కాలం పడుతుంది. ఈ మధ్య కాలంలో ఎవరి మనసు మారినా రాష్ట్రం ఏర్పాటు కష్ట సాధ్యమని భావించి ఆంధ్రులు వేగిర పడ్డారు. నూతన రాజ్యాంగం అమల్లోకి రావడానికి కేవలం 23 రోజులు మాత్రమే బాకీ ఉండడంతో తమిళులు ఏదడిగితే అదివ్వడానికి సిద్ధ పడ్డారు. వారికి న్యాయంగా దక్కాల్సిన దానికన్నా ఎక్కువ ఇచ్చామని రాష్ట్రం ఏర్పాటు తర్వాత సంజీవరెడ్డి వాపోయాడు.

ప్రకాశం అసమ్మతి తెలిపిన విభజన కమిటీ నివేదిక 1950 జనవరి మొదటివారంలో కేంద్రప్రభుత్వానికి చేరింది. అయితే నివేదిక ఏకగ్రీవంగా అందరి ఆమోదంతో పంపించి ఉండినట్లయితే కేంద్రం వెంటనే నిర్ణయం తీసుకునేందుకు వీలు చిక్కేది. ఇలాంటి పరిస్థితుల్లో నిర్ణయం తీసుకోవాల్సిన బాధ్యత నెహ్రూపై పడింది. (ఈ పరిస్థితుల్లో) నెహ్రూ తమిళనాడుతో సంప్రదించి తాత్కాలిక రాజధానిగా మద్రాసుని వాడుకునేందుకు ఆంధ్రులకు అనుమతివ్వాలని వత్తిడి తీసుకొచ్చే అవకాశముండింది. అలాగే దాని వల్ల జరిగే ఖర్చుని చండీఘడ్‌లో మాదిరిగా కేంద్రం భరిస్తుందని చెప్పడానికి కూడా వీలుండింది. నూతన రాజధాని నిర్మించుకోవడానికి ఆంధ్రకు సహాయం చేస్తామని చెప్పి కూడా రాష్ట్ర ఏర్పాటుకు సానుకూల పరిస్థితులు కల్పించడానికి అవకాశాలు ఉన్నప్పటికీ నెహ్రూ వాటినేవి పట్టించుకోలేదు. మీలో విభేదాలు పొడసూపినందున అవి పరిష్కారమయ్యే వరకు నూతన రాష్ట్ర ఏర్పాటు కావడం అసాధ్యమని చెప్పిండు. ఇదే విషయాన్ని 24 జనవరి, 1950 నాడు ప్రకటిస్తూ 1950 ఏప్రిల్ వరకు ఆంధ్ర రాష్ట్రం ఏర్పాటుకు అవకాశముందని చెప్పిండు. ఈ దశలో 75 మంది ఆంధ్ర సభ్యుల్లో 45 మంది మద్దతున్న పట్టాభి అనుచరుడు కళా వెంకటరావు తొలి ఆంధ్ర రాష్ట్ర ముఖ్యమంత్రి అవుతారనుకున్న వారి ఆశలు అడియాసలయ్యాయి. అలాగే రాష్ట్ర ఏర్పాటుకు రంగమంతా సిద్ధమయింది. కొత్త రాష్ట్రానికి శ్యామప్రసాద్ ముఖర్జీ గవర్నర్‌గా రానున్నారని కూడా ప్రచారం జరిగింది. అయితే ఇవేవి కార్యరూపం దాల్చకపోవడంతో ఆంధ్రులు హతాశులయ్యారు.

మద్రాసు నగరం కోసం ఆంధ్ర నాయకుల మొండిపట్టుదలే రాష్ట్రం ఏర్పాటుకు ప్రధాన అవరోధంగా ఉండిందని చెప్పొచ్చు. అంతే గాకుండా ప్రకాశం పంతులు కావాలనే ఆంధ్ర

రాష్ట్ర ఏర్పాటును అడ్డుకున్నారనే వాదన కూడా ఉంది. ఆ సమయంలో ఆంధ్ర రాష్ట్రం ఏర్పడినట్లయితే ఇప్పటికే ఎపిసిసిపై పట్టుకోల్పోయిన ప్రకాశం కనీసం ముఖ్యమంత్రి పదవి అయినా ప్రత్యర్థులకు దక్కకుండా చేయాలనే ఉద్దేశంతోనే విభజన కమిటీలో అసమ్మతి వ్యక్తం చేసిందని ఆ తర్వాత కాంగ్రెస్ నాయకులు బాహాటంగా విమర్శించారు. ఇందుకు నిదర్శనంగా 1950 జనవరిలోనే రాష్ట్ర కాంగ్రెస్ వ్యవహారాల్లో కాంగ్రెస్ జాతీయ అధ్యక్షుడు పట్టాభి, జాతీయ కార్యదర్శి కళా వెంకటరావులు అతిగా జోక్యం చేసుకుంటున్నారని, వారి జోరుకు ముకుతాడు వేయాల్సిందిగా పటేల్‌తో ప్రకాశం విన్నవించుకోవడాన్ని విమర్శకులు చూపుతున్నారు.

కాంగ్రెస్ అంతర్గత గొడవల మూలంగా ప్రత్యేక రాష్ట్ర సాధన అంశం వెనక్కెళ్లింది. తమిళులతో కలిసి ఉన్నందువల్ల అన్ని రకాల వివక్ష, దోపిడికి గురవుతున్నామని ఆంధ్రులు భావించారు. దీంతో స్వామి సీతారామ్ (సన్యాసిగా మారకముందు జి. సీతారామశాస్త్రి) మొట్టమొదటి సారిగా ప్రత్యేక ఆంధ్ర రాష్ట్రం కోసం 1951 ఆగస్టు - సెప్టెంబర్‌లో నిరాహార దీక్ష చేపట్టిండు. కొండా వెంకటప్పయ్య శిష్యుడు, ఆంధ్ర కాంగ్రెస్ కమిటీకి ఒక దశలో కార్యదర్శిగా పనిచేసిన సీతారామ్ ఆంధ్ర రాష్ట్ర సాధన కోసం నెహ్రూకు నాలుగైదు లేఖలు రాసిండు. ప్రధానితో బాటుగా, రాష్ట్రపతికి, మద్రాసు ప్రభుత్వానికి లేఖలు రాస్తూ 1951 ఆగస్టు 15లోగా ఆంధ్ర రాష్ట్రాన్ని ప్రకటించకపోతే నిరాహార దీక్ష చేపడాతమని హెచ్చరించాడు. ఆయన హెచ్చరికను ఎవ్వరూ ఖాతరు చేయక పోవడంతో 16 ఆగస్టు, 1951న దీక్షను ప్రారంభించాడు. వినోభా బావె మధ్యవర్తిత్వంతో సీతారామ్ సెప్టెంబర్ 20న దీక్ష విరమించిండు. కొండా వెంకటప్పయ్య 1949 ఆగస్టు 15న చనిపోయిండు. తన గురువు వెంకటప్పయ్య చిరకాల స్వప్నాన్ని సాధించేందుకు స్వామి సీతారామ్ నిరాహార దీక్షకు కూర్చుండు. సీతారామ్ దీక్ష ఇటు ఆంధ్రలోనూ అటు కేంద్రంలోనూ కొంచెం కదలిక తీసుకొచ్చింది. ఈ సందర్భంగా నెహ్రూ స్పందిస్తూ ప్రతి చిన్న విషయానికి నిరాహార దీక్ష చేపట్టడం ఏ మాత్రం బాగాలేదని, మెడమీద కత్తిబెట్టి డిమాండ్లు సాధించుకునే ఈ పద్ధతికి స్వస్తి పలకాలని హెచ్చరించిండు.

సెప్టెంబర్ 16న నెహ్రూ పార్లమెంటు సభ్యుడు కళా వెంకటరావు వేసిన ప్రశ్నకు జవాబు చెబుతూ ఆంధ్ర, తమిళనాడు, కర్నాటక ప్రదేశ్ కాంగ్రెస్ కమిటీలు, మద్రాసు ప్రభుత్వం ఒక సామరస్య పూర్వకమైన ఒప్పందానికి వచ్చినట్లయితే భారత ప్రభుత్వం అందుకు చర్యలు తీసుకుంటుందని జవాబిచ్చిండు. ఈ వైఖరి ఎవరికీ నచ్చలేదు. అయితే కష్టపడి అన్ని కాంగ్రెస్



కమిటీలు ఒక ఒప్పందానికి వచ్చినప్పటికీ నెహ్రూ దాన్ని తిరస్కరిస్తూ ఎన్నికలు దగ్గరపడుతున్న ప్రస్తుత తరుణంలో రాష్ట్రాల విభజన తగదని, ఎన్నికల తర్వాత దాని గురించి ఆలోచించవచ్చని చెప్పిండు. నెహ్రూకు - ఆంధ్ర కాంగ్రెస్ నేతలకు మధ్యన వినోబా భావె మధ్యవర్తిగా వ్యవహరించాడు. కేంద్ర ప్రభుత్వం ప్రజల న్యాయబద్ధమైన డిమాండ్ల పట్ల అశ్రద్ధ వహిస్తుందని భావించిన కొంతమంది 1951 డిసెంబర్ 11న ఆంధ్ర రాష్ట్ర స్థాపన సంఘాన్ని ఏర్పాటు చేసింద్రు. ఈ దశలో విశాఖపట్టణంలో ఎన్నికల ప్రచారసభలో పాల్గొనేందుకు వచ్చిన నెహ్రూను ప్రజలు నిలదీసింద్రు. గుంటూరులో కూడా అదే స్పందన ఎదురైంది. కమ్యూనిస్టులు ప్రత్యేక రాష్ట్ర సాధన అంశాన్ని ఎన్నికల అస్త్రంగా మార్చుకుంద్రు. ఆంధ్ర రాష్ట్ర స్థాపక సంఘం జనవరి 30, 1952 లేదా ఫిబ్రవరి తొమ్మిది నుంచి నిరాహార దీక్ష చేపడతామని హెచ్చరించింది.

మద్రాసు అసెంబ్లీకి 1952 జనవరిలో ఎన్నికలు జరిగాయి. మొత్తం 375 సీట్లకు గాను కాంగ్రెస్ 367 సీట్లకు పోటీ చేసి కేవలం 152 మాత్రమే గెలుచుకోగలిగింది. పెద్ద పెద్ద కాంగ్రెస్ నాయకులు కూడా అనామకుల చేతిలో పరాజయం పాలయ్యారు. కళా వెంకటరావు, బెజవాడ గోపాలరెడ్డి, నీలం సంజీవరెడ్డితో సహా మహామహులు చిత్తుగా ఓడిపోయింద్రు. నాలుగు డెల్టా జిల్లాల్లో కలిపి కాంగ్రెస్ మొత్తం 58 సీట్లకు గాను 11 మాత్రమే గెలుచుకోగలిగింది. మొత్తం 12 తెలుగు జిల్లాల్లో కాంగ్రెస్ - 43, కమ్యూనిస్టులు-41, ప్రజాపార్టీ-20, క్రిషిక్ లోక్ పార్టీ-15, సోషలిస్టు-7, ఇతరులు-1, స్వతంత్రులు-18 మంది ఎన్నికయ్యారు. కమ్యూనిస్టులు, కిసాన్ మజ్దూర్ పార్టీలు కలిసి యునైటెడ్ ఫ్రంట్‌గా ఏర్పడ్డాయి. ఈ ఫ్రంట్‌కు 164 మంది సభ్యుల మద్దతుండింది. దీనికి ప్రకాశం పంతులు నాయకత్వం వహించారు. శాసనసభలో ఈ వర్గానికే మద్దతున్నప్పటికీ గవర్నర్ కుట్ర పూరితంగా రాజాజీని ముఖ్యమంత్రిగా ప్రమాణ స్వీకారం చేయించాడు. పైగా రాజాజీ ముఖ్యమంత్రి అయిన తర్వాత ఆంధ్ర ప్రయోజనాలకు విఘాతం కలిగించే విధంగా కృష్ణా-పెన్నార్ ప్రాజెక్టులలో శ్రద్ధ కనబరిచి కృష్ణానది జలాలను తమిళనాడుకు తరలించాలని ప్రయత్నించాడు. ఇది ఆంధ్రుల్లో మరింత ఆగ్రహాన్ని పెంచింది. ఈ ప్రాజెక్టుకు వ్యతిరేకంగా ఆంధ్రలో పెద్ద ఎత్తున ఉద్యమం మొదలైంది. ఈ ప్రాజెక్టుపై సాంకేతిక పరిశీలన జరిపిన ఖోస్లా సంఘం కృష్ణా-పెన్నారు ప్రాజెక్టుని యథాతథంగా అమలు చేయకూడదని అభిప్రాయపడింది: ప్రత్యామ్నాయంగా నందికొండ (నాగార్జున సాగర్) ప్రాజెక్టుని నిర్మించడం ఉచితమని పేర్కొంది.

## పొట్టి శ్రీరాములు ఆత్మార్పణం

ఈ పరిస్థితుల్లో ప్రత్యేక ఆంధ్రరాష్ట్ర సాధన ఒక్కటే అన్ని సమస్యలకు పరిష్కారమని భావించిన పొట్టి శ్రీరాములు అక్టోబరు 19, 1952 నాడు నిరాహార దీక్షను ప్రారంభించాడు. డిసెంబరు ఎనిమిదిన చనిపోయిండు. 50 రోజుల నిరాహార దీక్ష తర్వాత పొట్టి శ్రీరాములు ఆత్మార్పణం చేసిండు. దీక్ష కొనసాగుతున్న కాలంలో నెహ్రూ ఆంధ్ర రాష్ట్ర ఏర్పాటుకు పూర్తి మద్దతు ప్రకటించాడు. ఇందుకోసం చర్యలు తీసుకోగలమని హామీ కూడా ఇచ్చాడు. అయినప్పటికీ గతంలో స్వామి సీతారామ్‌కు కూడా ఇలానే హామీ ఇచ్చి నెలబెట్టుకోలేదని, అందువల్ల తన దీక్షను కొనసాగిస్తానని పొట్టి శ్రీరాములు చెప్పిండు. పొట్టి శ్రీరాములు ఆత్మార్పణంతో ఆంధ్రలో అల్లకల్లోల పరిస్థితి ఏర్పడింది. అనకాపల్లి, విజయవాడ లాంటి ప్రదేశాలలో జరిగిన పోలీసు కాల్పుల్లో ఏడుగురు చనిపోయారు. సమస్య చేయిదాటి పోతుందని భావించిన నెహ్రూ పార్లమెంటులో ఒక ప్రకటన చేసిండు. అనంతరం నెహ్రూ డిసెంబరు 19న లోక్‌సభలో ఒక ప్రకటన చేస్తూ ఆయా రాష్ట్రాలు ఒక అంగీకారానికి వచ్చినట్లయితే భారత ప్రభుత్వం రాష్ట్రం ఏర్పాటు చేయడానికి కృషి చేస్తుందని చెప్పిండు. వివాదాస్పదం కాని ప్రాంతాలతో మద్రాసు లేకుండా ఆంధ్ర రాష్ట్రాన్ని ఏర్పాటు చేయడానికి తాము సిద్ధమని ప్రకటించిండు.

ఇందుకు తగ్గట్టుగానే ఆంధ్రరాష్ట్ర ఏర్పాటు వల్ల ఏర్పడే ఆర్థిక, పాలనా పరమైన సమస్యలను పరిశీలించి సలహాలిచ్చేందుకు గాను రాజస్థాన్ హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి జస్టిస్ కైలాష్‌నాథ్ వాంఛూ నేతృత్వంలో ఒక కమిటీని కేంద్ర ప్రభుత్వం నియమించింది. ఈ కమిటీ తన నివేదికను 1953 ఫిబ్రవరి ఏడున సమర్పించింది. మార్చి 25న ప్రత్యేక ఆంధ్ర రాష్ట్ర ఏర్పాటును ప్రభుత్వం అధికారికంగా ప్రకటించింది. ఆంధ్ర రాష్ట్ర ఏర్పాటు ప్రకటన తర్వాత రాయలసీమ నాయకులు శ్రీ బాగ్ ఒడంబడిక మేరకు రాజధాని తమకే దక్కాలని డిమాండ్ చేయగా కమ్యూనిస్టులు రాజధానిని విజయవాడలో నెలకొల్పాలని కోరారు.

రాజకీయ ఎత్తుగడల్లో ఆరితేరిన నీలం సంజీవరెడ్డి ప్రకాశం, రంగాలను కాన్ఫిడెన్స్‌లోకి తీసుకొని కిసాన్ మజ్దూర్ పార్టీ, కృషికార్ లోక్ పార్టీల మద్దతుతో ఆంధ్ర శాసనసభా పక్ష నేతగా ఎన్నికయిండు. సంజీవరెడ్డికి మద్దతిచ్చిన కృషికార్ లోక్‌పార్టీ రాజధానిని తిరుపతిలో ఏర్పాటు చేయాలని డిమాండ్ చేసింది. అయితే ఈ విషయమై 1953 జూన్‌లో సమావేశమైన మద్రాసు శాసనసభ చర్చించి కర్నూలును రాజధానిగా ఏర్పాటు చేయాలని తీర్మానించింది.



ప్రకాశం పంతులు మద్దతు లేకుండా కాంగ్రెస్ ప్రభుత్వాన్ని ఏర్పాటు చేయలేదని భావించిన అధిష్ఠానం ఆయన్ని కాంగ్రెస్ అసోసియేట్ సభ్యుడిగా అంగీకరించింది. దీంతో ప్రకాశం ముఖ్యమంత్రిగా, నీలం సంజీవరెడ్డి ఉప ముఖ్యమంత్రిగా, సి.యమ్. త్రివేది గవర్నర్‌గా 1953 అక్టోబర్ ఒకటిన ఆంధ్రరాష్ట్రాన్ని నెహ్రూ ప్రారంభించారు.

ఆంధ్ర రాష్ట్రం ఏర్పాటయిన నాటి నుంచే సీమాంధ్రులు హైదరాబాద్‌ని తమ రాజధానిగా చేసుకోడానికి ప్రయత్నాలు ప్రారంభించారు. రాజధాని, ఆఫీసు కార్యాలయాలు, హైకోర్టు, శాసనసభ, నదీజలాలకు బడ్జెట్ ఇలా అన్ని సమస్యలకు ఏకైక మందు విశాలాంధ్రగా భావించి దానికి విస్తృత ప్రచారం కల్పించిండ్రు.

# ఆంధ్రప్రదేశ్ ఏర్పాటు - విద్రోహ రాజకీయాలు

1946-56 తెలంగాణకు కీలక దశాబ్దం. ప్రత్యేక తెలంగాణ కలలపై కారుమబ్బులు కమ్మిన కల్లోల దశాబ్దం. హైదరాబాద్ రాజ్య దశను దిశను మార్చి అధోగతి పాల్జేసిన కాలమిది. ఈ కాలంలో తెలంగాణ రాజకీయంగా, ఆర్థికంగా, సామాజికంగా ఎన్నో వొడుదొడుకుల్ని ఎదుర్కొంది. రజాకార్లు మొదలు కాంగ్రెసు, సోషలిస్టులు, ఆర్య సమాజ్ వారు తమ కార్యకలాపాల్ని ముమ్మరంగా నడిపిన కాలమిది. ఈ దశాబ్దంలోనే కమ్యూనిస్టులు అక్షరాన్ని, ఆయుధాన్ని నిజాం ప్రభుత్వంపై సంధించిండ్రు. పోలీస్ చర్య తర్వాత భారత ప్రభుత్వంపై ఎక్కుబెట్టిండ్రు. హైదరాబాద్ రాజ్యంపై భారత సైన్యం చేసిన దండయాత్రలో రెండు లక్షల మంది ముస్లింలు ఊచకోతకు గురయ్యిందీ ఈ సమయంలోనే. మిలిటరీ అధికారులు, ఐసిఎస్ ఆఫీసర్లు హైదరాబాద్‌పై అధికారం చెలాయించిండ్రు. 1952లో ఎన్నికలు జరిగి బాధ్యతాయుత ప్రభుత్వం బూర్గుల రామకృష్ణారావు నేతృత్వంలో ఏర్పడిందీ, హైదరాబాద్ రాజ్యం తమ అస్తిత్వాన్ని కోల్పోయి, ముక్కలు ముక్కలుగా విడగొట్టబడి ముల్కీ హక్కుల అమలుకు సైతం నోచుకోకుండా పోయింది ఈ కల్లోల కాలంలోనే. ఈ దశాబ్దంలోనే ముల్కీ ఉద్యమంలో తెలంగాణ బిడ్డలు అసువులు బాసిండ్రు.

విశాలాంధ్ర మహాసభ పేరిట ఆంధ్రకాంగ్రెస్ నాయకులు, విశాలాంధ్రలో ప్రజారాజ్యం పేరిట కమ్యూనిస్టు నాయకులు (తల్లి) తెలంగాణపై తమ దోపిడీకి, ద్రోహానికి, రాజకీయ ఆధిపత్యానికి దారులు వేసుకుండ్రు. కమ్యూనిస్టు నాయకుడు పుచ్చలపల్లి సుందరయ్య విశాలాంధ్రలో ప్రజారాజ్యం సిద్ధాంతాన్ని ప్రచారంలోకి ఈ కాలంలోనే తెచ్చిండు. కృష్ణాజిల్లా నందిగామకు చెందిన కాంగ్రెస్ నాయకుడు, అయ్యదేవర కాళేశ్వరరావు విజయవాడ కేంద్రంగా విశాలాంధ్ర మహాసభ ఏర్పాటు చేసిండు. దాని ద్వారా రాజకీయ కార్యక్రమాలు నిర్వహిస్తూ మొత్తం తెలుగువారందరికీ కలిపి ఒకే రాష్ట్రాన్ని ఏర్పాటు చేయాలనే డిమాండ్‌ని ముందుకు తీసుకొచ్చిండు. ఇందుకు ప్రతిఫలంగానా అన్నట్టుగా ఆంధ్రప్రదేశ్ అసెంబ్లీ తొలి స్పీకర్



పదవి ఆయనకే దక్కింది. 1953లో ఆంధ్ర రాష్ట్ర ఏర్పాటుకు, ఆ తర్వాత ఆంధ్ర రాష్ట్ర ఎన్నికల్లో (1955లో) ఆంధ్ర కాంగ్రెసుకు సహాయం చేసినందుకు మూల్యంగా హైదరాబాద్ కాంగ్రెస్ తన అస్తిత్వాన్నే కోల్పోయి ఆంధ్రప్రదేశ్‌లో అంతర్భాగమయింది. ఆంధ్ర రాష్ట్ర ఏర్పాటు కోసం హైదరాబాద్ రాష్ట్ర మేధావులు, ప్రజలు, పత్రికలు బాసటగా నిలిచాయి. తెలంగాణ ప్రజల తోడ్పాటుతో ఏర్పాటయిన ఆంధ్ర రాష్ట్రంలో అస్థిరత చోటు చేసుకుంది. కాంగ్రెసు నాయకుల కీచులాటలు, ముఠా నాయకత్వాల ఆధిపత్య పోరులో ప్రభుత్వం కేవలం 13 నెలల్లోనే పడిపోయింది. దీంతో 1955లో ఆంధ్ర అసెంబ్లీకి ఎన్నికలు జరిగాయి. ఈ ఎన్నికల ప్రచారం ఖర్చు హైదరాబాద్ కాంగ్రెస్ కమిటీ ఇక్కడి ఆదాయ వనరులతో భరించింది. ఆంధ్రలో కమ్యూనిస్టుల గెలుపుని అడ్డుకోవడంలో హైదరాబాద్ కాంగ్రెస్ పాత్ర చాలా ఉంది. ఇదంతా కూడా తర్వాతి కాలంలో హైదరాబాద్ రాష్ట్ర మనుగడకే ముప్పుని తీసుకొచ్చింది. ఆంధ్రమహాసభ, కమ్యూనిస్టులపై నిషేధం, హైదరాబాద్ స్టేట్ కాంగ్రెస్‌పై నిషేధం ఎత్తివేత కూడా ఈ కాలంలోని చర్యలే. హైదరాబాద్ అందాల్ని, వసతుల్ని చూసి కన్నుకుట్టిన ఆంధ్ర నాయకులు విశాలాంధ్ర కోసం తమ పోరును ఉధృతం చేసిండ్రు.

మరోవైపు కమ్యూనిస్టులు తమ భాషా రాష్ట్ర సిద్ధాంతానికి విస్తృత ప్రచారం కల్పించిండ్రు. ముఖ్యంగా ఆంధ్ర రాష్ట్ర నాయకుల పోరుపడలేకనే ఎస్.ఆర్.సి. (రాష్ట్రాల పునర్విభజన కమిటీ)ని నెహ్రూ ఏర్పాటు చేసిండు. ఈ కమిటీకి చెందిన సయ్యద్ ఫజల్ అలీ నేతృత్వం వహించగా హృదయ నాథ్ కుంజ్రూ, కె.యం. పణిక్కర్‌లు సభ్యులుగా ఉన్నారు. ఈ కమిటీ రాష్ట్రాల విభజనకు సంబంధించి అన్ని విషయాల్ని క్షుణ్ణంగా పరిశీలించి ఎలాంటి రాగద్వేషాలకు తావీయకుండా తెలంగాణను ప్రత్యేక హైదరాబాద్ రాష్ట్రంగా కొనసాగించాలని పేర్కొంది. తెలంగాణ-ఆంధ్రప్రాంత కలయికతో అమాయకులైన హైదరాబాద్ రాష్ట్ర ప్రజలు అన్ని రంగాల్లో ఆరితేరిన ఆంధ్రుల చేతిలో మోసానికి గురవుతారనే భయాన్ని తమ నివేదికలో వ్యక్తం చేసింది. (ఫజల్ అలీ కమీషన్ రిపోర్టును అనుబంధంలో చూడవచ్చు).

కాంగ్రెస్ జాతీయ నాయకులు, ఆంధ్ర నాయకులు కలిసి జస్టిస్ ఫజల్ అలీ నివేదికను సైతం ఉన్నదున్నట్టుగా అమలు కాకుండా అడ్డుకోగలిగారు. కన్నడ, మరాఠీ భాషా ప్రాంతాలను వరుసగా మైసూరు, బొంబాయి రాష్ట్రాల్లో కలిపేయాలని అలాగే హైదరాబాద్ రాష్ట్ర తెలుగు ప్రాంతాన్ని ప్రత్యేక రాష్ట్రంగా కొనసాగించాలనీ కమిటీ తన నివేదికలో పేర్కొంది. నివేదికను పూర్తిగా అమలు చేయకుండా తెలంగాణ ప్రజల ఆకాంక్షలకు విరుద్ధంగా బలవంతంగా ఆంధ్రప్రదేశ్ పేరిట స్వాధీనం చేసుకుండ్రు, ఆంధ్రప్రాంత నాయకులు ఎవరికి వారు తమ

వ్యక్తిగత ఎజెండాను ముందు పెట్టుకొని ఆంధ్రప్రదేశ్ అవతరణకు కృషి చేసింట్రు. తెలంగాణకు రక్షణలు, ఒప్పందాలు, బ్లాంక్ చెక్ వంటి మోసపు మాటలు చెప్పి దోసుకునేందుకు, దోసుకున్నది దాసుకునేందుకు అభూత కల్పనలు, అబద్ధపు ప్రచారాలు చేసింట్రు. తరతరాల మోసాన్ని తెలంగాణ ఇప్పుడు ఎండగడుతుంది. గత అనుభవాల నుంచి 'గుణపాఠం' నేర్చుకుంది. ప్రత్యేక తెలంగాణ సాధన కోసం కర్తవ్యాన్ని నిర్దేశించుకుంటోంది. ఆంధ్రప్రదేశ్ అవతరణ పేరిట జరిగిన విద్రోహాన్ని వివరంగా చెబుతుంది. 52 ఏండ్ల సమైక్యవాదం తెచ్చిన చేటుని చాటుతున్నది. సమైక్యవాద మైకంలో కన్నూ మిన్నూ గానకుండా తెలంగాణకు చేసిన అన్యాయంలో స్థానికుల పాత్ర కూడా ఉంది. ఎవరి రంగేందో బహిరంగమై నగ్న స్వరూపాలు బయటపడుతున్నాయి.

భూస్వాముల పీడన, దోపిడీకి వ్యతిరేకంగా ఆంధ్రమహాసభ 'సంగం' తరపున ప్రజల్ని చైతన్య వంతుల్ని చేసి అన్యాయాల్ని, అక్రమాల్ని ఎదిరించి ప్రశ్నించే ధైర్యాన్నిచ్చింది. ఈ ధైర్యం నుంచే ఎందరో తెలంగాణ బిడ్డలు పోరు పతాకను ఎగరేశారు. దొరలు, దేశ్‌ముఖ్‌లు, జాగీర్దార్లు, జమిందార్లు సాగించిన దోపిడీని ధిక్కరించిన కాలమిది. జనగాం తాలూకా విసునూరు దేశ్‌ముఖ్ భూస్వామ్య దౌర్జన్యానికి ప్రతీక. ఈ దేశ్‌ముఖ్ రామచంద్రారెడ్డిని, ఆయన గూండాల ఆగడాలను అడ్డుకునేందుకు కమ్యూనిస్టు పార్టీ ఉద్యమం చేసింది. షేక్ బందగీ మొదలు కొన్ని వేల మంది వెట్టికి, దోపిడీకి, దౌర్జన్యానికి, పీడనకు వ్యతిరేకంగా నిలిచారు. పోరాడారు. వరంగల్ జిల్లా కడవెండిలో భూస్వాముల దౌర్జన్యాలను ఎదిరిస్తూ దొడ్డి కొమురయ్య అసువులు బాసిండు. 1946 జూలై నాలుగున దొడ్డి కొమురయ్య వీరమరణంతో సాయుధ రూపం తీసుకున్న రైతాంగ పోరాటం తెలంగాణ ప్రజల చైతన్యాన్ని ప్రపంచ వ్యాప్తం చేసింది. సుద్దాల హనుమంతు, బండి యాదగిరి, రాజారాం లాంటి ఎందరో ప్రజా కవిగాయకులు పోరాటానికి ఊపిరులూదింట్రు. అమెరికా పాప్ గాయకుడు పాల్ రాబ్సన్, ప్రఖ్యాత రచయిత పాబ్లో నెరుడా, అంతర్జాతీయ అడ్వకేట్ డి.ఎన్.ప్రిట్ లాంటి ప్రపంచ స్థాయి ఉద్యమకారులు తెలంగాణకు అండగా నిలిచారు. ఇదే సమయంలో చిత్తప్రసాద్, సునిల్ జెనా లాంటి కళాకారులు సాయుధ పోరాటానికి చిత్రిక గట్టారు. కిషన్ చందర్, కె.ఎ. అబ్బాస్ తోపాటుగా దేశవిదేశాల రచయితలు ఈ పోరాటానికి అక్షర రూపమిచ్చింట్రు. తెలంగాణ చరిత్రలో చిరస్థాయిగా నిలిచిపోయే పోరాటమిది. ఈ సాయుధ సమరంలో ప్రజలకు అండగా నిలుస్తామని ఆయుధాన్ని చేత బట్టిన కమ్యూనిస్టులు 1951 అక్టోబర్ 20న పోరాట విరమణ ప్రకటించారు. 1952లో జరిగిన ఎన్నికల్లో 'హస్తం' గుర్తుపై పిడిఎఫ్ కూటమి తరపున హైదరాబాద్ అసెంబ్లీలో ప్రవేశించిన



కమ్యూనిస్టులు పోరాట ఫలాలు పేదలకు దక్కకుండా పోతున్నా పదవులకు అతుక్కుపోయింట్రు. పంచిన భూమి పేదలకు అందకున్నా గొంతు పెగల్చలేదు.

1952 మార్చి 21న జరిగిన హైదరాబాద్ శాసనసభ తొలి సమావేశంలోనే విశాలాంధ్ర, సంయుక్త మహారాష్ట్ర, ఐక్య కర్నాటకను ఏర్పాటు చేయాలని ఒక తీర్మానాన్ని ప్రొగ్రెసివ్ డెమెక్రటిక్ ఫ్రంట్ పేరున కార్యకలాపాలు జరుపుతున్న కమ్యూనిస్టులు ప్రతిపాదించారు. ఇది వీగిపోయింది. పిడిఎఫ్ ఈ తీర్మానాన్ని ప్రతిపాదిస్తూ హైదరాబాద్ తదితర పట్టణాల్లో ఉన్న మహమ్మదీయులు మున్నగు అల్పసంఖ్యాకులలో విశాలాంధ్ర అంటే ఉన్న అనుమానాలను, అపోహలను తొలగించడానికి శాసనసభలోనూ, వెలుపలా పెద్ద యెత్తున ప్రచారం చేశారు. ఈ విషయాన్ని హైదరాబాద్ శాసనసభలో పిడిఎఫ్ సాగించిన సమరంపై వెలువరించిన పుస్తకంలో పేర్కొన్నారు. దీన్ని బట్టి ఆనాడు ముస్లింలలో విశాలాంధ్ర భావన పట్ల ఉన్న సందేహాలు తెలుస్తున్నాయి.

ఎస్.బి. మహదేవ్ సింగ్ లాంటి సోషలిస్టులు మొదట విశాలాంధ్ర నినాదాన్ని ఇచ్చినప్పటికీ 1953లో ఆంధ్ర రాష్ట్ర అవతరణ తర్వాత ప్రత్యేక తెలంగాణ ఉండి తీరాలని ఉద్యమమే చేసిండు. ఎన్.ఆర్. వెంకటేశం లాంటి సోషలిస్టు శాసనసభ్యులు ఉస్మానియా యూనివర్సిటీని సెంట్రల్ యూనివర్సిటీగా మార్చి స్థానికులకు అందుబాటులో లేకుండా చేయాలనే కేంద్ర కుట్రను 1952లోనే సమర్ధవంతంగా ఎదుర్కొన్నారు. ఉర్దూ మాధ్యమంగా బోధించే దేశీయ యూనివర్సిటీని ఉత్తరాది వాళ్లు కబ్జా చేస్తారని భావించడమే గాకుండా తమ స్థానిక సంస్కృతి నాశనమౌతుందని హైదరాబాద్ ప్రజలు అడ్డుకున్నారు. ఈ చర్య వల్ల తెలంగాణకు జరుగబోయే నష్టాలను ప్రజలకు వివరించింట్రు. ఉద్యమాలు నడిపింట్రు. అలాగే ఆర్య సమాజ్ కూడా తెలంగాణకు కట్టుబడి ఉంది. ఆర్య సమాజంలో సంబంధమున్నప్పటికీ తెలంగాణ భూభాగంతో ఏలాంటి పేగుబంధం లేని స్వామి రామానంద తీర్థ లాంటి స్టేట్ కాంగ్రెస్ నాయకులు మాత్రం ఆంధ్ర వలసపాలకుల భ్రమలకు లోనయి విశాలాంధ్ర నినాదమిచ్చారు. ఎందుకంటే వారెన్నడూ హైదరాబాద్‌ని తమ మాతృభూమిగా చూడలేదు.

కమ్యూనిస్టులు ప్రచారంలో పెట్టిన భాషా రాష్ట్ర సిద్ధాంతాలను వివిధ కారణాలను ముందుంచి చాలా మంది వ్యతిరేకించారు. దార్ కమిటీ, నెహ్రూ, ఆజాద్, అంబేద్కర్, రాజాజీ లాంటి పెద్దలందరూ ఈ సిద్ధాంతాన్ని వ్యతిరేకించినప్పటికీ ఆంధ్ర వలసవాదుల లాబీది పైచేయి అయింది. భాష ఆధారంగా రాష్ట్రాల విభజన దేశసమగ్రతకు, సార్వభౌమత్వానికే చేటు తెస్తుందని సి. రాజగోపాలాచారి మొదటి నుంచి వాదిస్తూ వచ్చారు. స్వాతంత్ర్యానికి పూర్వం, ఆ తర్వాత కూడా ఆయన ఇదే అభిప్రాయంతో ఉన్నారు.

ఇదే విషయాన్ని హైదరాబాద్‌లో 1953లో జరిగిన కాంగ్రెస్ మహాసభల్లో కూడా నొక్కి చెప్పాడు. భాషా ప్రయుక్త రాష్ట్రాల డిమాండ్‌ని 'ట్రైబలిజమ్'తో పోల్చారు.

నెహ్రూకు కూడా భాషా రాష్ట్రాల పట్ల సదభిప్రాయం లేదనడానికి చాలా నిదర్శనాలున్నాయి. అందులో ఒకటి. 1952లో బొంబాయి నుంచి వెలువడే ఫ్రీ ప్రెస్ జర్నల్ పత్రికకు ఇంటర్వ్యూ ఇస్తూ హైదరాబాద్‌ని విభజించి విశాలాంధ్ర ఏర్పాటు చేయడం మా అభిమతం కాదు. దీనికి రెండు ప్రాంతాల ప్రజల మధ్య పరస్పర నమ్మకం ఏర్పాడలన్నాడు. "ఇరు ప్రాంతాల ప్రజలు సుహృద్భావ వాతావరణంలో కలిసి జీవించేందుకు సిద్ధపడినట్లయితే దాన్ని ప్రభుత్వం ఎంతమాత్రం వ్యతిరేకించదు. అయితే వత్తిడి ద్వారా, బెదిరింపుల ద్వారా ఈ నిర్ణయానికి రావద్దని" అన్నాడు. భాషా ప్రయుక్త రాష్ట్రాలపై తన అభిప్రాయాన్ని ఇలా వ్యక్తం జేసిండు. "భాషా ప్రయుక్త రాష్ట్రాలకు, హైదరాబాద్ విభజనకు నేను వ్యతిరేకిని. అయితే నిజమైన ప్రజాస్వామ్య వాదిగా ప్రజలు తీసుకునే నిర్ణయాన్ని పూర్తిగా సమర్థిస్తాను. భాషా ప్రయుక్త రాష్ట్రాలు ఏర్పాటు కావాలని ప్రజలు కోరినట్లయితే, దాని వల్ల ఏర్పడే సమస్యలను సామరస్య పూరితంగా పరిష్కరించుకున్నట్లయితే నాకేమి అభ్యంతరం లేదు.... రెండు ప్రాంతాల మధ్యన సరిహద్దు విషయమై విభేదాలు చోటు చేసుకుంటే తాను ఎంత మాత్రం జోక్యం చేసుకోను". ఇది నెహ్రూ దాటవేత ధోరణికి నిదర్శనంగా ఆనాడే విమర్శలొచ్చాయి. తన భాద్యతల నుంచి తప్పుకోవడంగా పరిశీలకులు భావించారు. నెహ్రూ దాటవేత దోరణి చేటు తెస్తుందని ఆంధ్ర కాంగ్రెస్ నాయకులు, తెలంగాణ కమ్యూనిస్టు నాయకులు ముందుండి విశాలాంధ్ర కోసం పెద్ద ఎత్తున ప్రచారం చేసింద్రు. ఢిల్లీలో పైరవీలు ప్రారంభించింద్రు. రావి నారాయణరెడ్డి తమ జీవిత చరిత్రలో 'విశాలాంధ్ర కోసం పైరవీలు' అనే చాప్టర్ ద్వారా ఆనాడు ఢిల్లీలో సుందరయ్య, నారాయణరెడ్డి, నందూరి ప్రసాదరావులు వేసిన ఎత్తులు, జిత్తుల్ని చెప్పిండు కూడా. 1952లో మద్రాసు అసెంబ్లీకి జరిగిన ఎన్నికల్లో ఓటమి చవిచూసిన నీలం సంజీవరెడ్డి కమ్యూనిస్టుల సలహాలు, సహాయాలతో ఊరూరా విశాలాంధ్ర కోసం ప్రచారం చేసి ప్రజాభిప్రాయాన్ని ఆంధ్ర-రాయలసీమల్లో తమకు అనుకూలంగా మలుచుకోగలిగాడు. ఒక దశలో ప్రత్యేక రాయలసీమ డిమాండ్ చేసిన సంజీవరెడ్డి 'శ్రీబాగ్' ఒడంబడిక ద్వారా సీమకు జరిగిన అన్యాయాన్ని ఎదిరించడానికి అంతగా ప్రాధాన్యత నివ్వలేదు. స్వీయ ప్రయోజనాల కోసం ప్రాంత ప్రయోజనాల్ని ఫణంగా పెట్టయినా సరే ముఖ్యమంత్రి పదవి సాధించాలనే తలంపుతో విశాలాంధ్రకు మద్దతిచ్చాడు. ఈ మద్దతు వెనుక హైదరాబాద్‌లో పాగా వేయడమే



వారి ప్రధానోద్దేశ్యం. శాశ్వత రాజధానిగా అన్ని హంగులున్న హైదరాబాద్‌ని అక్రమించుకోడం అసలు ఎత్తుగడ. నిండైన వనరులు, ఆర్థిక పరిపుష్టి, మిగులు బడ్జెట్‌తో కళకళలాడుతున్న హైదరాబాద్ రాష్ట్రంపై ఆధిపత్యం సాధించినట్లయితే ఇటు రాయలసీమ, అటు ఆంధ్రప్రాంతాల్లోని పంటలకు సాగునీరు పుష్కలంగా ఇవ్వొచ్చని ప్రచారం చేసింద్రు. దాదాపు ఇదే సమయంలో హైదరాబాద్‌లో జరిగిన కాంగ్రెస్ సభలకు హాజరయిన సీమాంధ్ర నాయకులను ప్రభుత్వ కార్యకలాపాల నిర్వహణకోసం ఉన్న సొంత భవనాలు, దేశంలోనే మొట్టమొదటి రోడ్డు రవాణ వ్యవస్థ కల్పించిన ఆధునిక రవాణా సదుపాయాలు (వారిని) కట్టి పడేశాయి. మరోవైపు కర్నూలులో తమ రాజధాని డేరాల్లో, అద్దె భవనాల్లో రోజూ పాములు, తేళ్ల హడావిడి మధ్య నడిచేవి. హైదరాబాద్‌కు, కర్నూలుకు మధ్యన ఉన్న తేడా కూడా విశాలాంధ్రపై మరింత మోజుని ఆంధ్రప్రాంతీయులకు పెంచింది. ఆంధ్రప్రదేశ్ ఏర్పాటుకు తెలంగాణ నుంచి 95 శాతం వ్యతిరేకత ఉన్నా తామనుకున్నది నెరవేర్చుకోగలిగారు. తెలంగాణకు ఇచ్చిన రక్షణల ఒప్పందం సంతకాల తడి ఆరక ముందే 'తుంగ'లో తొక్కింద్రు. హైదరాబాద్ రాజ్యం (తర్వాత రాష్ట్రం) పై తమ ఆధిపత్యాన్ని చాటుకునేందుకు మొదట పోలీసు చర్య సమయంలో మూడు వేలకు పైగా ఉన్నతోద్యోగులు (ముఖ్యంగా తెలుగు తెలిసినవారు) మద్రాసు రాష్ట్రం నుంచి దిగుమతి అయ్యింద్రు. వీరు తమ ఉన్నత స్థానాలను ఆసరాగా చేసుకొని చిన్న చిన్న ఉద్యోగాలు సైతం తమ ప్రాంతం వారికి కట్టబెట్టేవారు. అయితే నిబంధనల ప్రకారం పోలీసు చర్య తర్వాత శాంతి ఏర్పడిన వెంటనే ఆ ఉద్యోగుల్ని తమ ప్రాంతానికి పంపించాల్సి ఉండింది. ఆ నిబంధనలను అమల్లోకి తీసుకురాకుండా యధేచ్ఛగా ఇక్కడే కొనసాగించారు. ఇదే సమయంలో ప్రజాస్వామ్యబద్ధంగా ఎన్నికైన తొలి హైదరాబాద్ రాష్ట్ర ముఖ్యమంత్రి బూర్గుల రామకృష్ణారావు ముందు చూపు లేకుండా బోధనా భాషగా తెలుగు, ఇంగ్లీషు ఉండాలని చట్టాన్ని తీసుకు వచ్చిండు. అప్పటి వరకున్న ఉర్దూ మీడియం పాఠశాలల స్థానంలో తెలుగు మీడియాన్ని ప్రవేశ పెట్టారు. దీంతో అప్పటి వరకు ఉర్దూ మాధ్యమంలో మాత్రమే చదువుకున్న స్థానికులకు (హిందువులు, ముస్లిములు) ఉద్యోగాలు దొరకలేదు. అలాగే పాఠశాలల్లో తెలుగులో బోధించేందుకు తగినంత మంది స్థానిక టీచర్లు లభ్యం కాలేదు. తెలుగు తెలిసిన బడిపంతుళ్లను మద్రాసు రాష్ట్రం నుంచి దిగుమతి చేసుకోవాల్సి వచ్చింది. ఇలా వచ్చిన వారు తమ ప్రాంత భాషను పాఠ్య పుస్తకాల్లో, బోధనలో చొప్పించి తెలంగాణ వారికి తెలుగు రాదంటూ ప్రచారం చేసింద్రు. ఇంకా చేస్తుంద్రు. అలాగాకుండా స్థానికులు తెలుగు నేర్చుకునే విధంగా చర్యలు తీసుకొని ఆ తర్వాత క్రమంగా తెలుగు మీడియం పాఠశాలలు నెలకొల్పినట్లయితే స్థానికులకు

ఉద్యోగాలు దక్కేవి. ఇదే సమయంలో ఆంధ్రప్రాంతం వారు అనేక మంది లెక్కకు మించిన దొంగ ముల్కీ సర్టిఫికెట్లను సృష్టించి తెలంగాణాలో ఉద్యోగాలు సంపాదించిండ్రు. మరోవైపు అప్పటికే హైదరాబాద్ రాష్ట్ర ప్రభుత్వంలో పనిజేస్తున్న వారు తప్పనిసరిగా తెలుగు నేర్చుకోవాలనే అభియోగాలు మోపి ఇబ్బందులకు గురిచేయడం (ముఖ్యంగా ముస్లిం ఉద్యోగులను) ఇలా రకరకాల కారణాలతో స్థానికుల్ని ఉద్యోగాల నుంచి తొలగించిండ్రు. అంటే ఒక వైపు తెలంగాణ ప్రాంతం వారు ఉన్న ఉద్యోగాలు కోల్పోగా, మరోవైపు తెలంగాణేతరులు న్యాయంగా స్థానికులకు దక్కాల్సిన ఉద్యోగాలను కబ్జా చేసిండ్రు. (ఎందుకంటే) వడ్డించే వారు అప్పటికే ఆంధ్ర నుంచి వచ్చిన అధికార్లు కావడంతో వారి కడుపు నిండింది. తెలంగాణ వాడి కడుపు మాడింది, మండింది. కడుపు మండిన ముల్కీలు తమ ఉద్యోగాలు తమకే దక్కాలని పెద్ద ఉద్యమమే తీసుకొచ్చారు. "ప్రాంతీయ భాషలలో చక్కగా బోధించే ఉపాధ్యాయుల సంఖ్య తక్కువగా ఉండటం వల్లను, ఇంగ్లీషు, సైన్సు, లెక్కలు వంటి విషయాలు బోధించే ఉపాధ్యాయులు ఈ ప్రాంతంలో తగినంత మంది లభ్యం కాకపోవటం వల్లను, రాష్ట్రం వెలుపలి వారిని ఉపాధ్యాయులుగా నియమించసాగారు. తెలంగాణలో ఆంధ్ర ప్రాంతం నుంచి వచ్చిన ఉపాధ్యాయుల సంఖ్య పెరగసాగింది. పోలీసు చర్య అనంతరం సివిల్ పరిపాలనలో ఆంధ్ర (మద్రాసు) రాష్ట్రం నుంచి చాలా మంది అధికారులు వచ్చి, తాలూకా స్థాయి నుండి అధికారం హస్తగతం చేసుకొన్నారు. అలా వచ్చిన అధికారులలో కొందరు విజ్ఞత లేక ఆధిక్య భావంతో ప్రవర్తించారు. అప్పటికి అమలులో ఉన్న పరిపాలనా విధానాన్ని తారుమారు చేయసాగారు. ఇక్కడి అధికారులు అసమర్థులని హేళన చేసారు. వారి హయాంలో గుమాస్తా వంటి చిన్న చిన్న ఉద్యోగాలలో కూడా ఆంధ్రప్రాంతం వారు వచ్చి చేరారు. దానితో తెలంగాణా ప్రాంత ఉద్యోగులలో ఒక అసంతృప్తి కలిగినది. సివిల్ పరిపాలన అంతమై నూతన (ప్రజాస్వామిక) ప్రభుత్వం వచ్చిన తరువాత కూడా ఆంధ్రప్రాంతం నుండి ఉపాధ్యాయుల నియామకం పెరగటం వల్ల, ప్రాంతీయ భావాలు ఇక్కడి ప్రజలలో కొంత చోటు చేసుకున్నవి. ఉపాధ్యాయులు కూడా దీనితో ప్రభావితులైనారు. దీనిని అరికట్టడానికి కొంత కాలం 'ముల్కీ' ఉద్యమం నడచినది". అని ఉపాధ్యాయ ఉద్యమ నాయకుడు వి.పి. రాఘవాచార్యులు తమ స్వీయ చరిత్ర "చైతన్య స్రవంతి–ఉపాధ్యయ ఉద్యమము–నాస్మృతులు' అనే పుస్తకంలో వివరంగా చెప్పిండు. ఈ పుస్తకం ప్రస్తుత తెలంగాణ ఉద్యమం ఊపందుకున్న తర్వాత రాసింది కాదు. 1994లోనే ఈ స్వీయ చరిత్ర వెలువడింది. అందువల్ల ఉద్యమ ప్రభావంతో కాకుండా వాస్తవాలను రికార్డు చేసిన ఆత్మకథగా దీనికి గుర్తింపు ఉంది. ఆయన ఆంధ్రప్రదేశ్ అవతరణ సమయంలో కాళోజి,



దాశరథి, సి. నారాయణరెడ్డిల మాదిరిగానే సమైక్య వాదిగా ఉండి 'ఆంధ్రప్రదేశ్ అవతరణము' అనే కవితా సంకలనాన్ని కూడా తీసుకొచ్చిండు.

1934లో ముల్కీలకే ఉద్యోగాలివ్వాలని పద్మజానాయుడు, అబ్దుల్ హసన్ సయ్యద్ అలి, బూర్గుల రామకృష్ణారావు, ఎస్.బి. శర్మ, సయ్యద్ అబిద్ హసన్‌లు ఉద్యమాన్ని లేవదీసిండ్రు. పుస్తకాలు ప్రచురించి ప్రపంచానికి హైదరాబాద్ మూలవాసుల దుర్భర జీవితాన్ని ఎరుకపరిచిండ్రు. అబిద్ హసన్ 'విదర్ హైదరాబాద్' పేరిట ఆంగ్లంలో రాసిన పుస్తకంలో ముల్కీ ఉద్యమానికి సంబంధించిన పూర్తి వివరాలున్నాయి. హైదరాబాద్ రాజ్యంలో ఉద్యోగాలు లక్నో, లాహోర్, ఢిల్లీ నుంచి వచ్చే వారికి దక్కుతున్నాయని అవి న్యాయంగా హైదరాబాద్ ప్రజలకు దక్కాలని పెద్ద ఎత్తున ముల్కీ ఉద్యమం చేపట్టారు. ఈ ఉద్యమం మూలంగా నిజాం ప్రభుత్వం దిగివచ్చి స్థానికులకు రిజర్వేషన్లు కల్పిస్తూ ఫర్మానాలు జారీ చేసింది. అయితే ఇదే బూర్గుల రామకృష్ణారావు ముఖ్యమంత్రి అయిన తర్వాత స్థానిక నిరుద్యోగ యువకులు చేపట్టిన ఉద్యమాన్ని ఉక్కుపాదంతో అణచివేసిండు.

ముల్కీ నిబంధనలను పటిష్టంగా అమలుపర్చాలని, బోగస్ ముల్కీ సర్టిఫికెట్లతో ఉద్యోగాల్లో చేరిన వారిని శిక్షించాలని, స్థానికేతరులను వెనక్కు పంపించాలనీ వారు ఖాళీ చేసిన పోస్టుల్లో స్థానికులను నియమించాలని ముల్కీ ఉద్యమం మొదలయింది. హైదరాబాద్ రాష్ట్రంలో 15 ఏండ్లకు పైగా నివసిస్తున్నవారు, ఈ ప్రాంతం ఆచార వ్యవహారాలను గౌరవిస్తూ ఆచరిస్తున్నవారే ముల్కీలని ప్రభుత్వం తమ ఆర్డర్లలో స్పష్టంగా పేర్కొంది.

(ఈ సందర్భంగా విద్యార్థులు చేసిన ఉద్యమం తొలి తెలంగాణ అస్తిత్వవాద ఉద్యమంగా తెలంగాణ విద్యావంతుల వేదిక అధ్యక్షులు ఎం. కోదండరామ్ ఒక వ్యాసంలో అభిప్రాయపడ్డారు.)

గైర్ ముల్కీ గోబ్యాక్, ఇడ్లీ సాంబార్ గోబ్యాక్ అనేది ఆనాటి విద్యార్థుల నినాదం. ఆంధ్రులు కొల్లగొడుతున్న తమ ఉద్యోగాలు తమకే దక్కాలని చేసిన ఉద్యమంలో పోలీసు కాల్పుల్లో ఏడుగురు విద్యార్థులు చనిపోయారు. 171 మందికి గాయాలు కాగా, 58 మంది విద్యార్థులు తీవ్ర గాయాలతో వికలాంగులయ్యారు. ఈ సంఘటనపై న్యాయవిచారణ చేసేందుకు జస్టిస్ జీవన్ రెడ్డి నేతృత్వంలో ఓ కమిటీ ఏర్పడింది. ఈ కమిటీ ముందు రాయ్ శ్రీకిషన్, మనోహర్ రాజ్ సక్సేనా లాంటి అడ్వకేట్లతో పాటుగా, సరోజిని నాయుడు కొడుకు, మానవహక్కుల నాయకుడు జయసూర్యనాయుడు కూడా తమ వాదన వినిపించాడు. ఈ సందర్భంగా నాయుడు మాట్లాడుతూ ఇప్పుడు ప్రపంచంలో మూడే మూడు దేశాల్లో పరాయి దేశ సైన్యం మకాం వేసింది. జర్మనీ, జపాన్‌లతో పాటుగా హైదరాబాద్ రాజ్యంలో కూడా పరాయి సైన్యం ఉందనీ,

దానికి ఇక్కడి ప్రజల మీద ప్రేమ లేకపోవడంతోనే కాల్పులకు దిగిందని వాదించిండు. "జపాన్ జర్మనీలతో పాటు హైద్రాబాదును కూడా ఒక ఆక్రమిత ప్రాంతంగా చేశారు. అయితే జపాన్, జర్మనీలతో వ్యవహరించడానికి స్పష్టమైన నియమాలను అంతర్జాతీయంగా రూపొందించారు. కాని హైదరాబాదు విషయంలో భారత ప్రభుత్వం ఎటువంటి నియమాలను తయారు చేసుకోలేదు" అని తమ దేశ పౌరులతో శత్రుపూరిత వైఖరితో వ్యవహరించిన బూర్గుల, నెహ్రూ ప్రభుత్వాలను జయసూర్య నాయుడు నిలదీసిండు. తెలంగాణ వాదులపై, ముల్కీ ఉద్యమకారులపై కాల్పులు జరిపించిన అప్పటి ముఖ్యమంత్రి ప్రజల నుంచి తీవ్ర వ్యతిరేకతను చవిచూసిండు. ప్రజలు ఆయన్ని నరరూప రాక్షసుడిగా చిత్రించిండ్రు.

తెలంగాణ ప్రాంత ఉద్యోగాలు తెలంగాణవారికే దక్కాలి. ఇక్కడి వనరులు ఈ ప్రజల ఆస్తి అనే సోయి పాలకులకు లేక పోవడంతోనే సమస్యలు ముసురుకున్నాయి. బూర్గులకు నిజంగానే చిత్త శుద్ధి ఉంటే ముందుగా ఒక క్రమ పద్ధతిలో తెలంగాణ ప్రాంతం వారికి టీచర్ ట్రేనింగ్ ఇప్పించి వారిని ఉద్యోగాల్లో నియమించినట్లయితే మన భాష పాఠ్యపుస్తకాల్లో అలాగే ఉండేది. మన ఘన చరిత్ర అందరికీ తెలిసేది. కనీసం కొన్నయినా మన ఉద్యోగాలు మనకు దక్కేవి. ఇదొక చారిత్రక తప్పిదం. బూర్గుల గురించి చర్చించేప్పుడు ఇక్కడే మరో విషయం కూడా చెప్పుకోవాలి. "బూర్గుల ముస్లిం వ్యతిరేక భావాలు కలవాడనీ, పక్షపాత దృష్టి కలవాడనీ నిందిస్తూ పోయారు. ముస్లిములు తమ ప్రత్యేకతను కోల్పోనిష్టపడరనీ, నూతన రాష్ట్రంలోని పెద్ద జనాభాలో చిన్న శాతంగా ఉండే అల్పసంఖ్యాక వర్గంగా ఉండటానికి ముస్లిములు ఇష్టపడరనీ ఆయన అన్నారు" అని నెహ్రూతో మౌలానా ఆజాద్ జరిపిన సంభాషణల్ని డి. రామలింగం తన 'బహుముఖ ప్రజ్ఞాశాలి బూర్గుల' అనే పుస్తకంలో రికార్డు చేసిండు. అయితే ఇవన్నీ దురుద్దేశాలు అంటగట్టడమే అని రామలింగం పేర్కొన్నాడు. దీన్ని బట్టి ఆనాడు బూర్గుల పట్ల జాతీయ స్థాయి నాయకుల్లో కొందరికి గల అభిప్రాయం తెలుస్తుంది. ప్రత్యేక తెలంగాణ వాది నుంచి విశాలాంధ్ర వాదిగా మారడానికి దారితీసిన ముఖ్యమంత్రుల సమావేశం, అందులో గోవింద్ వల్లభ్ పంత్ లాంటి వారితో జరిగిన సమావేశ వివరాలు పూర్తిగా విశదమయినప్పుడే బూర్గుల "యు" టర్న్' తీసుకోవడానికి దారితీసిన పరిస్థితుల్ని సరిగ్గా అంచనా వేయడానికి వీలవుతుంది. కల్లోల దశాబ్దంలో ఇది ఒక భాగం మాత్రమే. హైదరాబాద్ రాష్ట్రం అస్తిత్వం కోల్పోయి, ఆంధ్ర రాష్ట్రంతో బలవంతపు విలీనానికి దారితీసిన పరిస్థితులను కూలంకషంగా పరిశీలించి విశ్లేషించినపుడే తెలంగాణకు జరిగిన మోసం, ఆంధ్ర వలస పాలకుల మాయోపాయాల గుట్టు రట్టవుతుంది.



## విశాలాంధ్ర వాదం

తెలంగాణ ప్రజల ఆకాంక్షలకు వ్యతిరేకంగా ఏర్పడే ఆంధ్రప్రదేశ్‌లో ఈ ప్రాంత ప్రజలకు సరైన న్యాయం జరుగదని ఆనాడే విజ్ఞులెందరో వివరంగా చెప్పిండ్రు. విశాలాంధ్ర వాదనలో 'సామ్రాజ్యవాద విస్తరణ కాంక్ష', కోస్తాంధ్రుల దోపిడి భావన, రాయలసీమ నాయకుల కులాభిమానం, డెల్టా భూస్వాముల వ్యాపార, వాణిజ్యావసరాలు ఇమిడి ఉన్నాయని ఆనాటి తెలంగాణ పత్రికలు (ముఖ్యంగా గోలకొండ పత్రిక) తమ కథనాల ద్వారా తెలియజెప్పాయి. మేధావులందరూ తెలంగాణ పక్షం వహిస్తూ ప్రాంతేతరుల దోపిడి స్వభావాన్ని ఎండగట్టారు. తెలంగాణ ప్రజల్లో 95 శాతం మంది ఆంధ్రతో విలీనానికి వ్యతిరేకంగా నిలిచారు. నెహ్రూ, రాజాజీ, ఆజాద్, అంబేద్కర్ లాంటి జాతీయ స్థాయి నాయకులు, ఎన్జీరంగా లాంటి ఆంధ్రప్రాంత నాయకులు, రాష్ట్రాల పునర్విభజన కమిటీ ఇలా ఎందరో వ్యక్తులు, కమిటీలు విశాలాంధ్ర భావనను వ్యతిరేకించారు. తెలంగాణను కలుపుకోవడం వల్ల విశాలాంధ్ర బలపడుతుందా? బలహీనపడుతుందా? ముందు ఒక అంచనాకు రావాలని రంగా తన అభిప్రాయాన్ని వ్యక్తం జేసిండు. అలాగే విశాలాంధ్ర ఏర్పాటుతో కమ్యూనిస్టులు బలపడుతారు కాబట్టి వారిని అడ్డుకోవాలంటే రెండు వేర్వేరు తెలుగు రాష్ట్రాలు ఉండడమే మంచిదన్నాడు. తప్పనిసరి పరిస్థితుల్లో విశాలాంధ్ర ఏర్పాటు జరిగినట్లయితే హైదరాబాద్‌ని రాష్ట్ర రాజధానిగా కొనసాగిస్తూ, విజయవాడ-గుంటూరు మధ్య ప్రదేశాన్ని ప్రాంతీయ రాజధానిగా ఏర్పాటు చేయాలని ఆయన డిమాండ్ చేసిండు. హైదరాబాద్ రాజ్య ప్రజల అభిప్రాయం భిన్నంగా ఉన్నప్పటికీ కొంతమంది స్వార్థ తెలంగాణ రాజకీయ నాయకులను 'ఆంధ్ర సెంటిమెంట్ పేరిట' మాయ జేసి, మోసం జేసి, మభ్య పెట్టి రాత్రికి రాత్రే అభిప్రాయాల్ని మార్చుకునేలా జేశారు ఆంధ్ర పాలకులు, విశాలాంధ్ర భావన వెనుక ఉన్న విద్రోహాన్ని, ప్రాంతేతరుల స్వార్థ రాజకీయ కుటిల నీతి, అమలు చేయని హామీల వల్ల జరిగిన అన్యాయం అన్నీ కలగలిసి మొత్తం మీద తెలంగాణను ఈనాటికి కోలుకోకుండా చేసింది.

ఒక దశాబ్దపు (1946-1956) కల్లోల కాలాన్ని నిషితంగా పరిశీలించినట్లయితే ఆంధ్ర వలస పాలకుల పీడనకు దారి తీసిన పరిస్థితులు అవగతమవుతాయి. ఈ విషయమై ఇప్పటికే ఎంతో పరిశోధన జరిగినప్పటికీ అదంతా తెలుగు పాఠకులకు అందుబాటులోకి రాలేదు. 'ది ఎమర్జెన్సీ ఆఫ్ ఆంధ్రప్రదేశ్' పేరిట కె.వి. నారాయాణరావు వెలువరించిన సిద్ధాంత గ్రంథం అలాంటి పరిశోధనల్లో ప్రధానమైంది. 1969 ప్రత్యేక తెలంగాణ ఉద్యమ సందర్భంగా కూడా

తెలుగు, ఇంగ్లీషు భాషల్లో పదుల సంఖ్యలో వచ్చిన పుస్తకాలలో విశాలాంధ్ర పేరిట జరిగిన విద్రోహ చరిత్ర రికార్డయింది.

విశాలాంధ్ర భావన ప్రధానంగా సర్కారు జిల్లాల నుంచి వచ్చిన డిమాండ్. 1936లోనే ఆంధ్రా కాంగ్రెస్ స్వరాజ్య పార్టీ తెలంగాణను కూడా కలుపుకొని ఆంధ్ర రాష్ట్రాన్ని ఏర్పాటు చేయాలని డిమాండ్ చేసింది. అలాగే మామిడిపూడి వెంకటరంగయ్య 1937లోనే తెలుగు మాట్లాడే ప్రాంతమంతా కలిపి ఒకే ప్రదేశంగా ఏర్పాటు చేయాలనే భావనను వ్యాప్తిలోకి తెచ్చిండు. రాయలసీమకు చెందిన కడప కోటి రెడ్డి కూడా నిజాం రాజ్యాంగబద్ధమైన పాలకుడిగా మారినట్లయితే ఆయన అధీనంలో తెలుగు ప్రాంతాలన్నీ కలిసి పోవాలనే అభిప్రాయాన్ని ప్రచారంలోకి తెచ్చిండు. కమ్యూనిస్టు నాయకుడు పుచ్చలపల్లి సుందరయ్య పాకిస్తాన్ ప్రజల న్యాయమైన ప్రత్యేక రాజ్య డిమాండ్ – తెలుగు మాట్లాడే ప్రజల విశాలాంధ్ర భావనను ఆంధ్ర కాంగ్రెస్ నాయకులు తప్పుపడుతున్నారని ఇవి రెండూ న్యాసమ్మతమైన డిమాండ్లేనని ఆయన చెప్పిండు. తన 'విశాలాంధ్రలో ప్రజారాజ్యం' పేరిట ప్రచారంలో పెట్టిన భావనల్లో కూడా ఇదే ప్రధానంగా చోటు చేసుకుంది.

1946లో సుందరయ్య తాను రాసిన 'ఆంధ్ర రాష్ట్ర నిర్మాణము–ఇంగ్లీషు సామ్రాజ్యవాదుల కుట్ర' అనే పుస్తకంలో విద్య, పరిశ్రమల రంగాల్లో ఆంధ్ర ప్రాంతం వెనకబడిపోవడానికి ప్రధాన కారణం బ్రిటీషు పాలన అని పేర్కొన్నాడు. అలాగే నిజాం ప్రాంతాన్ని కూడా కలుపుకొని విశాలాంధ్ర ఏర్పాటు కావడానికి ప్రయత్నించాలని ఆయన అందులో చెప్పిండు. దీనికి అనుగుణంగానే రాష్ట్రాల పునర్విభజన కమిటీ హైదరాబాద్‌లో పర్యటించినపుడు పి.డి.ఎఫ్ (ప్రొగ్రెసివ్ డెమొక్రటిక్ ఫ్రంట్–తెలంగాణ కమ్యూనిస్టుల ఐక్య సంఘటన) శాసనసభా పక్షం తరపున విశాలాంధ్ర నిర్మాణావశ్యకతను, విశాలాంధ్రలో మైనారిటీలకు ఉండాల్సిన రక్షణలను ప్రత్యేకంగా పేర్కొంటూ ఒక విజ్ఞాపన ఇచ్చారు. రాష్ట్రాల విభజన సందర్భంగా మైనారిటీలకు ఉద్యోగాల విషయంలో, వారి విద్యా వైజ్ఞానికాభి వృద్ధికి ఎలాంటి ఆటంకాలు ఏర్పడకుండా ప్రత్యేక రక్షణలు ఏర్పర్చాల్సి ఉంటుందని ఆ విజ్ఞాపనలో పేర్కొన్నారు. అయినప్పటికీ విశాలాంధ్ర పట్ల తెలంగాణలో సానుకూలత ఏర్పడలేదు. తెలంగాణ ప్రాంతానికి చెందిన అన్ని పార్టీల శాసన సభ్యులను సమీకరించడానికి పిడిఎఫ్ ప్రత్యేక శ్రద్ధతో కృషి చేసింది. భాష ప్రాతిపదికన రాష్ట్రాన్ని విభజించాలని 1953 బడ్జెట్ సమావేశంలో హైదరాబాద్ అసెంబ్లీలో తీర్మానాన్ని ప్రవేశపెట్టింది. ఇది 1953 మార్చి 25, ఏప్రిల్ 10, 11 తేదీల్లో చర్చకు వచ్చింది. కాంగ్రెస్ పార్టీ తీర్మానాన్ని వ్యతిరేకించింది. ఓటింగ్ జరగ్గా 16 ఓట్ల తేడాతో పిడిఎఫ్ ప్రవేశపెట్టిన



తీర్మానం వీగిపోయింది.

1947లో రాజ్యాంగ నిర్మాణ సభలో నెహ్రూ మాట్లాడుతూ ఆంధ్ర రాష్ట్ర డిమాండ్ పూర్తిగా న్యాయమైందని పేర్కొన్నాడు. అయితే అది కేవలం మద్రాసు ప్రావిన్స్‌లోని తెలుగు ప్రాంతాలకు మాత్రమే పరిమితం. నిజాం ఇలాకాలోని తెలుగు ప్రాంతాలు కూడా ఆంధ్ర ప్రాంతంలో కలుపుకోవాలి అనే భావనను ఆయన 'సామ్రాజ్యవాద విస్తరణ కాంక్ష'తో పోలుస్తూ అది సంభవం కాదని తేల్చి చెప్పాడు. 1951 జూలైలో బెంగుళూరులో జరిగిన కాంగ్రెస్ సమావేశంలో అయ్యదేవర కాళేశ్వరరావు విశాలాంధ్ర డిమాండ్‌ని ముందుకు తేవడంతో నెహ్రూ తీవ్రంగా స్పందిస్తూ ఏం తమాషా చేస్తున్నారా! ఇలా మాట్లాడితే ఆంధ్ర రాష్ట్రం కూడా దక్కదని హెచ్చరించాడు. ఇదే అయ్యదేవర కాళేశ్వరరావు అంతకు ముందు 1948 ఏప్రిల్ 26న బొంబాయిలో బాబు రాజేంద్రప్రసాద్ నేతృత్వంలో జరిగిన ఆలిండియా కాంగ్రెస్ స్థాయి సంఘ రహస్య సమావేశానికి హాజరయ్యారు. ఈ సమావేశానికి హైదరాబాదు నుండి కూడా కాంగ్రెస్ నాయకులు హాజరయ్యారు. ఈ సందర్భంగా ఆంధ్రులకు వెంటనే ప్రత్యేక రాష్ట్రాన్ని ప్రకటించాలని డిమాండ్ చేసిండు. దీనికి రాజేంద్రప్రసాద్ సమాధానమిస్తూ ఆంధ్ర రాష్ట్రాన్ని ప్రకటించి నట్లయితే మహారాష్ట్ర, కర్నాటకలపై కూడా నిర్ణయాన్ని వెల్లడించాల్సి ఉంటుందని అందువల్ల వీటన్నింటిని కూలంకషంగా చర్చించి అన్నింటిపై ఒకేసారి తుది నిర్ణయం తీసుకుంటే బాగుంటుందనే అభిప్రాయాన్ని వ్యక్తం జేసిండు. ఈ సమావేశంలోనే హైదరాబాద్ పై పోలీసు చర్య జరపాలని డిమాండ్ చేస్తూ కాళేశ్వరరావు పెద్ద ఎత్తున ప్రచారం ప్రారంభించిండు. రజాకార్ల ఆగడాల సందర్భంగా హైదరాబాద్ రాజ్యాన్ని విడిచి వలస వచ్చిన వారిని కలుపుకొని విజయవాడలో విశాలాంధ్ర మహాసభను ఏర్పాటు చేసిండు. 1947 జూలైలో తెలంగాణ నుంచి వలస వచ్చిన కాంగ్రెస్ కార్యకర్తలు, నాయకుల సమావేశం విజయవాడలోని కాళేశ్వరరావు ఇంట్లోనే జరిగింది. దీంట్లో హైదరాబాద్ స్వాతంత్ర్యం కోసం పోరాడుతున్న వారికి బాసటగా నిలవాలని, ఉద్యమానికి చేయూత నివ్వాలని నిర్ణయించారు. సరిహద్దు క్యాంప్ కర్నూలులో కూడా నిర్వహిస్తున్నందున అక్కడ కూడా పోరాట కమిటీ శాఖను ఏర్పాటు చేసింద్రు. బాధ్యతా యుత ప్రభుత్వం కోసం ఉద్యమించాలని స్వామి రామానంద తీర్థ పిలుపునిచ్చారు. అలాగే ఆంధ్రకాంగ్రెస్ కమిటీ తరపున హైదరాబాదు ప్రజలకు సహాయ సహకారాలు అందజేసేందుకు కాళేశ్వరరావు నేతృత్వంలో ఒక సంఘాన్ని కూడా స్థాపించారు. పోలీసు చర్య అనంతరం ఒకవైపు సాయుధ పోరాటం, మరోవైపు మిలిటరీ మితిమీరిన చర్యలతో తెలంగాణ అనేక సవాళ్ల నెదుర్కొంటుండగా కాళేశ్వరరావు నవంబర్ 1948లో హైదరాబాద్ లో పర్యటించిండు. స్వామి రామానంద

తీర్థతో సమావేశమై హైదరాబాద్ విభజన జరిగి విశాలాంధ్ర ఏర్పాటు చేయాలని డిమాండ్ చేసిండు. మొత్తము తెలుగువారందరికీ హైద్రాబాదే రాజధాని అనే విషయాన్ని అయ్యదేవర ప్రచారంలోకి తెచ్చిండు. దీన్ని సర్దార్ పటేల్ తీవ్రంగా గర్హిస్తూ 1949 మేనెలలో డెహ్రాడూన్ లో జరిగిన కాంగ్రెస్ సమావేశంలో హైద్రాబాద్ కాంగ్రెస్ నాయకులతో మాట్లాడుతూ ఈ విషయంలో ఎలాంటి ఆందోళన అవసరం లేదని హామీ ఇచ్చిండు. అలాగే కాళేశ్వరరావుకు ఉత్తరం రాస్తూ హైద్రాబాద్ విభజన గురించి ఆందోళన చేయాల్సిన అవసరం లేదు. ఐదు సంవత్సరాల తర్వాత గానీ దీనిపై నిర్ణయం తీసుకోరాదని, అంతవరకూ హైద్రాబాద్ రాష్ట్రానికి మాత్రమే హైద్రాబాద్ రాజధానిగా ఉంటుందని చెప్పిండు. హైద్రాబాద్‌పై కన్నేసిన కొందరు ఆంధ్రప్రాంత కాంగ్రెస్ నాయకులు దాన్ని దక్కించుకోవడానికి ప్రజాస్వామ్య పద్ధతిలో ప్రయత్నిస్తూనే ఎన్ని ఎత్తుగడలు వేయాలో, ఎన్ని మాయోపాయాలు పన్నాలో అన్ని పన్నిండ్రు. ఈ ఎత్తులు, జిత్తుల్లో భాగంగానే విశాలాంధ్ర మహాసభ 1949 నవంబర్ 26న ఏర్పాటయింది. ఈ మహాసభ 1950 ఫిబ్రవరి 13, 14 తేదీల్లో సమావేశమై విశాలాంధ్ర కోసం ఉద్యమం చేపట్టాలని తీర్మానించింది. 1950 జనవరిలో మద్రాసులో సమావేశమైన ఆంధ్రకాంగ్రెసు కమిటీ ఆంధ్రుల తాత్కాలిక రాజధాని మదరాసు అనీ హైద్రాబాదు శాశ్వత రాజధాని అని తీర్మానించిండ్రు. దీన్ని కొంత సవరించుకొని సెప్టెంబరు 30, 1953 నాడు అంటే ఆంధ్ర రాష్ట్ర అవతరణకు ఒకరోజు ముందు సమావేశమైన ఆంధ్ర కాంగ్రెస్ కమిటీ కర్నూలు తాత్కాలిక రాజధాని అనీ, శాశ్వత రాజధాని హైద్రాబాదే అని తీర్మానం చేసిండ్రు. దీన్ని బట్టి తేలేదిమిటంటే ఆంధ్ర కాంగ్రెస్ కమిటీ, కమ్యూనిస్టు నాయకులు ఒక కుట్ర పూరితమైన వ్యూహంతోనే కర్నూలును తాత్కాలిక రాజధానిగా ఏర్పాటు చేసుకొని అందుకు అవసరమైన భవనాల నిర్మాణాన్ని చేపట్టకుండా హైద్రాబాద్‌ని కబ్జా చేయాలనే ఆలోచనలతో ఉన్నారు. అన్ని హంగులతో సకల సౌకర్యాలతో ఉన్న వాటిని దక్కించుకోవాలనే కోర్కెతో మూడేండ్ల పాటు టెంట్‌లు, రెంటెడ్ భవనాల్లో తమ కార్యాలయాల్ని నడిపారు. ఎలాంటి మౌలిక సదుపాయాలు సమకూర్చుకోలేదు. కొత్త రాజధాని నిర్మాణాం కోసం, మౌలిక సదుపాయాల కల్పన కోసం కేంద్రం ఇచ్చిన వందకోట్ల గ్రాంటుని కూడా దుర్వినియోగం చేసిన ఘనత ఆంధ్ర పాలకులది. తమకు అనుకూలురైన తెలంగాణ నాయకులతో కర్నూలులో ఆంధ్రరాష్ట్ర అవతరణ సందర్భంగా విశాలాంధ్ర ఏర్పాటుకు సమాలోచనలు జరిపిండ్రు. అంటే ఒకవైపు ఆంధ్ర రాష్ట్ర అవతరణ జరుపుకుంటూనే మరోవైపు హైద్రాబాద్‌ని, తెలంగాణని తమలో విలీనం చేసుకునేందుకు కుట్రలు సాగించిండ్రు.

1952లో లంకా సుందరం గారి అధ్యక్షతన మహారాష్ట్రలోని అకోలాలో భాషా రాష్ట్ర



వాదుల సమావేశం జరిగింది. ఈ సమావేశంలో బొంబాయి, హైద్రాబాదులను కేంద్రపాలిత ప్రాంతాలుగా ప్రకటించి మహారాష్ట్ర, కర్నాటక, విశాలాంధ్ర రాష్ట్రాలను ఏర్పాటు చేయాలని సూచించారు. అయితే ఈ సమావేశంలో ఎవ్వరు కూడా ఈ సూచనకు అంగీకారం తెలుపక పోవడమే గాకుండా వ్యతిరేకంగా నిలిచారు. (హైద్రాబాద్‌ని కేంద్రపాలిత ప్రాంతంగా జేసి తెలంగాణ వారికి దక్కకుండా చేయాలనే కుట్ర ఇప్పటికీ ప్రయత్న పూర్వకంగా జరుగుతోంది).

తెలంగాణలో విశాలాంధ్ర మహాసభకు మూల స్థంభాలుగా నిలబడ్డ వారు దేవులపల్లి రామానుజరావు, పాగా పుల్లారెడ్డి. వీరు వివిధ కార్యకలాపాల ద్వారా ప్రజల మద్దతు కూడగట్టడానికి ప్రయత్నాలు చేసిండ్రు. మొదట్లో చాలా మంది కవులు, ప్రముఖులు విశాలాంధ్రకు అనుకూలంగా ఉన్నప్పటికీ తర్వాతి కాలంలో తెలంగాణకు జరుగనున్న అన్యాయాన్ని గ్రహించి వ్యతిరేకించారు. అలాంటి వాండ్లలో జంటనగరాల్లో సోషలిస్టు ఉద్యమానికి ఊపిరి పోసిన ఎస్.బి. సింగ్, సురవరం అనుయాయి, 1969లో ప్రత్యేక తెలంగాణ ఉద్యమానికి ప్రాణవాయువులు అందించిన బొజ్జం నర్సింలు ముఖ్యులు. దేవులపల్లి రామానుజరావు ఒకవైపు 'శోభ' పత్రిక ద్వారా ప్రాంతేతర కవి పండితుల ముఖచిత్రాలతో పత్రికను తీసుకు వస్తూ మరోవైపు విశాలాంధ్ర మహాసభ తరపున ప్రచారం చేసిండు. విశాలాంధ్ర మహాసభ తరపున బాధ్యతలన్నీ భుజం మీదికి ఎత్తుకుండు. కరపత్రాల ప్రచురణ దగ్గర నుంచి, పుస్తకాల ప్రచురణ వరకు అన్నీ ఆయనే చూసుకున్నారు. స్వయంగా విశాలాంధ్ర వచ్చింది అనే పుస్తకాన్ని కూడా వెలువరించాడు. హైదరాబాద్ రాజ్యాన్ని విడగొట్టి సంయుక్త మహారాష్ట్ర, సంయుక్త కర్నాటక, విశాలాంధ్ర రాష్ట్రాలను ఏర్పాటు చేయాలని డిమాండ్ ముందుకు తీసుకొచ్చి చిన్నపాటి ఉద్యమాన్ని లేవదీసిండు. దీనికి మహారాష్ట్ర, కర్నాటక ప్రాంతాల్లోని చాలా మంది సుముఖంగా ఉండేవారు. అయితే తెలంగాణ విషయానికి వస్తే మొదట్లో కొంతమంది ఆసక్తి చూపించినప్పటికీ ఆ తర్వాత పూర్తిగా వ్యతిరేకంగా నిలిచిన వారే ఎక్కువగా ఉన్నారు. దీంట్లో కమ్యూనిస్టులతో సహా అన్ని పార్టీలవారు ఉన్నారు. అయ్యదేవర కాళేశ్వరరావు తదితరులు భాషా ప్రాతిపదికన రాష్ట్రాల ఏర్పాటు సాధ్యాసాధ్యాలపై అధ్యయనానికి నియమించబడ్డ ధార్ కమిటీకి విశాలాంధ్రని కోరుతూ మెమోరాండం ఇచ్చిండ్రు. హైదరాబాద్‌లో విశాలాంధ్ర మహాసభ తరపున ఉద్యమం చేసేందుకు హైదరాబాద్‌లో సమాలోచనలు చేస్తున్న కాళేశ్వరరావుకు ఉప ప్రధాని వల్లభ్ భాయి పటేల్ సలహా ఇవ్వడంతో తాత్కాలికంగా దాన్ని విరమించుకున్నారు. అయితే తర్వాతి కాలంలో వరంగల్లులో సమావేశమైన విశాలాంధ్ర మహాసభ వారు 1950 ఫిబ్రవరిలో ఉద్యమం చేయాలని తీర్మానం చేసిండ్రు. దీనికి ఆంధ్ర ప్రాంతానికి చెందిన ప్రకాశం, సాంబమూర్తి,

కోటిరెడ్డి, తిమ్మారెడ్డిలు కూడా హాజరయ్యారు. వీరంతా విశాలాంధ్ర ఏర్పడలానే డిమాండ్‌తో ముందుకొచ్చారు. 1953 ఆగస్టు రెండో తేదిన అయ్యదేవర కాళేశ్వరరావు హైద్రాబాద్‌లోని ప్రతాప్ గిర్జీ కోఠీలో మరో సమావేశం నిర్వహించిండు. ఇందులో విశాలాంధ్రకు మద్దతు కూడగట్టడానికి ప్రయత్నాలు సాగాయి. ఈ మహాసభలో మరోసారి అయ్యదేవర అధ్యక్షుడిగా ఎన్నికయ్యిండు. అలాగే కడప కోటిరెడ్డి ఉపాధ్యక్షులుగా, పాగా పుల్లారెడ్డి, ఎస్.ఆర్. వెంకటేశంలు కార్యదర్శులుగా ఎన్నికయ్యారు. విశాలాంధ్ర మహాసభ సభ్యులు గుంటూరు, కర్నూలు, విజయవాడలో పర్యటించి తమ లక్ష్యాలను ప్రచారం చేసింద్రు. తమ ఉద్యమానికి ఊతమివ్వాలని ప్రజలకు విజ్ఞప్తి చేసింద్రు.

ఈ ఉద్యమ ప్రచారం ఒకవైపు జరుగుతుండగానే మరోవైపు విశాలాంధ్ర వ్యతిరేకులు తమ గళం విప్పింద్రు. విశాలాంధ్ర మహాసభ తరపున వివిధ ప్రదేశాల్లో పర్యటించి సికింద్రాబాద్ చేరుకున్న పాగా పుల్లారెడ్డి, మీర్ అహమ్మద్ అలీఖాన్, వి.బి. రాజులకు వ్యతిరేకంగా ఆగస్టు 11, 1954 న పెద్ద ఎత్తున నిరసన ప్రదర్శన జరిగింది. తెలంగాణ వాదులంతా నల్లజెండాలతో నిరసన వ్యక్తం జేస్తూ 'విశాలాంధ్ర ముర్దాబాద్, తెలంగాణ జిందాబాద్' అంటూ నినాదాలిచ్చారు. అప్పటి వరకు బహిరంగంగా అంతగా మద్ధతు కూడగట్టలేకపోయిన తెలంగాణ వాదులకు ఈ సంఘటన మంచి ప్రోత్సాహాన్ని ఇచ్చింది. హైదరాబాద్ రాష్ట్రాన్ని విడగొట్టాలనే ప్రతిపాదనను మొదట అప్పటి ముఖ్యమంత్రి బూర్గుల రామకృష్ణా పూర్తిగా వ్యతిరేకించాడు. అయితే మొదట్లో విశాలాంధ్ర భావనకు అనుకూలంగా ఉన్న కొండా వెంకటరంగారెడ్డి తర్వాతి కాలంలో పూర్తిగా ప్రత్యేక తెలంగాణ వాదిగా మారిండు. విచిత్ర మేమిటంటే మొదట విశాలాంధ్రకు వ్యతిరేకంగా నిలబడ్డ బూర్గుల రామకృష్ణారావు అదే బిల్లును అసెంబ్లీలో పెట్టి ఆమోదింపజేసుకుండు. అలాగే ఆరంభంలో విశాలాంధ్రాభిమానిగా ఉన్న కొండా వెంకటరంగారెడ్డి తర్వాతి కాలంలో దానికి వ్యతిరేక వర్గానికి నాయకుడయ్యాడు. 1953 జూలైలో విశాలాంధ్ర వాదిగా ఉన్న రంగారెడ్డి 1954 జనవరి నాటికి హైదరాబాద్ రాష్ట్ర పిసిసికి అధ్యక్షుడిగా ఎన్నికయ్యాడు. ఈ పదవికి ఎన్నికైన మొట్టమొదటి తెలుగువాడు ఆయనే. అంతకు ముందు వరకూ అంతా మహారాష్ట్రియన్లు, కన్నడిగులే ఈ పదవిని చేపట్టారు. ఈ సమయంలో బూర్గుల రామకృష్ణారావు, రంగారెడ్డి, చెన్నారెడ్డి మంత్రివర్గ సహచరులందరూ విశాలాంధ్రకు వ్యతిరేకంగా ఏకమయ్యారు. రంగారెడ్డి ఏర్పాటు చేసిన హైదరాబాద్ పిసిసి కార్యవర్గం అంతకు ముందటి పిసిసి కార్యవర్గం చేసిన నిర్ణయాలను వ్యతిరేకించింది. అంతకు ముందటి కార్యవర్గం హైదరాబాద్ రాష్ట్రాన్ని విడగొట్టి మూడు రాష్ట్రాలుగా విభజించి, తెలంగాణ ప్రాంతాన్ని ఆంధ్రప్రాంతంతో కలుపాలని



తీర్మానం చేసింది. అయితే రంగారెడ్డి చేతిలో ఓడిపోయిన బొమ్మకంటి సత్యనారాయణ, ఆయన వర్గం మంత్రి పదవి, పిసిసి అధ్యక్షుడిగా ఒక్కరే రెండు పదవులు నిర్వహించడం కాంగ్రెస్ పార్టీ తీర్మానాలకు విరుద్ధమైనవిగా ప్రకటిస్తూ రెండింటిలో ఏదో ఒక పదవికి రాజీనామా చేయాలని డిమాండ్ చేసింద్రు. దీంతో పిసిసి అధ్యక్ష పదవికి రాజీనామా చేసిన రంగారెడ్డి ఆ స్థానంలో తన మద్ధతుదారు, ఆదిలాబాద్ జిల్లాకు చెందిన వెలమ నాయకుడు జె.వి. నర్సింగరావుని 1955 జూన్‌లో గెలిపించుకున్నాడు. ఈయన ప్రత్యేక తెలంగాణ వాది. కార్యదర్శిగా మట్టి చెన్నారెడ్డి ఎన్నికయ్యారు.

1954 జనవరి 17న హైదరాబాద్ స్టేటు కాంగ్రెసుకు జరిగిన ఎన్నికల్లో కొండా వెంకటరంగారెడ్డి విశాలాంధ్రవాది అయిన బొమ్మకంటి సత్యనారాయణపై విజయం సాధించిండు. దీంతో బొమ్మకంటి సత్యనారాయణ ఫజల్ అలీ కమిటీ వరంగల్ పర్యటించినపుడు వి.బి. రాజు, పి.వి. నర్సింహారావులతో కలిసి విశాలాంధ్ర డిమాండ్ చేస్తూ మెమోరాండం ఇచ్చారు. అంటే కాంగ్రెస్ అంతర్గత రాజకీయ విభేదాలు కూడా అంతిమంగా ప్రత్యేక తెలంగాణకు గండికొట్టాయి. 1955 అక్టోబరు ఆరో తేదిన అయ్యదేవర కాళేశ్వరరావు హైద్రాబాదు రాగా ఆయన సమక్షంలో బొమ్మకంటి సత్యనారాయణ అధ్యక్షతన తెలంగాణ ఎమ్మెల్యేల సమావేశం జరిగింది. ఈ సమావేశంలో తీసుకున్న నిర్ణయానుసారం అక్టోబరు 19వ తేదీన 47 మంది ఎమ్మెల్యేలు బూర్గుల రామకృష్ణారావుపై వత్తిడి తీసుకువచ్చింద్రు. బూర్గుల అధికార నివాసం 'షామంజిల్' లో విశాలాంధ్ర కోసం ధర్నా కూడా నిర్వహించారు. 1955 అక్టోబరు 22న ఢిల్లీలో ముఖ్యమంత్రుల సమావేశం జరిగింది. బూర్గుల ఢిల్లీకి బయలుదేరి వెళ్లేకన్నా ముందు విశాలాంధ్ర, తెలంగాణ వాదులు కలిసి తమ పక్షాన ఢిల్లీలో వాణిని వినిపించ వలసిందిగా విజ్ఞప్తి చేసింద్రు. విశాలాంధ్ర మహాసభ కార్యకర్తలు అంతకు ముందే అంటే 17 అక్టోబరు, 1955 దసరా రోజున బూర్గులను కలిసి విశాలాంధ్ర పక్షాన తమ అభిప్రాయాలను అధిష్టానానికి చేరవేయవలసిందిగా కోరారు. అప్పుడు బూర్గుల మాట్లాడుతూ హోంమంత్రి గోవింద్ వల్లభ్ పంత్‌తో చర్చించిన తర్వాత తుది నిర్ణయం తీసుకుంటానని చెప్పిండు. చెప్పినట్టుగానే హోం మంత్రితో సమావేశం తర్వాత బూర్గుల విశాలాంధ్ర వాదిగా మారిండు. ముఖ్యమంత్రుల సమావేశం నుంచి తిరిగి వచ్చిన కొన్ని రోజులకు అక్టోబరు 28వ తేదీనాడు విశాలాంధ్రకు అనుకూలంగా సుదీర్ఘమైన ప్రకటన చేసిండు. ఫజల్ అలీ కమిటీ సూచించిన విధంగా తెలంగాణను ఐదేండ్లు ప్రత్యేకంగా ఉంచినట్లయితే అనేక సమస్యలొస్తాయని చెప్పిండు. ఈ

ఐదేండ్లు విశాలాంధ్ర-తెలంగాణ జగడము ప్రతి రోజూ జరుగుతుందనీ, అది ఎన్నికల సమస్యగా కూడా మారుతుందనే యోచనతో తక్షణమే విశాలాంధ్ర ఏర్పాటు చేయాలని బూర్గుల పిలుపునిచ్చారు. బూర్గుల నిర్ణయాన్ని వ్యతిరేకించిన కొండా వెంకటరంగారెడ్డి తమ నిరసన వ్యక్తం చేసిండు. స్వయంగా ముఖ్యమంత్రిని కలిసి నిలదీయడంతో వారిద్దరి మధ్యన గొడవ చోటు చేసుకుంది. తీవ్ర వాగ్వాదం చెలరేగింది. బూర్గుల రామకృష్ణారావు పత్రికా విలేకరుల సమావేశం ఏర్పాటు చేసి తాను విశాలాంధ్రకు మద్ధతిస్తున్న విషయాన్ని ప్రకటించిండు. ఇది విశాలాంధ్ర ఉద్యమానికి ఊపిరి పోసింది. ప్రత్యేక తెలంగాణ కోసం కంకణబద్ధుడైన కొండా వెంకటరంగారెడ్డి వర్గం తన వాణిని ఢిల్లీలో కూడా వినిపించింది. హైద్రాబాద్‌లో 1955 అక్టోబరు 31న తెలంగాణ కాంగ్రెసు డెలిగేట్ల సమావేశం జరిగింది. ఈ సమావేశంలో యాభై మంది డెలిగేట్లు ప్రత్యేక తెలంగాణను సమర్థించగా బూర్గులతో సహా 17 మంది విశాలాంధ్ర వాదాన్ని వినిపించారు. 1955 నవంబరు ఆరున ఢిల్లీలో జరిగిన అఖిలభారత ప్రదేశ్ కాంగ్రెస్ అధ్యక్షుల సమావేశంలో తెలంగాణ కాంగ్రెసు అధ్యక్షుడిగా ఉన్న జె.వి. నర్సింగరావు ప్రత్యేక తెలంగాణ డిమాండ్‌ని బలంగా వినిపించాడు. ఎఐసిసి ప్రెసిడెంట్ యు.ఎన్.దేబర్, ఇతర కాంగ్రెస్ పెద్దల్ని కలుసుకొని తెలంగాణ ప్రజలు ప్రత్యేక రాష్ట్రాన్ని కోరుకుంటున్నారు, తెలంగాణలోని అన్ని జిల్లా కాంగ్రెస్ కమిటీలు, హైదరాబాద్ నగర కార్పోరేషన్, కాంగ్రెసుకు అనుబంధంగా ఉన్న జాతీయ విద్యార్థి సంఘం, వర్తక సంఘాలు, గ్రామపంచాయితీలు, రైతు సంఘాలు ఇంకా చాలా సంఘాలు ప్రత్యేక తెలంగాణను కోరుకుంటున్నాయని వారికి వివరించాడు. ఇదే విషయాన్ని తిరుగు ప్రయాణంలో నవంబరు 11వ తేదీన బొంబాయిలో కూడా పునరుద్ఘాటించారు.

ఆంధ్ర, తెలంగాణ కాంగ్రెసు నాయకుల్లో భిన్నాభిప్రాయాలు వెల్లువెత్తుతుండడంతో కాంగ్రెస్ హైకమాండ్ 1955 నవంబరు 16 న ఢిల్లీలో ఇరు ప్రాంతాల నేతలతో ఒక సమావేశాన్ని ఏర్పాటు చేసింది. తెలంగాణ నుంచి ప్రదేశ్ కాంగ్రెస్ కమిటీ అధ్యక్షుడు జె.వి. నరసింగరావు, కొండా వెంకటరంగారెడ్డిలు, ఆంధ్ర నుంచి అల్లూరి సత్యనారాయణ రాజులు పాల్గొన్నారు. ఈ సమావేశంలో కొండా వెంకటరంగారెడ్డి మాట్లాడుతూ తెలంగాణలో నూటికి 95 మంది ప్రత్యేక తెలంగాణ కోరుకుంటున్నారు. ఈ దశలో వారి ఆకాంక్షలకు విరుద్ధంగా వ్యవహరించినట్లయితే ప్రజలు తిరుగబడుతారని హెచ్చరించిండు. ప్రజాభిప్రాయాన్ని గౌరవించాల్సిన బాధ్యత కాంగ్రెసుపై ఉందని నరసింగరావు చెప్పిండు. దీనికి అల్లూరి



సత్యనారాయణరాజు జోక్యం చేసుకుంటూ తెలంగాణలో నూటికి నూరు శాతం అభివృద్ధి ఉంటుందని దాంట్లో ఎలాంటి సందేహం ఉండాల్సిన అవసరం లేదన్నారు. కాంగ్రెస్ హైకమాండ్ నిర్దేశించినట్లుగా, అవసరమైతే వారే రూపొందించిన పథకాల పట్ల ఆంధ్రులకెవ్వరికీ అభ్యంతరం ఉండబోదని హామీ ఇచ్చాడు. దీనికి దేబర్ వత్తాసు పలుకుతూ తెలంగాణ ప్రజలకు అన్యాయం జరుగకుండా చూసే బాధ్యత కేంద్రం తీసుకుంటుందని చెప్పిండు. దీనికి తెలంగాణ నాయకులు "గతంలో శ్రీబాగ్ ఒడంబడిక ఎలా అమలయిందో మాకు తెలుసు, మేం మోసపోవడానికి సిద్ధంగా లేము. మేము విశాలాంధ్రకు వ్యతిరేకం. మా మానాన మమ్మల్ని బతకనీయండి. వారు ప్రకటించే రక్షణల పట్ల ఆసక్తిగాని, నమ్మకం గానీ లేవని" జె.వి. నరసింగరావు హైకమాండ్‌కు కుండబద్దలు కొట్టినట్లు చెప్పిండు. ఒక వేళ హైదరాబాద్ రాజధానిగా విశాలాంధ్ర ఏర్పడితే శ్రీబాగ్ ఒడంబడికను ఉల్లంఘించినట్లవుతుందని చెప్పిండు. ఈ విషయమై చర్చలు విస్తృతంగా జరిగాయి. అనంతరం ఢిల్లీలో నరసింగరావు ఒక ప్రకటన చేస్తూ "ఈ విషయాన్ని నేను కాంగ్రెస్ అధిష్టాన వర్గానికి స్పష్టంగా చెప్పాను. ప్రస్తుత శాసన సభ్యులు విశాలాంధ్రపై పోటి చేసి గెలిచిన వారు కారు. అంతేకాక ప్రత్యేక పరిస్థితులలో కమ్యూనిస్టులు శాసనసభకు ఎక్కువ సంఖ్యలో ఎన్నికయ్యారు" అన్నారు. దీంతో ఖంగుతిన్న అధిష్టానం కూడా తెలంగాణ ప్రజలు అంగీకరిస్తేనే విశాలాంధ్ర ఏర్పడుతుందని కాంగ్రెస్ కార్యవర్గం ఒక తీర్మానాన్ని చేసింది.

ఫజల్ అలీ ఇచ్చిన రిపోర్టుకు పూర్తిగా కట్టుబడి ఉన్నామని వారు చెప్పిన విధంగానే తెలంగాణ ప్రజలు ఒప్పుకునే వరకు విశాలాంధ్ర ఏర్పాటు చేసేది లేదని కాంగ్రెసు అగ్ర నాయకులు వివిధ సందర్భాల్లో హైదరాబాద్‌లో కూడా వెల్లడించారు. నెహ్రూ, గోవింద వల్లభ్ పంత్, అఖిలభారత కాంగ్రెస్ అధ్యక్షుడు ధేబర్‌లు హైద్రాబాదుకు వచ్చిన ప్రతి సందర్భంలో తెలంగాణ ప్రజలు సమ్మతించే వరకు విశాలాంధ్రను ఏర్పాటు చేయబోమని బహిరంగంగా ప్రకటించారు. దీంతో ప్రత్యేక తెలంగాణ వాదులు తమ వాదాన్ని బహిరంగంగా వినిపించసాగారు. అయితే 1955 నవంబరులో జరిగిన కాంగ్రెసు వర్కింగ్ కమిటీ విశాలాంధ్రకు సహకరించాలని తెలంగాణ ప్రజలకు సలహా ఇచ్చింది. అంటే తెలంగాణ విషయంలో కాంగ్రెసు ఈ ప్రాంతానికి చెందిన పార్టీ అభిప్రాయానికి గానీ నాయకుల అభిప్రాయానికి గానీ కట్టుబడి లేదనే విషయం తెలుస్తుంది. ఈ పరిణామం తెలంగాణ కాంగ్రెస్ వాదుల్ని దిగ్భ్రాంతికి గురి చేసింది.

ఢిల్లీ పరిణామాలను దృష్టిలో ఉంచుకొని ఆంధ్ర ముఖ్యమంత్రి బెజవాడ గోపాలరెడ్డి, డిప్యూటి ముఖ్యమంత్రి నీలం సంజీవరెడ్డి, ప్లానింగ్ మంత్రి కళా వెంకటరావు, సహకార మంత్రి సంజీవయ్య, ఆంధ్ర కాంగ్రెసు అధ్యక్షులు అల్లూరి సత్యనారాయణ రాజులు హైదరాబాద్

వచ్చి తెలంగాణ నాయకులతో విశాలాంధ్ర ఏర్పాటుపై సంప్రదింపులు ప్రారంభించింద్రు. గాంధీభవన్‌లో జరిగిన ఈ సమావేశంలో తెలంగాణ తరపున బూర్గుల రామకృష్ణారావు, కొండా వెంకటరంగారెడ్డి, జె.వి. నరసింగరావు, మఱ్ఱి చెన్నారెడ్డిలు పాల్గొన్నారు. తెలంగాణ తరపున పాల్గొన్న వారిలో బూర్గుల ఒక్కరే విశాలాంధ్రకు అనుకూలంగా మాట్లాడారు. ఈ సమావేశంలో ఎలాంటి నిర్ణయానికి రాలేకపోవడంతో తదుపరి కర్నూలులో నవంబరు 23 (1955)న మరోసారి సమావేశం కావాలని నిర్ణయించారు. అయితే దీనివల్ల తెలంగాణకు ఒరిగేదేమి లేదని భావించిన తెలంగాణ నాయకులు కర్నూలుకు వెళ్లలేదు.

**నవంబరు 22, 1955** నాడు హైదరాబాద్ అసెంబ్లీలో బూర్గుల రామకృష్ణారావు ఆంధ్ర, హైదరాబాదు ఏకీకరణ కావాలని తీర్మానం ప్రతిపాదించిండు. ఈ తీర్మానాంపై ఓటింగ్ జరుగకుండానే సమావేశం వాయిదా పడింది. ఈ సమయంలో హైద్రాబాదులోని ఉర్దూహాల్ ప్రారంభోత్సవంలో పాల్గొన్న నెహ్రూ తాను హైద్రాబాదు విభజనకు వ్యతిరేకినని స్పష్టంగా చెప్పిండు. అయితే అన్ని రాజకీయ పక్షాలు కోరినందున తన వ్యక్తిగత అభిప్రాయమేదైనప్పటికీ హైద్రాబాదు విభజనకు అంగీకరించాల్సి వచ్చిందని చెప్పిండు. నర్మగర్భంగా ఆంధ్ర వత్తిళ్లకు తలొగ్గిన విషయాన్ని అంగీకరించిండు. నాగార్జున సాగర్ ప్రాజెక్టు ప్రారంభించేందుకు హైదరాబాద్‌కు చేరుకున్న నెహ్రూకు ప్రతి చోటా ప్లకార్డ్స్, బ్యానర్లు, ర్యాలీలతో నిరసన వ్యక్తం చేస్తూ ప్రజలు ప్రత్యేక తెలంగాణ కోసం పట్టుబట్టారు. ప్రజా నిరసనకు తలొగ్గిన నెహ్రూ ఢిల్లీ వెళ్లిన వెంటనే బొంబాయి ప్రదేశ్ కాంగ్రెస్ కమిటీ అధ్యక్షుడు యస్.కె. పాటిల్, ఎఐసిసి ఆఫీసు సెక్రెటరీలను ప్రజాభిప్రాయం కనుక్కునేందుకు తెలంగాణకు పంపించారు. వారు తెలంగాణలో పర్యటించి ప్రజాభిప్రాయం ప్రత్యేక తెలంగాణకు అనుకూలంగా ఉందని తేల్చి చెప్పింద్రు. ప్రజాభిప్రాయంపై ఎలాంటి గౌరవం లేని కాంగ్రెసు నాయకులు ఢిల్లీలో తెలంగాణ నాయకులను ఒప్పించడమే పరమావధిగా పెట్టుకొని రక్షణలు పేరిట కొన్ని సేఫ్‌గార్డ్స్ ప్రకటించి తెలంగాణ నాయకులు విశాలాంధ్రకు అంగీకరించాలని వత్తిడి తీసుకు వచ్చారు. దీనికి తెలంగాణ నాయకులు గత్యంతరం లేని పరిస్థితుల్లో అంగీకారం తెలిపింద్రు. (అయినప్పటికీ ఆ సేఫ్ గార్డ్స్ ని నిజమైన స్ఫూర్తితో అమలు చేయకుండా ఆంధ్ర పాలకులు విజయవంతంగా అడ్డుకోగలిగారు.) ఈ ఒప్పందం ప్రకారం హైద్రాబాదులోని అందరు వకీల్లకు ఆంగ్లము రాదు కాబట్టి ఇప్పుడున్నట్టుగానే ఆంధ్ర హైకోర్టు గుంటూరులో, తెలంగాణ హైకోర్టు హైద్రాబాదులో ఉండాలని ఒప్పందం ఖరారు చేసుకుంద్రు. అయితే దాని తడి ఆరక ముందే



ఉల్లంఘించిన ఘనత ఆంధ్ర పాలకులది. ఆంధ్ర హైకోర్టు చీఫ్ జస్టిస్‌గా ఉన్న కోకా సుబ్బారావు ఒక రాష్ట్రానికి రెండు హైకోర్టులు ఉంటే గౌరవప్రదం కాదనీ, రెండూ కలిపి ఒక్కటి చేయాలని వత్తిడి తీసుకొచ్చిండు. ఆంగ్లము రాని అడ్వకేట్ల కోసం ఉర్దూ తెలిసిన జడ్జిలతో బెంచీలు ఏర్పాటు చేస్తే సరిపోతుందని ఒక రాజీ ఫార్ములాని తయారు చేసింద్రు. (దీని వల్ల తెలంగాణ వారికి దక్కాల్సిన ఉన్నత స్థాయి పదవులు దక్కకుండా పోయాయి. ఆనాటి నుంచి ఈనాటి వరకు ఇది కొనసాగుతూనే ఉంది. అందుకు అడ్వకేట్ జనరల్ పదవి దక్కక పోవడం ఒక చిన్న ఉదాహరణ మాత్రమే). ఆంధ్ర నాయకులు, మేధావులు ఒకవైపు తెలంగాణ ప్రజలకు భద్రత పేరిట వివిధ రకాల భ్రమలు కల్పిస్తూ మరోవైపు తెలివిగా లాబీయింగ్ చేసింద్రు. అందులో భాగంగా ఢిల్లీలో అందర్నీ కలుసుకున్నారు. విశాలాంధ్ర వాదులు 1955 నవంబరు నాలుగో తేదీన ఢిల్లీలో నెహ్రూని కలిసి విశాలాంధ్ర డిమాండ్ చేస్తూ విజ్ఞాపన ఇచ్చారు. నెహ్రూని కలిసిన ప్రతినిధి బృందంలో పాగా పుల్లారెడ్డి, బొమ్మకంటి సత్యనారాయణ, వి.బి. రాజు, జె.బి. ముత్యాలరావు, బి.వి. గురుమూర్తి, రంగపాడు తదితరులున్నారు. వీరు ఢిల్లీలో నెహ్రూతో పాటుగా సర్వేపల్లి రాధాకృష్ణన్, గోవింద్ వల్లభ్ పంత్, మౌలానా అజాద్, ఢేబర్ తదితరులను కలిసి విశాలాంధ్ర డిమాండ్ ముందుంచారు. అంటే లాబీయింగ్ ద్వారా అయ్యదేవర కాళేశ్వరరావు, నీలం సంజీవరెడ్డి, అల్లూరి సత్యనారాయణ రాజులు తెలంగాణవాదులను విశాలాంధ్ర వాదులుగా మార్చిన తీరు అర్థం చేసుకోవాలి. టంగుటూరి ప్రకాశం పంతులు, తెన్నేటి విశ్వనాథంలు కూడా విశాలాంధ్ర ఏర్పాటు కోసం తెర వెనుక రాజకీయాలు నడిపించారు. మరోవైపు కమ్యూనిస్టుల తరపున రావి నారాయణరెడ్డి ఢిల్లీలో ప్రధాని ఇతర నాయకుల్ని కలిసి విశాలాంధ్రకు అనుకూలంగా నిర్ణయం తీసుకోవాలని వత్తిడి తీసుకొచ్చారు. అలాగే పుచ్చలపల్లి సుందరయ్య, చంద్ర రాజేశ్వరరావు తదితరులు ఢిల్లీలో విశాలాంధ్ర కోసం ప్రచారం చేసింద్రు.

1953 జనవరిలో హైదరాబాద్‌లోని నానల్ నగర్ (కాంగ్రెస్ నేత గోవింద్ రాజు నానల్ పేరిట ఏర్పాటైన నగరం)లో సమావేశమైన అఖిలభారత కాంగ్రెస్ కమిటీలో భాష ఆధారంగా రాష్ట్రాల ఏర్పాటుపై భిన్నాభిప్రాయాలు వెలువడ్డాయి. నెహ్రూ జోక్యం చేసుకొని భాషా ప్రయుక్త రాష్ట్రాలకు సూత్రబద్ధంగా అంగీకారం తెలిపిండు. హైదరాబాద్ రాష్ట్ర విభజన కూడా జరుగుతుందని చెప్పిండు. అయితే అప్పటికే ఆంధ్ర రాష్ట్ర ఏర్పాటును ప్రకటించడంతో మిగతా రాష్ట్రాలకు సంబంధించిన నిర్ణయం వాయిదా పడింది. ఆంధ్ర రాష్ట్రం 1953 అక్టోబర్‌లో

ఏర్పాటు కావడంతో ఈ రాష్ట్ర పురోగతిని ఒక ఏడాది తర్వాత అధ్యయనం చేసి వాటి ఆధారంగా కొత్త రాష్ట్రాలివ్వాలని తాజాగా కాంగ్రెసు నిర్ణయం తీసుకుంది. అంతకు ముందు ప్రత్యేక కర్నాటక రాష్ట్రాన్ని కోరుతూ శంకర గౌడ పాటిల్ 22 రోజులు నిరాహార దీక్ష చేసి ఏప్రిల్ 1953లో విరమించుకున్నాడు. అక్కడి ప్రజల ప్రత్యేక రాష్ట్ర డిమాండ్‌కు ఇది ఉదాహరణ. తర్వాత కర్నాటక అసెంబ్లీకి జరిగిన హుబ్లీ, ధార్వాడ్ ఉప ఎన్నికల్లో కాంగ్రెస్ ఓటమి చెంది సంయుక్త కర్నాటక పార్టీ విజయం సాధించడంతో కాంగ్రెసు పునరాలోచనలో పడింది. ఒకవైపు ఆంధ్ర ప్రాంత నాయకుల విశాలాంధ్ర డిమాండ్, మరోవైపు (బహుశా) సాయుధ పోరాట విరమణ చేసిన కమ్యూనిస్టులకు నజరానాగా విశాలాంధ్ర ఇచ్చే ఉద్దేశం అన్నీ కలగలిశాయి. వీటన్నింటి పర్యవసానంగా రాష్ట్రాల పునర్విభజన కమిటీ ఏర్పాటయింది.

ఈ తరుణంలో పర్యవసానంగా రాష్ట్రం భాషా పరంగా విడిపోయినా తెలంగాణ స్వతంత్రంగానే ఉండాలనే డిమాండ్‌తో రామ్మూర్తి నాయుడు పెద్ద ఎత్తున ఉద్యమం చేపట్టాడు. అంతకు ముందు 1946-50ల కాలంలో విద్యార్థి నాయకుడిగా ఆయన వివిధ ఉద్యమాలు నిర్వహించి ప్రజల మన్ననలందుకున్నాడు. దీనితో బాటుగా సోషలిస్టు నాయకుడు మహాదేవ్ సింగ్ తన మనసు మార్చుకొని ప్రత్యేక తెలంగాణకు మద్ధతుగా నిలిచాడు. హైదరాబాద్ రాజ్యంలో సోషలిస్టులు విద్యార్థి ఉద్యమాల ద్వారా ప్రభుత్వాన్ని గడగడలాడించారు. దీంట్లో అమిద్యాల శ్రీరాములు ముందున్నాడు. బి.ఎస్. మహదేవ్ సింగ్ నేతృత్వంలో హైదరాబాద్, సికింద్రాబాదులోని కార్మిక సంఘాలు ప్రజా ఉద్యమాన్ని ముందుకు తీసుకెళ్లాయి. 1952 డిసెంబరు 30వ తేదిన జరిగిన రాష్ట్ర కార్యవర్గ సమావేశంలో విశాలాంధ్రకు మద్ధతు పలికిన సోషలిస్టు పార్టి 1953 నాటికి తమ అభిప్రాయాన్ని మార్చుకొని ప్రత్యేక తెలంగాణ వాదానికి అండగా నిలిచింది. 1953 డిసెంబరు 19-20 తేదీల్లో వరంగల్లులో జరిగిన ప్రజాసోషలిస్టు పార్టీ కార్యవర్గ సమావేశంలో హైదరాబాదు రాష్ట్ర విభజన, ప్రత్యేక తెలంగాణ స్థాపన కోరుతూ వై.ఎస్.రావు ఒక తీర్మానాన్ని ప్రతిపాదించాడు. దీనికి బి.ఎస్. మహదేవ్ సింగ్, ఎల్. నారాయణ, ఎం. రామిరెడ్డి, ఎం.కె.వి. రమణయ్య, జె.ఆర్. గోపాలరావు తదితరులు మద్ధతుగా నిలిచారు. అలాగే విశాలాంధ్ర తీర్మానానికి చుండి జగన్నాథం, జి.వి. సుధాకరరావు తగితరులు అనుకూలంగా మాట్లాడారు. ఈ సమావేశం కచ్చితమైన నిర్ణయానికి రాకుండానే వాయిదా పడింది. చివరికి ఈ రెండు పక్షాలు సూత్రప్రాయంగా ఒక అంగీకారానికి వచ్చాయి. దీని ప్రకారం రాజధాని, హైకోర్టు హైదరాబాదులో ఉండాలనీ, జనాభా ప్రాతిపదికన ఉద్యోగాల



రిజర్వేషన్లు ఉండాలని షరతులతో కూడిన ఒక అంగీకారాన్ని తెలిపారు. అయితే ఇది కూడా చాలా మంది సోషలిస్టులకు మింగుడుపడలేదు. దీంతో ఫజల్ అలీ కమీషనుకు హైద్రాబాదు స్టేట్ మజ్దూర్ సంఘ్ తరపున బి.ఎస్. మహదేవ్ సింగ్ ప్రత్యేక తెలంగాణని డిమాండ్ చేస్తూ విజ్ఞాపన పత్రాన్ని సమర్పించారు. సికింద్రాబాదు మున్సిపల్ పక్షాన ఫజల్ అలీ కమీషన్‌కు మెమోరాండాన్ని ఇవ్వడాన్ని తప్పు పట్టిన సోషలిస్టు కార్పోరేటర్లు ఎస్.బి. గిరి, జె. వెంకటేశం మరో నలుగురు ప్రత్యేక తెలంగాణ కోరుతూ విడిగా వినతి పత్రం ఇచ్చారు. సోషలిస్టుల్లో ప్రత్యేక రాష్ట్రం విషయమై తీవ్ర వాదోపవాదాలు జరిగాయి. చివరికి సభ్యులు తమ ఇష్టం వచ్చిన రీతిలో వ్యవహరించవచ్చునే నిర్ణయానికొచ్చారు.

సుప్రసిద్ధ జర్నలిస్టు బి.ఎన్. శర్మ లాంటి వారు రెండు తెలుగు రాష్ట్రాలు ఎందుకో సహేతుంగా వివరిస్తూ పుస్తకాలు వెలువరించారు. ఈయన తెలంగాణ వాడయినప్పటికీ విజయవాడ నుంచి 1937 ఆ ప్రాంతంలోనే 'ఆంధ్రవాణి' అనే పత్రికను నడిపించాడు. తరువాతి కాలంలో హైద్రాబాదు వచ్చి ఈ పుస్తకాన్ని ప్రచురించాడు. అలాగే దక్షిణ భారత హిందీ ప్రచార సభ అధ్యక్షుడు ఎం. సత్యనారాయణ కూడా రెండు తెలుగు రాష్ట్రాలు ఉండి తీరాల్సిందేనని డిమాండ్ చేసిండు. ఇలా ఒక వైపు ప్రత్యేక తెలంగాణ ఉద్యమం, ముల్కీ ఉద్యమం కలగలిసి ప్రజల్లో చైతన్నాన్ని కలుగజేస్తున్న తరుణంలో 1955 అక్టోబర్‌లో ఢిల్లీలో ముఖ్యమంత్రుల సదస్సులో పాల్గొన్న బూర్గుల రామకృష్ణారావు అప్పటి వరకు తాను అనుసరిస్తూ, వెల్లడిస్తూ వస్తున్న ప్రత్యేక తెలంగాణ వాదాన్ని కాదని విశాలంధ్రకు మద్ధతు పలికాడు. దీంతో అప్పటి వరకు బూర్గుల అనుచరులుగా ఉన్నవారు కూడా ఈ నిర్ణయాన్ని తప్పుపడుతూ పత్రికలకెక్కారు. ఈ సందర్భంగా కాంగ్రెసు నాయకుడు బి. నారాయణ పత్రికలకు ఒక లేఖను విడుదల చేసిండు. ప్రత్యేక తెలంగాణ రాష్ట్రానికి మద్దతుగా బూర్గుల రాసిన లేఖ అది. అలాగే ప్రజా సోషలిస్టు పార్టీ ఎమ్మెల్యే వెంకటేశం పత్రికల వారితో మాట్లాడుతూ బూర్గుల నిర్ణయాన్ని తీవ్రంగా విమర్శించారు. రెడ్డి కాంగ్రెస్ నాయకుల మద్ధతు లేకపోవడంతోనే బూర్గుల విశాలాంధ్రకు మద్దతివ్వడమే గాకుండా ఇకపై ఎన్నికల్లో పోటీ చేయబోనని ప్రకటించారని విమర్శించాడు. ఇంతా చేస్తే తెలంగాణలోని కాంగ్రెస్ వాదుల్లో 90 శాతం మంది ప్రత్యేక తెలంగాణకు అనుకూలంగా ఉన్నారని తేలింది. ఈ విషయమై చెన్నారెడ్డి ఒక మధ్యేమార్గాన్ని సూచిస్తూ ఏదైనా ఎంపిక చేసిన ఒక నియోజకవర్గంలో రెఫరెండం నిర్వహించి ప్రజలు విశాలాంధ్ర వైపా? ప్రత్యేక తెలంగాణ వైపా తేల్చుకోవచ్చని లేదంటే ప్రదేశ్ కాంగ్రెస్ అభిప్రాయమే

ప్రజాభిప్రాయంగా స్వీకరించాలని అదీ కుదరదంటే ప్రదేశ్ కాంగ్రెస్‌ని అన్ని విభాగాల నుంచి హైకమాండ్ అభిప్రాయ సేకరణ జరిపి నిర్ణయం తీసుకోవచ్చుని చెప్పింది. అయితే వీటిలో వేటినీ పట్టించుకోకుండా కాంగ్రెస్ హైకమాండ్ తెలంగాణ ప్రజల ఆకాంక్షలపై నీళ్లు కుమ్మరిస్తూ ఎస్సార్సీ నివేదిక సారాంశానికి వ్యతిరేకంగా ఆంధ్రప్రదేశ్ ఏర్పాటుకు అనుకూలంగా నిర్ణయం తీసుకుంది. దీన్ని ఆనాటి నుంచి ఈనాటి వరకు తెలంగాణ ప్రజలెవ్వరూ ఆమోదించలేదు.



# సెప్టెంబరు 17 - పరాయి పాలన

హైదరాబాద్‌పై పోలీసు చర్యగా పిలువబడుతున్న భారత సైన్య దండయాత్ర పర్యవసానాలను నిశితంగా పిరశీలించినట్లయితే తెలంగాణకు జరిగిన అన్యాయం తెలుస్తుంది. సెప్టెంబర్ 17ను పండుగగా కాకుండా పీడగా ఎందుకు చూడాల్సిన అవసరముందో అర్థమవుతుంది. ఈ పోలీసు చర్య కారణంగా స్థానిక పాలకుడు పోయి పరాయి పాలన ప్రారంభమయింది. స్థానికుల ఉద్యోగాలు పోయి ప్రాంతేతరులకు ఉద్యోగాలు దక్కాయి. సాయుధ రైతాంగ పోరాటం ద్వారా దక్కించుకున్న భూములపై రైతులు, కూలీలు హక్కు కోల్పోయారు. ఈ పర్యవసానాలే ఆనాటి నుంచి ఈనాటి వరకూ తెలంగాణకు పీడగా తయారై పరాయి పాలనకు పునాది రాళ్లయినాయి. హైదరాబాద్ రాజ్యంలో పెట్రేగిపోతున్న రజాకార్లను అణచివేసేందుకు 'పోలీసు చర్య' పేరిట భారత సైన్యాల దాడి జరిగింది. ఇది అధికారిక వాదన. అయితే ఈ పోలీసు చర్యకు కారకుడైన భారత ఉపప్రధాని సర్దార్ వల్లభబాయి పటేల్ ఫిబ్రవరి 27, 1949 నాడు హైదరాబాద్‌లో జరిగిన బహిరంగ సభలో మాట్లాడుతూ కమ్యూనిస్టుల మూలంగా చైనా, బర్మా తగలబడుతున్నాయి. ఇక్కడ కూడా అదే పరిస్థితి దాపురించే అవకాశముంది. "కమ్యూనిస్టులంతా ప్రాంతేతరులే (హైదరాబాద్ రాజ్యానికి) వారు సమస్యను ఇంకా జటిలం చేయాలని జూస్తున్నారు. పట్టుబడ్డ కమ్యూనిస్టుల్లో చాలామంది బయటి వారే. నేనొక్కటి చెప్పదలచుకున్నాను. వారు ఎక్కడికైనా వెళ్లవచ్చు. అలా కాకుండా ఇక్కడే ఉండదలుచుకుంటే ఒక్కణ్ణి కూడా ప్రాణాలతో వదిలేది లేదు. ఎందుకంటే అది ఒక్క హైదరాబాద్ రాష్ట్రాన్నే కాదు మొత్తం దేశాన్నే విషపూరితం చేస్తుంది". (సెడ్ ద సర్దార్, హైదరాబాద్ స్టేట్ కాంగ్రెస్ ప్రచురణ, 1950) దీన్ని బట్టి భారత సేనలు హైదరాబాద్ రాజ్యంపై ఏ లక్ష్యంతో దండయాత్రకు దిగాయో చూచాయగా అర్థమవుతుంది. అధికారమంతా హైదరాబాద్‌పై దండయాత్ర చేసిన సైన్యాధినేత జె.ఎన్. చౌదరికి దక్కింది. దీన్నే మరో విధంగా చెప్పాలంటే 'రాచరిక' పాలన పోయి 'రాక్షస' పాలన ఆరంభమయిందని చెప్పవచ్చు. సైనికాధికారి జయంత్ నాథ్ చౌదరి ఆధ్వర్యంలో హైదరాబాద్‌లో

1948 సెప్టెంబర్ 18న మిలిటరీ పాలన ప్రారంభమయింది. చౌదరి, ఆయన అనుచరుడు సంజప్ప నేతృత్వంలో మిలిటరీ ప్రభుత్వం రెండు ముస్లింలను ఊచకోత కోసింది. చౌదరి తర్వాత డిసెంబర్ ఒకటి 1949న పౌర పాలనాధికారిగా ఎం.కె. వెల్లోడి నియమితులయ్యారు. ఆ తర్వాత భారత రాజ్యాంగం అమల్లోకి వచ్చిన నాటి నుంచి రాష్ట్ర గవర్నర్ (రాజ్ ప్రముఖ్)గా నిజాం అధికారికంగా నియమితులయ్యారు. చనిపోయేంత వరకు ఆ పదవి నీకే అని నెహ్రూ హామీ కూడా ఇచ్చారు. అయితే నిజామే 1956లో హైదరాబాద్ రాష్ట్రం ముక్కలైన తర్వాత గవర్నర్‌గా కొనసాగడానికి ఇష్టపడలేదు. ఇదీ చరిత్ర.

సాయుధ పోరాట వీరులు తాము దొరలు, భూస్వాములు, దేశ్‌ముఖ్‌లు, దేశపాండ్యాలు, జమిందార్ల నుంచి స్వాధీనం చేసుకున్న పది లక్షల ఎకరాలను మిలటరీ పోలీసులు దగ్గరుండి దొరలకప్పగించారు. ప్రజలు పోరాటం చేసి దక్కించుకున్న భూమిపై హక్కుని ఇవ్వకపోగా బిచ్చమెత్తి భూమిని అప్పగించామని కొందరు గొప్పలు చెప్పుకుంటుండ్రు. వినోభా భావే (చేపట్టిన) భూదానోద్యమం (1951 ఏప్రిల్) చేపట్టి మీరు పోరాడితే భూమి దక్కదు బిచ్చమెత్తితే భూమి దొరుకుతుందనే భావన వ్యాప్తిలోకి తెచ్చిండు. ప్రజలకు హక్కుగా రావాల్సిన వాటిని బిచ్చంగా అందుకోవడంలోనే ఏదో బానిస వాసన వస్తోంది. సాయుధ పోరాటంలో ప్రజలు పది లక్షల ఏకరాలు స్వాధీనంలోకి తెచ్చుకోగా భూదానం ద్వారా వినోభాభావే పది వేల ఎకరాలు సేకరించారు. వీటిని పంచడానికి 'భూదాన యజ్ఞసమితి' స్థాపించి తెలంగాణ ప్రజలకు సేవ చేస్తున్నామనే భావన కల్పించారు.

1950 జూన్‌లో సివిల్ ముఖ్యమంత్రి వెల్లోడి మంత్రి మండలిలో బూర్గుల రామకృష్ణారావు, జైన్ యార్‌జంగ్, వల్లూరి బసవరాజు (వి.బి. రాజు) లాంటి వారికి పదవులు దక్కాయి. వి.బి. రాజు తెలంగాణ వాడు కాకపోయినప్పటికీ తన చాణక్య నీతితో పదవి దక్కించుకున్నాడు. ఆ తర్వాత ప్రత్యేక తెలంగాణ ఉద్యమంలో ముందున్నాడు. అంతే వేగంగా సమైక్య రాష్ట్రనినాదాన్ని కూడా ఇచ్చాడు. రాష్ట్రేతరాంధ్రులు తెలంగాణ రాజకీయ రంగంలో రాణించడం ఆయనతోనే ఆరంభమయింది. ఇక ఆనాటి నుంచి ఆంధ్రవలస వాద పాలన నేటికి కొనసాగుతుంది.

## హైదరాబాద్‌పై దండయాత్రకు 60 యేండ్లు

ఇండియన్ యూనియన్ సైన్యాల దాడిలో హైదరాబాద్ రాజ్యం అస్తిత్వం కోల్పోయి అప్పుడే అరవై యేళ్ళయింది. ఉనికి కోల్పోయి, ప్రాంతం ఛిన్నాభిన్నమై, జీవ భాషను మరిచిపోయి, మిలిట్రీ చేతిలో ప్రాణాలు, సాయుధ పోరాట ఫలాలు కోల్పోయి, పరాయి రాష్ట్రాల నుంచి



పాలకులను, ఉద్యోగులను దిగుమతి చేసుకొని ఉన్నదంతా దోసుకున్న దండయాత్రకు అప్పుడే షష్టిపూర్తి అవుతోంది. హైదరాబాద్ రాజ్య ప్రజల ప్రమేయం లేకుండానే జరిగిన 'పోలీస్ యాక్షన్' పెద్దగా బలిదానాలు లేకుండానే బలవంతపు విలీనానికి దారులు వేసింది. ఈ విలీనానికి హైదరాబాద్ స్టేట్ కాంగ్రెస్‌లోని ఒక పక్షం, ఆర్య సమాజ్ వర్గాలు మాత్రమే బహిరంగ మద్ధతు పలికాయి. దాదాపు మిగతా అన్ని వర్గాలు 'పోలీస్ యాక్షన్' పట్ల నిర్లిప్తంగా, తమకు సంబంధం లేని అంశంగా భావించాయి. కొంతమంది ఈ చర్యను వ్యతిరేకించారు. రజాకార్లు మతోన్మాదంతో ఊగిపోతూ ఎర్రకోటపై అసఫ్‌జాహీ జెండా ఎగరవేస్తామని, యమునా నదిలో నిజాం పాదాలు కడుగతామని బీరాలు పలికిండ్రు. కమ్యూనిస్టులు పటేల్ చర్యను తీవ్రంగా ఖండించారు. ఇండియన్ మిలటరీతో కూడా సాయుధ పోరాటం జేసిండ్రు. నిజాం పోలీసుల చేతిలోకన్నా సివిల్ ముఖ్యమంత్రి వెల్లోడి భటుల చేతిలో ఎక్కువమంది వీరులు నిండు యవ్వనంలో నేలకొరిగారు. ప్రశ్నించడం నేర్చుకుంటున్న ఒక తరానికి తరమే తెరమరుగయింది.

చిన్న గ్రూపుగా ఉన్న సోషలిస్టులు అరుణా అసఫలీ, జయప్రకాశ్ నారాయణలను హైదరాబాద్‌కు పిలిపించి మహదేవ్ సింగ్ నేతృత్వాన బాధ్యతాయుత ప్రభుత్వాన్ని డిమాండ్ చేస్తూ ఉద్యమాలు చేసిండ్రు. ఇదే విషయాన్ని 1948 సెప్టెంబర్ 11న 'హైదరాబాద్ భావి కర్తవ్యం' అనే పుస్తకానికి రాసిన ముందుమాటలో జయప్రకాశ్ నారాయణ వెల్లడించారు. అలాగే మాల మాదిగలు తదితర నిమ్న కులాల వాళ్లు పోలీస్ యాక్షన్‌ని తీవ్రంగా వ్యతిరేకించారు.

నిజంగా తెలంగాణ విముక్తినే కమ్యూనిస్టులు కోరుకొని ఉంటే 'విశాలాంధ్ర' నినాదం ద్వారా హైదరాబాద్ రాష్ట్ర అస్తిత్వ విధ్వంసానికి దోహదం చేసేవారు కాదు. కనీసం విధ్వంసం జరిగిన తర్వాతైనా తెలంగాణకు బాసటగా నిలిచేవారు. కమ్యూనిస్టులు ఎప్పుడు ఎవరి కొమ్ము కాస్తారో ఆనాటి నుంచి 'పజిల్'గానే ఉంది. ఒకవైపు నెహ్రూ, పటేల్ చర్యల్ని విమర్శిస్తూనే, హైదరాబాద్ స్వతంత్ర రాజ్యంగా ఉండాలనీ డిమాండ్ చేసిండ్రు. నిజాం ప్రభుత్వంతో మంతనాలు జరిపిండ్రు. పటేల్ సైన్యం చేతిలో వేలాది మంది ప్రాణాలు కోల్పోతే అభ్యుదయ రచయితల సంఘానికి చెందిన కుందుర్తి తన 'తెలంగాణ' కావ్యాన్ని యూనియన్ మిలిటరీకి స్వాగతం పలుకుతూ ముగిస్తాడు. దాన్ని కమ్యూనిస్టు ప్రచురణ సంస్థలు పనిగట్టుకొని ప్రచారం చేస్తాయి. ఈ ధోరణికి ఇకనైనా తెరదించాలి. రాగద్వేషాలకు అతీతంగా, నిష్పక్షపాతంగా, నిర్మమకారంగా హైదరాబాద్ చరిత్రను అధ్యయనం చేస్తే ఒకే ఒరలో రెండు కత్తులు ఇమిడినట్టుగా కనిపిస్తుంది. పాకిస్తాన్‌తో యుద్ధం సందర్భంగా కొన్ని లక్షలమంది మతఘర్షణల్లో ప్రాణాలు కోల్పోయిండ్రు.

అదే హైదరాబాద్‌తో జరిగిన ఐదు రోజుల యుద్ధంలో ఎక్కడా మతఘర్షణలకు తావియ్యలేదనే విషయాన్ని గమనించాల.. కానీ ఇండియన్ యూనియన్ సైన్యం చేతిలో రెండు లక్షలమందికి పైగా ముస్లింలు ఊచకోతకు గురయ్యారని నెహ్రూ నియమించిన సుందర్‌లాల్ కమిటీ రిపోర్టు ద్వారా తెలుస్తుంది. అలాగే నిజామ్‌కు ఇటు ఇండియన్ యూనియన్‌తో గానీ అటు పాకిస్తాన్‌తో గానీ లేదా స్వతంత్రంగా ఉండేందుకు గానీ బ్రిటిష్ ప్రభుత్వం అధికారమిచ్చింది. నిజాం స్వతంత్రంగా ఉండేందుకే ఇష్టపడ్డాడు తప్ప పాకిస్తాన్‌తో కలుస్తానని ఏనాడు చెప్పలేదు. హైదరాబాద్ జెండాలో ఎక్కడా మతానికి సంబంధించిన గుర్తులు లేవు. అలాగే పోలీస్ యాక్షన్‌కు తెరదించే ముందు 'మున్షి-ఏడో నిజాం' మధ్యన కుదిరిన అవగాహనను జయంత్ నాథ్ చౌధురి బేఖాతరు చేసి, ఊచకోతకు ఊతమిచ్చిండు. ప్రజల ప్రాణాలకు ఆర్మీ నుంచి ఎలాంటి ముప్పుండదని హామీ వచ్చిన తర్వాతే పోరాట విరమణను నిజాం రేడియోలో ప్రకటించిండు. ఈ హామీని కూడా మిలిట్రి నిలబెట్టుకోలేదు. అంతకు ముందు నవంబర్ 29, 1947 యథాతథ ఒడంబడిక యేడాది పాటు అమలులో ఉంటుందని చెప్పి దాన్ని ఉల్లంఘించి ఈలోగానే ఇండియన్ యూనియన్ దాడి చేసింది. 1948 సెప్టెంబర్ 13న భారత సైన్య దాడికి ప్రధాన కారణం వేరే ఉంది. హైదరాబాద్ రాజ్య సమస్యను నివేదించడానికి, భారత ప్రభుత్వాన్ని నియంత్రించాలనే డిమాండ్‌తో నిజాం ప్రతినిధి బృందం సెప్టెంబర్ పదిన ఐక్యరాజ్యసమితికి విజ్ఞాపన ఇచ్చేందుకు వెళ్లింది. అలాగే భారత భద్రతకు ముప్పుగా ఉన్న మహ్మద్ అలీ జిన్నా సెప్టెంబర్ 12న చనిపోవడంతో ఇంతకన్నా తగిన సమయం మరోటి ఉండదని భారత సైన్యం హైదరాబాద్‌పై దాడికి దిగింది. ఈ సమయంలో హైదరాబాద్ రాజ్య ఉప ప్రధానిగా ఉన్న పింగళి వెంకటరామారెడ్డి దేశ సార్వభౌమత్వాన్ని కాపాడడానికి తన ప్రాణాల్ని పణంగా పెట్టడానికైనా సిద్ధంగా ఉన్నామని ప్రకటించాడు. ఏ దేశ పౌరుడైనా తన మాతృదేశ రక్షణ కోసం ప్రాణాలు త్యాగం చేయడానికి సిద్ధంగా ఉంటాడనేది వాస్తవం. పింగళి ప్రకటనను అదే దృష్టితో అర్థం చేసుకోవాలి. అలాగే నిజాం ప్రభుత్వంలో హిందువులు కూడా మంత్రులుగా ఉన్నారని ముఖ్యంగా బి.ఎస్. వెంకటరావు విద్యాశాఖ మంత్రిగా ఉండి చేసిన సేవను కూడా ఇక్కడ స్మరించుకోవాలి. అలాగే మరో దళిత నేత అంతర్జాతీయ స్థాయి లాయర్ శ్యామ్ సుందర్ ఐక్యరాజ్యసమితి భద్రతాసమితిలో హైదరాబాద్ ప్రభుత్వం తరపున పారిస్‌లో తమ వాదనలు వినిపించాడు. హైదరాబాద్‌ని అర్థం చేసుకోవడానికి ముందుగా దానిలోని వైరుధ్యాలను తెలుసుకోవాలి.



## ముస్లింలు - రజాకార్లు

హైదరాబాద్ రాజ్య ప్రజలు ఒకవైపు బాధ్యతాయుత ప్రభుత్వం కోసం ఉద్యమాన్ని మరోవైపు సాయుధ పోరాటాన్ని ఏకకాలంలో కొనసాగించారు. ఇదే సందర్భంలో రజాకార్లు ఏడో నిజాంని కీలుబొమ్మను చేసి ఆడించారు. దౌర్జన్యాలు, దొమ్మీలు చేసిండ్రు. రజాకార్లను సాకుగా చూపించి భారత ప్రభుత్వం హైదరాబాద్‌పై పోలీసు చర్య జరిపి రెండు లక్షల మంది అమాయక ముస్లిం ప్రజానీకాన్ని ఊచకోత కోసింది. సాయుధ రైతాంగ పోరాటాన్ని ఉక్కుపాదంతో అణచివేసి ప్రజలు సాధించుకున్న భూమిపై హక్కుని దక్కకుండా జేసింది. అయితే ఈ పోలీసు చర్యను బిజెపి వారు 'తమ' వాడిగా భావిస్తున్న 'సర్దార్ పటేల్ నేతృత్వంలో ముస్లిం పాలకుడైన 'ఉస్మాన్ అలీఖాన్'ని పదవీచ్యుతుణ్ణి చేయడంతో అది 'హిందువుల' విజయం'గా ప్రచారం చేసుకుంటున్నది. ఈ సంక్లిష్ట సందర్భంలో జాతీయవాద ముస్లింలు పోషించిన పాత్రను గుర్తు చేసుకోవాల్సిన అవసరముంది. హైదరాబాద్ రాజ్య చరిత్రలో ముస్లింల దౌర్జన్యమే, రజాకార్ల మారణకాండగానే ఇన్నాళ్లు చూపించిన వారు ఆత్మ గౌరవ పోరాటం చేసిన జాతీయవాద ముస్లింలు బలహీనంగానే అయినా బహిరంగంగా వినిపించిన గొంతును గుర్తించాలి.

13 ఆగస్టు, 1948 నాడు ఏడుగురు ముస్లిం జాతీయవాదులు రజాకార్ల దౌర్జన్యాలను ఖండిస్తూ, వారిపై ప్రభుత్వం కఠిన చర్యలు తీసుకోవాలని, బాధ్యతాయుత ప్రభుత్వాన్ని ఏర్పాటు చేయాలని డిమాండ్ చేస్తూ నిజాంకు బహిరంగ లేఖ రాసిండ్రు. అత్యంత ధైర్య సాహసాలతో లేఖపై సంతకం చేసిన వారందరూ సమాజంలో గొప్ప పేరున్న వ్యక్తులు. వీరి లేఖను హైదరాబాద్‌లో పరిస్థితి చేజారిపోయిందని తెలియజెప్పేందుకు సర్దార్ పటేల్ ఐక్యరాజ్యసమితిలో తాము దాఖలు చేసిన పిటిషన్‌కు మద్దతుగా చూపారంటే వారి లేఖ ప్రభావాన్ని అర్థం చేసుకోవచ్చు. దీనిపై సంతకం చేసింది బాకర్ అలీ మీర్జా, ముల్లా అబ్దుల్ బాసిత్ సాహెబ్, ఫరీద్ మీర్జా, నవాబ్ మంజూర్ జంగ్, నవాబ్ అహ్మద్ మీర్జా, మొహ్మద్ హుసేనే జాఫ్రీ, హుసేన్ అబ్దుల్ మునీమ్. ఈ ఏడుగురి సంతకాలతో కూడిన ప్రకటనను 'పయాం' పత్రిక ప్రచురించింది.

జాతీయ వాదులందరూ ఏకం కావడానికి కృషి చేసిన యువకుడు ఫరీద్ మీర్జా, ఆయన మరత్వాడా జిల్లాలో నిజాం ప్రభుత్వంలో డిప్యూటీ కలెక్టర్‌గా పనిచేస్తూ రోజూ రజాకార్లు చేసే దుండగాలను ఆపడానికి విఫల ప్రయత్నం చేసిండు. రజాకార్లకు పై స్థాయి అధికారుల

అండ ఉండడంతో ఫరీద్ ప్రజలకు ఎలాంటి సహాయం చేయలేకపోయాడు. దీంతో విసిగిపోయి నాందేడ్ లోని లోహాలో తాలూక్దార్‌గా పనిచేస్తోన్న మీర్జా తన ఉద్యోగానికి జూలై 15, 1948 నాడు రాజీనామా చేసి హైదరాబాద్ చేరుకొని రజాకార్ల అకృత్యాలను జాతీయవాద ముస్లింల దృష్టికి తీసుకొచ్చి వారిని ఉద్యమానికి సన్నద్ధం చేసిండు. (ఫరీద్ తన అనుభవాలను, జ్ఞాపకాలను తర్వాతి కాలంలో 'పోలీస్ యాక్షన్ ఇన్ ఎరస్ట్ వైల్ హైదరాబాద్ స్టేట్' పేరిట పుస్తకంగా అచ్చేసిండు. ఇందులో ఆనాటి హైదరాబాద్ రాజ్యంలో రజాకార్లు చేసిన దౌర్జన్యాలు దానికి ప్రతిగా జాతీయవాద ముస్లింలు చేసిన పోరాటాలు చిత్రితమయ్యాయి.)

కేవలం ఈ ఏడుగురే గాకుండా హైదరాబాద్ చరిత్రనిండా ఎందరో ముస్లింలు ప్రజాభ్యుదయం కోసం తమ రక్తాన్ని, స్వేదాన్ని చిందించారు. అలాంటి వారిలో షోయెబుల్లాఖాన్ ముఖ్యుడు. షోయెబుల్లాఖాన్‌ని జాతీయవాద ముస్లింగా, జర్నలిస్టుగా అందరూ గుర్తిస్తున్నారు. కానీ ఇంతవరకూ ఆయనకు కాంగ్రెస్ వారు ఏనాడు తమవాడిగా గుర్తించి నివాళి అర్పించలేదు. అలాగే కమ్యూనిస్టులు ఎనుకటి నుంచి తెలంగాణేతర సాహిత్యాన్ని, పోరాటయోధులకు అత్యధిక ప్రచారం కల్పించారు. కానీ ఏనాడు షో యెబుల్లాఖాన్ జయంతి, వర్ధంతిని నిర్వహించిన దాఖలాలు లేవు. భూమికోసం అలుపెరుగని పోరాటం చేసి అసువులు బాసిన షేక్ బందగీని గురించి ఆ పోరాట వారసత్వాన్ని కొనసాగిస్తున్నామన్న వారి సంస్థలు విశాలాంధ్రగానీ, ప్రజాశక్తి గానీ చిన్న బుక్ లెట్ కూడా వేయలేదంటే వారి అనాసక్తి తెలుస్తుంది. ఇదంతా ఎందుకు చెప్పాల్సి వచ్చిందంటే ముస్లింలందర్నీ రజకార్లుగా చూపెట్టే ప్రక్రియ ఒకటి సంఘపరివార బృందం వ్యూహాత్మకంగా ప్రచారంలో పెడుతోంది. ప్రస్తుత పరిస్థితుల్లో తెలంగాణ వచ్చినట్లయితే బిజెపి వల్ల తమ ప్రాణాలకు ముప్పుందని మజ్లిస్‌తో పాటుగా ఏపార్టీకి చెందని సామాన్య హైదరాబాద్ ముస్లిం భావిస్తున్నాడు.) నాలుగు వందల ఏండ్ల నగర చరిత్రలో ఆంధ్రప్రదేశ్ ఏర్పటుకు ముందు జరిగిన మతకలహాలు చాలా చిన్నవి. అవి కూడా ఒకటి రెండుకు మించవు. భారత-పాకిస్తాన్ విభజన సందర్బంగా దేశవ్యాప్తంగా కొన్ని వందలు, వేల మంది ఇరువైపులా ప్రాణాలు కోల్పోయారు. అయితే ఈ సందర్భంగా హైదరాబాద్ రాజ్యంలో మతకలహాలు జరిగిన సంఘటనలు దాదాపు లేవు. మౌలానా ఆజాద్ హైదరాబాద్ ముస్లిం ప్రజలు భద్రంగా ఉండాలంటే హైదరాబాద్ ప్రత్యేక రాష్ట్రంగా ఉండాలనీ, విశాలాంధ్రగా మార్చవద్దని బాహాటంగా వెల్లడించాడు. (ఆంధ్రప్రదేశ్ ఏర్పాటు తర్వాతనే తెలంగాణలో మతకలహాలు జరిగిన చరిత్ర ఉంది. అంతకు ముందు సామరస్యంగా బతికిన తెలంగాణ బతుకుల్లో నిప్పు పెట్టింది



ఆంధ్రపాలకులు మాత్రమే. స్వార్థంతో తమ పబ్బం గడుపుకోవడానికి, తమ వారికి పదవులు కట్టబెట్టడానికి లేదా ఉన్న పదవులు ఊడగొట్టడానికి హైదరాబాద్‌లో మతకలహాలు సృష్టించడం ఒక పనిగా పెట్టుకున్నారు. ఆంధ్రపాలకుల చేతిలో కీలుబొమ్మగా మారిన మొట్టమొదటి తెలంగాణ పార్టీ మజ్లిస్ కూడా ఇప్పుడు ప్రత్యేక తెలంగాణకు వ్యతిరేకంగా మారిందంటే పాలకులు ఎంత వ్యూహాత్మకంగా ఎత్తులు వేస్తున్నది అర్థం చేసుకోవాలి. తెలంగాణ ప్రత్యేక రాష్ట్రంగా ఉన్నట్లయితేనే దానికి భద్రత, గుర్తింపు, సామరస్యత ఉంటుందని అంబేద్కర్, ఆజాద్, ఫజల్ అలీ లాంటి చాలా మంది చెప్పిన విషయం మనమిక్కడ గుర్తు చేసుకోవాలి.)

# ఆంధ్రప్రదేశ్ అవతరణ-తెలంగాణ నాశనానికి నాంది

హైదరాబాద్ స్టేట్ కాంగ్రెస్‌లోని మితవాద వర్గాల వత్తిడి వల్ల నిజాం ప్రభుత్వం కాంగ్రెస్‌పై ఎనిమిదేళ్ల నిషేధాన్ని జూలై మూడు 1946 నాడు ఎత్తివేసింది. దీంతో కాంగ్రెస్‌లోని వర్గ రాజకీయాలు ముందుకొచ్చాయి. రామనంద తీర్థ నాయకత్వంలోని 'గోసాయి' వర్గానికి, జనార్థనరావు దేశాయి నేతృత్వంలోని 'దేశాయి' వర్గానికి మధ్య గొడవలు తారాస్థాయికి చేరుకున్నాయి. దేశాయి వర్గంలో బూర్గుల రామకృష్ణారావు కీలక నేత. అతి వాద మితవాద వర్గాల కుమ్ములాట కాంగ్రెస్ పోరాట పటిమను తగ్గించాయి. కొందరు నిజాం ప్రభుత్వం పోయి ప్రజాస్వామ్య ప్రభుత్వం నెలకొనాలని వాదించగా, మరికొందరు బాధ్యతాయుత ప్రభుత్వం నిజాం నేతృత్వంలో ఏర్పడాలని ఉద్యమాలు చేసింగ్రు. భిన్నాభిప్రాయల నడుమ హైదరాబాద్ స్టేట్ కాంగ్రెస్ తొలిసభ హైదరాబాద్‌లోని ముషీరాబాద్‌లో 1947, జూన్ 16, 17, 18 తేదీల్లో జరిగాయి. ఈ సభల్లో హైదరాబాద్ స్టేట్ కాంగ్రెస్ అధ్యక్ష పదవికి బూర్గుల రామకృష్ణారావు పోటీచేసి రెండు ఓట్ల తేడాతో రామానంద తీర్థ చేతిలో ఓటమి పాలయ్యాడు. ఇది కూడా వీరిద్దరి మధ్య ఆధిపత్య పోరుకు దారి తీసింది.

హైదరాబాద్ రాజ్యంలో పరిస్థితి చాలా క్లిష్టంగా ఉంది. ఈ దశలో కాంగ్రెస్‌లోని అన్ని వర్గాలు ఐక్యంగా ఉండి నిజాం ప్రభుత్వం రగిలిస్తున్న మత విద్వేషాలను, రాజకీయ అనిశ్చితిని సమర్థవంతంగా ఎదుర్కోవాలని స్టేట్ కాంగ్రెస్ అధ్యక్షుడు రామానంద తీర్థ పిలుపునిచ్చాడు. హైదరాబాద్ స్టేట్ కాంగ్రెస్ మే 29, 1948 నాడు మద్రాసులో సమావేశమైంది. ఈ సమావేశంలో హైదరాబాద్‌లో కార్యకలాపాలను పకడ్బందీగా నిర్వహించే ఉద్దేశ్యంతో దిగంబరరావు బిందూ నేతృత్వంలో ఒక కమిటీ ఏర్పాటయింది. ఇందులో జి.ఎం. ష్రాఫ్, ఎం. రామచందర్ రావు, జె.కె. ప్రాణేశాచారిలు సభ్యులుగా ఉన్నారు. పూర్తిగా గోసాయి వర్గం వారితో ఏర్పాటయిన ఈ కార్యాచరణ కమిటీ వారు 'నిజాంప్రభుత్వంతో, మిలియనీర్ పన్నాలాల్ పిత్తీలతో కుమ్మక్కయి కాంగ్రెస్ ఉద్యమాన్ని దెబ్బతీస్తున్నారని' ఆరోపిస్తూ బూర్గుల రామకృష్ణారావు, కె.ఎస్. వైద్య,



కొండా వెంకట రంగారెడ్డిలను పార్టీ నుంచి సస్పెండ్ చేసింది. స్టేట్ కాంగ్రెస్ అధ్యక్షుని అనుమతి లేకుండానే నిజాం ప్రభుత్వం ప్రతిపాదించిన 'కాంప్రమైజ్ ఫార్ములా'ను భారత ప్రభుత్వం ముందుంచినందుకు బూర్గుల, కె.ఎస్. వైద్య, కొండా వెంకట రంగారెడ్డి, లక్ష్మీ నివాస్ గణేరిలాల్‌లను సస్పెండ్ చేస్తున్నట్లు గోసాయి గ్రూప్ ప్రకటించింది. అలాగే 'ఆజాద్ హైదరాబాద్' నినాదానికి ఊతమిచ్చే విధంగా వీరి చర్యలున్నాయని కూడా కమ్యూనిస్టు సానుభూతి పరులైన కాంగ్రెస్ నేతలు విమర్శించారు. అయితే కేంద్రానికి తామెలాంటి ప్రతిపాదనలు చేయలేదని బూర్గుల, రంగారెడ్డిలు ప్రకటించారు. వల్లభ్‌భాయ్ పటేల్ కూడా వారి వాదనను సమర్థించారు. అయినప్పటికీ వీరి సస్పెన్షన్‌ని ఎత్తివేయడానికి ఆల్ హైదరాబాద్ స్టేట్ కాంగ్రెస్ కమిటీ నిరాకరించింది. ఈ విషయాన్ని (సస్పెండ్) ప్రొవిజనల్ కమిటీ సమావేశంలో నిర్ణయించాలని ఇరువర్గాలు ఒక అంగీకారానికి వచ్చాయి. ఈ సమావేశం ఆరంభానికి ముందే గోసాయి వర్గం వారు 65 మంది ప్రొవిజనల్ కాంగ్రెస్ సభ్యుల్ని, 700ల మంది ప్రాథమిక సభ్యుల్ని సస్పెండ్ చేస్తూ నిర్ణయం తీసుకుంది. వీరంతా బూర్గుల రామకృష్ణారావు మద్దతుదారులైన దేశాయి గ్రూప్ వారు. దీంతో కాంగ్రెస్ ముఠా రాజకీయాలు, ఆధిపత్య పోరు ఊపందుకుంది.

ఢిల్లీలోని పెద్దలు నెహ్రూ, సర్దార్ పటేల్‌లను సంప్రదించి వారి సంపూర్ణ ఆశీస్సులతో బూర్గుల, కొండా, కె.ఎస్. వైద్యలు ఆల్ హైదరాబాద్ కాంగ్రెస్ కమిటీని ఏర్పాటు చేస్తున్నట్లు డిసెంబర్ నాలుగు, 1948 నాడు ప్రకటించారు. స్వామి రామానంద తీర్థ స్థానంలో జనార్ధనరావు దేశాయిని అధ్యక్షునిగా, బూర్గులను కార్యదర్శిగా ఎన్నుకున్నట్లు ఆ ప్రకటనలో పేర్కొన్నారు. అయితే ఈ సంఘం నిజాం ప్రభుత్వ కీలుబొమ్మ అని, దొరలు, దేశ్‌ముఖ్‌ల కొమ్ము కాసే సంఘమని, నిజాం ప్రభుత్వమే వెనుకుండి నడిపిస్తుందని రామనంద తీర్థ ఆరోపించారు. హైదరాబాద్ సామాజిక, ఆర్థిక ప్రగతిని అడ్డుకునే రియాక్షనరీ సంస్థగా దీన్ని తీర్థ గ్రూప్ అభివర్ణించింది.

బూర్గుల గ్రూప్ దేశాయి వర్గంలో వామపక్ష భావాల వారికి ఎలాంటి స్థానం లేకుండేది. అలాగే గోసాయి గ్రూప్‌లో కమ్యూనిస్టు భావజాలం గలవారున్నారు. హైదరాబాద్ స్టేట్ కాంగ్రెస్ వర్కింగ్ కమిటీలో కమ్యూనిస్టు సానుభూతి పరులు అధికంగా ఉన్నందున దాంట్లో మార్పులు తీసుకురావాలని బూర్గుల వర్గం ఢిల్లీలో నెహ్రూ, పటేల్, పంత్, వి.పి. మీనన్‌లతో మంతనాలు జరిపింది. వీరితో కుదిరిన రాజీ ఒప్పందం మేరకు రామానంద తీర్థతో కలిసి పనిచేసేందుకు బూర్గుల అంగీకరించాడు. దీంతో బూర్గుల నేతృత్వంలోని కాంగ్రెస్ పార్టీ జనవరి ఒకటి

1949న రద్దయి తీర్థ నేతృత్వంలోని పార్టీలో విలీనమయింది. జూలై 1949లో కాంగ్రెస్ సంస్థాగత ఎన్నికలు పూర్తయ్యాయి. ఈ ఎన్నికల్లో బూర్గుల, తీర్థ వర్గాలు తమ అనుయాయుల్ని గెలిపించుకునేందుకు శాయశక్తులా కృషి చేశాయి. అక్టోబరు ఏడు, 1949 హైదరాబాద్ కాంగ్రెస్ అధ్యక్ష పదవికి నామినేషన్ దాఖలు చేసేందుకు ఆఖరు తేదీగా ప్రకటించారు. బూర్గుల, రామానంద తీర్థ తామే పోటీలోకి దిగేందుకు ప్రయత్నాలు ప్రారంభించారు. దీంతో కాంగ్రెస్ గొడవలు మళ్లీ మొదటికొస్తాయని భావించిన పల్లెర్ల హనుమంతరావు, జమలాపురం కేశవరావులు పోటీని నివారించేందుకు ప్రయత్నించారు. చివరికి ఇరుపక్షాలకు ఆమోదయోగ్యంగా ఉండే విధంగా అధ్యక్షపదవికి జమలాపురం కేశవరావు, దిగంబరరావు బిందూల పేర్లను బూర్గుల రామకృష్ణారావు ప్రతిపాదించాడు. రామానంద తీర్థ వర్గం దిగంబరరావు బిందూకు మద్దతు పలకడంతో ఆయన డిసెంబర్ 7, 1949 నాడు అధ్యక్షుడిగా ఏక గ్రీవంగా ఎన్నికయ్యిండు.

హైదరాబాద్ స్టేట్ అసెంబ్లీకి 1952 జనవరి-ఫిబ్రవరిల్లో జరిగిన ఎన్నికల్లో మొత్తం 175 సీట్లకు గాను కాంగ్రెస్ పార్టీ 93 సీట్లు గెలుచుకుంది. మెజారిటీకన్నా కేవలం ఏడు సీట్లు అధికంగా మాత్రమే సాధించుకోగలిగింది. బూర్గుల రామకృష్ణారావు షాద్ నగర్ నియోజకవర్గం నుంచి పి.డి.ఎఫ్ తరపున నిలబడ్డ రాజబహదూర్ వెంకటరామారెడ్డి కొడుకు ఎస్. లక్ష్మారెడ్డిపై విజయం సాధించాడు. అయితే నల్లగొండ జిల్లాలో కాంగ్రెస్ అభ్యర్థి ఒక్క స్థానంలో కూడా గెలువలేక పోయాడు. మొత్తం తెలంగాణలో కన్నా మరాఠ్వాడా, కర్నాటక ప్రాంతాల్లోనే కాంగ్రెస్ పార్టీ ఎక్కువ సీట్లు సాధించింది. బూర్గుల 1952 మార్చి ఆరున ముఖ్యమంత్రిగా ప్రమాణస్వీకారం చేసిండు. తాను ముఖ్యమంత్రి అయిన తర్వాత కూడా బహిరంగంగా విశాలాంధ్ర వాదానికి మద్దతిచ్చినప్పటికీ అసెంబ్లీలో ఎక్కడా మిగతా వారి మాదిరిగా ఆయన ఒక పక్షం తీసుకోలేదు. నిష్పక్షపాతంగా ఉన్నాడు.

## తెలంగాణ నాశనానికి నాంది నవంబర్ 1

ఆంధ్రప్రదేశ్ అవతరణ పేరిట 1956 నుంచి నవంబర్ ఒకటిని పండుగ దినంగా జరుపుతున్నారు. ఆనాటి నుండి ఈనాటి వరకు ప్రాంతేతరులు తమకు తాము తెలంగాణను ఉద్ధరించే అవతార పురుషులుగా ప్రచారం చేసుకుంటున్నారు. తమ వల్లనే తొండలు గుడ్లు పెట్టని ఈ ప్రాంతం అభివృద్ధి జరిగిందని చెబుతూ తమ ఆధిపత్య అహంకారాన్ని ప్రదర్శించుకుంటున్నారు. పొట్టి శ్రీరాములు ఆంధ్రప్రదేశ్ అవతరణ కోసమే ఆత్మార్పణం



చేసిండని పచ్చి అబద్దాల్ని ప్రభుత్వం ప్రచారం చేస్తుంది. ఇది తెలంగాణ వారికి ఎంతమాత్రము సమ్మతం కాదు. ఆంధ్రవలస పాలనకు తెరతీసిన నవంబర్ ఒకటి కచ్చితంగా తెలంగాణ విద్రోహ దినమే. తెలంగాణ ప్రజల ఆకాంక్షలపై, కలలపై నిప్పులు కుమ్మరించిన రోజు అది. రాష్ట్రాల పునర్విభజన కోసం కేంద్ర ప్రభుత్వం నియమించిన ఫజల్ అలీ నివేదిక సూచనలకు విరుద్ధంగా ఆంధ్రప్రదేశ్ ఏర్పడింది. కమిటీ తమ నివేదికలో ఐదేండ్లపాటు తెలంగాణను ప్రత్యేక రాష్ట్రంగానే ఉంచి ఆ తర్వాత జరిగే ఎన్నికల్లో గెలిచిన హైదరాబాద్ రాష్ట్ర శాసన సభ్యుల మెజారిటీ అభిప్రాయానుసారంగా నిర్ణయం తీసుకోవాలని సూచన చేసింది. ఈ నిర్ణయాన్ని తుంగలో తొక్కి ఆంధ్రప్రదేశ్ ఏర్పాటు చేసింద్రు. తప్పుడు ప్రచారాలతో చరిత్రను వక్రీకరిస్తున్నారు. వారికి దాస మేధావి వర్గం కూడా వంత పాడుతుంది.

ఆంధ్ర పాలకులు అసెంబ్లీలో సైతం ఆంధ్రప్రదేశ్ అవతరణ కోసం పొట్టిశ్రీరాములు ప్రాణం త్యాగం జేసిండని తప్పుడు ప్రచారానికి దిగింద్రు. నిజానికి పొట్టి శ్రీరాములు ఆంధ్ర రాష్ట్రం కోసం ప్రాణ త్యాగం జేసిండు. పాఠ్యపుస్తకాల్లో సైతం పొట్టి శ్రీరాములు త్యాగంతోనే ఆంధ్రప్రదేశ్ ఏర్పడిందని చరిత్రను వక్రీకరించారు. ప్రభుత్వ ప్రచార సంస్థ పబ్లిక్ రిలేషన్స్ విభాగం ద్వారా వందల కోట్ల బడ్జెట్‌తో ఆంధ్రప్రదేశ్ ఏర్పాటు రోజున పచ్చి అబద్దాల్ని పత్రికలు, మీడియా ద్వారా ప్రచారం చేస్తుంద్రు. మద్రాసు రాష్ట్రం నుంచి విడిపోయిన ఆంధ్ర రాష్ట్రానికి మౌలిక సదుపాయాలు సరిగ్గా లేకపోవడంతో వారి దృష్టాంతా అప్పటి హైదరాబాద్‌పై పడింది. కర్నూలు ఆంధ్ర రాష్ట్రానికి కేవలం తాత్కాలిక రాజధాని మాత్రమే అంటూ విశాలాంధ్రకు శాశ్వత రాజధాని హైదరాబాద్ అని ప్రచారం ప్రారంభించారు. హైదరాబాద్‌పై కబ్జా జమాయించే ఎత్తుగడలో భాగంగానే 1953 డిసెంబర్‌లో సంజీవరెడ్డి ఒక ప్రతిపాదన ముందుకు తీసుకొచ్చిండు. ఆంధ్ర రాష్ట్ర ప్రభుత్వ కార్యాలయాల్ని హైదరాబాద్‌లో ఏర్పాటు చేసుకునేందుకు వసతి కల్పించాలనేది ఆ ప్రతిపాదన సారాంశం. దీన్ని హైదరాబాద్ ప్రభుత్వం నిర్ద్వందంగా తిరస్కరించింది. తమ దగ్గర అంత మిగులు భవనాలు లేవని తేల్చి చెప్పింది.

సమైక్య రాష్ట్రంలో తెలంగాణ ప్రజలకు వీసమెత్తు అన్యాయం జరక్కుండా చూసుకుంటామని ఆంధ్ర పాలకులు సేఫ్ గార్డ్స్ కల్పించారు. పెద్దమనుషుల ఒప్పందం పేరిట వాటికి అక్షరరూపమిచ్చి సంతకాలు చేసింద్రు. అయితే వాటి అమలుకు వచ్చేసరికి ఆ ఒప్పందపు సంతకాలు తడి ఆరకముందే ఉల్లంఘనలకు తెరతీసింద్రు.

తెలంగాణ ప్రాంతం నుంచి వచ్చే ఆదాయ వనరులను తెలంగాణ కోసమే వెచ్చించాలని లిఖిత పూర్వక ఒప్పందం ఉంది. రెండవ పంచవర్ష ప్రణాళికలో తెలంగాణ రెవిన్యూ ఆదాయము

127.75 కోట్లుండగా, వ్యయము 101.84 కోట్లుగా ఉండింది. అంటే దోచుకున్న తెలంగాణ ఆదాయము 25.91 కోట్లు, ఇదే సమయంలో ఆంధ్ర ప్రాంతానికి వారి ఆదాయానికి మించి చేసిన వ్యయం ఐదు కోట్లు 18 లక్షలు. అంటే ఒప్పందం చేసుకున్న నాటి నుంచే వాటిని ఉల్లంఘన ఆరంభమయిందని దీన్ని బట్టి తెలుస్తుంది. మూడో పంచవర్ష ప్రణాళికలో తెలంగాణ నుంచి రెవిన్యూ ఆదాయము 241.19 కోట్లుండగా, ఖర్చు 225.60 కోట్లుగా ఉండింది. అంటే తెలంగాణ ఆస్తి అన్య ప్రాంతంలో వెచ్చించింది. 15.59 కోట్లు. ఇవి కేవలం రెవిన్యూ ఆదాయ, వ్యయాల్లో ఉన్న తేడాలు. ఇంతే అన్యాయం మిగతా విభాగాల్లో కూడా జరిగింది. నిజానికి ఆంధ్రప్రదేశ్ అవతరణ సమయంలో ఆంధ్రరాష్ట్రం ఆర్థిక ఇబ్బందుల్లో ఉండింది. హైదరాబాద్ రాష్ట్రం మిగులు బడ్జెట్‌తో ఉండేది. దేశంలోనే అత్యధిక భూమిశిస్తు రాబడితో బాటుగా, వార్షిక ఎక్సయిజు ఆదాయము ఐదుకోట్లుండేది. ఇదే సమయంలో కృష్ణ, గోదావరి ప్రాజెక్టులపై బడ్జెట్‌లో అధిక మొత్తం కేటాయించినప్పటికీ తెలంగాణకు ఎలాంటి లోటు లేకుండా ఉండేది. దాదాపు 17 కోట్ల వార్షిక రెవిన్యూ ఆదాయం లభించేది. ఆర్థిక పరిపుష్టిగా ఉన్న హైదరాబాద్ వట్టిపోయిన ఆంధ్రతో కలిపి పాలు సమానంగా పంచుకుందామన్నారు. ఇత్తేసి పొత్తుకూడి పంటంతా నాదే అన్న తీరుగా ఆంధ్ర వలస పాలకుల దోపిడీ నేటికి కొనసాగుతుంది. విత్తనపు గింజలమ్ముకొని భోజనం చేస్తున్నట్లుగా, తెలంగాణ ఆస్తులమ్ముకొని అభివృద్ధి దండోరా పిటాయిస్తుండ్రు.

1954లో వెలువడ్డ ప్రభుత్వ నివేదిక ప్రకారం ఆంధ్ర రాష్ట్ర తలసరి ఆదాయం తొమ్మిది రూపాయల అరణాలు కాగా, హైదరాబాద్ రాష్ట్ర తలసరి ఆదాయం 17 రూపాయలు. స్వాతంత్ర్యం వచ్చే నాటికి ఇండియాకు 233 కోట్ల రూపాయల అప్పుండేది. దాంట్ల ఆంధ్రవాటా కూడా ఉంది. అయితే హైదరాబాద్ రాజ్యం 63 కోట్ల రూపాయల మిగులు నిధులతో సెప్టెంబర్ 17, 1948 న భారత యూనియన్‌లో విలీనమైంది. దీన్ని బట్టి ఆర్థికంగా ఎవరు పరిపుష్టంగా ఉండేవారో తెలుస్తూనే ఉంది. ఈ విషయాలన్నింటిని పరిగణనలోకి తీసుకున్న ఫజల్ అలీ కమిటీ తెలంగాణ-ఆంధ్రలను కలిపి విశాలాంధ్ర /ఆంధ్రప్రదేశ్‌ని ఏర్పాటు చేసినట్లయితే వ్యాపారాల్లో ఆరితేరిన కోస్తాంధ్ర వారు తెలంగాణను వలస ప్రాంతంగా మార్చేస్తారని హెచ్చరించాడు. తెలంగాణ వాదులు ఇప్పుడు ఆంధ్ర వలస పాలన గురించి మాట్లాడుతున్నారు కానీ ఫజల్ అలీ కమిటీ 53 ఏండ్ల కిందటనే ఆంధ్రవలసవాద దోపిడి మనస్తత్వాన్ని సరిగ్గానే అంచనా వేసింది. ఎన్ని అభ్యంతరాలున్నప్పటికీ ఆంధ్రప్రదేశ్ ఏర్పడింది. తమ దోపిడి పాలనతో అభివృద్ధి పేరిట పీడనను కొనసాగిస్తూనే ఉంది. 1953 అక్టోబర్‌లోనే విశాలాంధ్ర భావన



వెనుక 'సామ్రాజ్య' వాద విస్తరణ కాంక్ష ఉందని బహిరంగంగానే ప్రకటించిన నెహ్రూ 1956 మార్చి ఐదున నిజామాబాద్‌లో జరిగిన బహిరంగ సభలో మాట్లాడుతూ ఒక అమాయక తెలంగాణ అమ్మాయికి, అతి తెలివి ఆంధ్ర అబ్బాయికి మధ్యన విశాలాంధ్ర పేరిట పెండ్లి చేస్తున్నాము. ఈ పెండ్లి నిలిస్తే మంచిదే లేనట్లయితే విడాకులు తీసుకొని ఇద్దరూ విడిపోవచ్చని సెలవిచ్చిండు. ఇన్నేండ్ల నుంచి నిత్యం కలహాల కాపురం చేస్తున్న తెలంగాణ ప్రత్యేక రాష్ట్రం కోసం నినదిస్తుంది. అన్ని రంగాల్లో తెలంగాణ జరిగిన అన్యాయాన్ని ఏకరువు పెడుతూనే ఉంది. నిజాం జమానాలో ప్రభుత్వోద్యోగుల వేతనాలు ఆంధ్రప్రాంతం వారితో పోలిస్తే చాలా అధికంగా ఉండేవి. హైదరాబాద్ రాష్ట్ర ప్రభుత్వం కూడా ఈ వేతన స్కేల్లను అలాగే కొనసాగించింది. అయితే ఆంధ్రప్రదేశ్ అవతరణ మూలంగా అప్పటి వరకు అధిక జీతం తీసుకుంటూ ఉన్న హైదరాబాద్ ఉద్యోగులు తర్వాతి పే కమిషన్‌లో ఆంధ్రప్రాంతం వారితో పోలుస్తూ తక్కువ జీతానికి పనిచేయాల్సి వచ్చింది. అంటే రాష్ట్రావతరణ వల్ల హైదరాబాద్ ఉద్యోగులకు తమ వేతనాల్లో వృద్ధి జరగలేదు. ఇది కూడా నవంబర్ ఒకటి పుణ్యమే. హైదరాబాద్ రాష్ట్రం ఆర్థికంగా పటిష్టంగా ఉండడంతో మెరుగైన స్కేల్లను అమల్లోకి తెచ్చింది.

తెలుగు వారమంతా ఒక్కటే అనే సెంటిమెంటుని రగల్చడంలో ఆంధ్రప్రాంత మేధావులు సఫలీకృతులయ్యారు. తెలంగాణ ప్రాంతానికి చెందిన దాశరథి, కాళోజి, సి. నారాయణ రెడ్డి, వి.పి. రాఘవాచార్య ఇలా అనేకమంది కవులు, పండితులు, రచయితలు విశాలాంధ్ర భావనను ఆహ్వానించారు. తూప్రాను (1949), ఆలంపురం (1953)లలో జరిగిన సమావేశాలకు ఆంధ్రప్రాంతం నుంచి కూడా సౌహార్ద్ర ప్రతినిధుల్ని ఆహ్వానించారు. ఇది రెండు ప్రాంతాల మధ్యన సుహృద్భావ వాతావరణాన్ని కల్పిస్తుందని భావించారు. శోభ, స్రవంతి లాంటి పత్రికలు ఇందుకోసం కృషి చేశాయి. అయితే వీరి భ్రమలు కొద్ది రోజుల్లోనే పటాపంచలయ్యాయి. కాళోజి లాంటి కవులు 1969 నాటికి ప్రత్యేక తెలంగాణ వాదులుగా మారి ఉద్యమానికి ఊతమిచ్చారు. తెలుగు తల్లి పేరిట తెలంగాణ తల్లి కనుమరుగైంది. 'మా తెలుగు తల్లికి మల్లె పూదండ' పేరిట తెలంగాణ ఔన్నత్యానికి, ఘన చరిత్రకు స్థానం లేని పాటను ఇన్నాళ్లు, ఇన్నేండ్ల నుండి పాడుకుంటున్నాం.

# విశాలాంధ్రే సెంటిమెంటు

# తెలంగాణ హకీకత్

1948 నుంచి 1956 మధ్యకాలంలో విశాలాంధ్ర డిమాండ్ చేసిన తెలంగాణ నాయకులకు అది సెంటిమెంటు, హైదరాబాద్ రాజ్యం యథాతథంగా లేదా ప్రత్యేక తెలంగాణగా ఏర్పడలనేది ప్రజాభీష్టం. హైదరాబాద్ రాజ్యంలో రజాకార్ల దాడులకు తాళలేక విజయవాడ, కర్నూలు లాంటి ప్రదేశాలకు వలసవెళ్లిన తెలంగాణ నాయకులు అక్కడ ఆశ్రయమిచ్చిన నేతల ప్రభావానికి లోనయి విశాలాంధ్ర వస్తే నిజంగానే తెలుగువారందరూ ఒక్కటిగా ఉండొచ్చని నమ్మిండ్రు. దాన్ని ఆచరణలో కూడా పెట్టిండ్రు. ఇది వరకే చెప్పుకున్నట్లుగా దేవులపల్లి రామానుజరావు, పాగా పుల్లారెడ్డి, మీర్ అహమ్మద్ అలీఖాన్, ఎస్.ఆర్. వెంకటేశం, బొమ్మకంటి సత్యనారాణ మొదలైన వాండ్లు అయ్యదేవర కాళేశ్వరరావు అడుగు జాడల్లో నడుస్తూ ఆయన స్థాపించిన విశాలాంధ్ర మహాసభకు తెలంగాణలో ప్రచారం కల్పించిండ్రు. తెలంగాణ నాయకులు సమైక్యాంధ్ర కోరుకోవడం కేవలం సెంటిమెంటు మాత్రమే. వాదానికి, తర్కానికి నిలబడని సిద్ధాంతాలను పక్కనబెట్టి మనిద్దరి భాష తెలుగే అని తెలంగాణలో సెంటిమెంటుని రగిల్చారు. ఆ మాయలో తెలంగాణ కవులు కళాకారులు సునాయాసంగా చిక్కుకున్నారు. దాశరథి, కాళోజి లాంటి వారు కూడా విశాలాంధ్రకోసం డిమాండ్ చేసిండ్రు. అయితే 1969 నాటికి వచ్చేసరికి వాస్తవాలు అనుభవంలోకి వచ్చి చాలా మంది రచయితలు ప్రత్యేక తెలంగాణకు మద్ధతుగా నిలిచిండ్రు.

విశాలాంధ్ర నినాదం వెనుక ఆంధ్ర పాలకుల్లో ఎవరి రహస్య ఎజెండా వారికున్నాయి. అయ్య దేవర కాళేశ్వరరావు మద్రాసు తెలుగు వారికి ఎన్నడూ దక్కదని గట్టిగా నమ్మి దాని బదులుగా హైదరాబాద్ రాజధానిగా విశాలాంధ్రను ఏర్పాటు చేయాలనే వాదాన్ని ముందుకు తీసుకొచ్చిండు. మద్రాసు కోసం పట్టుబట్టిన టంగుటూరి ప్రకాశం పంతులు పరాజయం పాలయ్యిండు. ఆంధ్ర రాష్ట్రం ఇస్తామన్నప్పటికీ మద్రాసుయుక్త ఆంధ్ర రాష్ట్రం కావాలని నిరాహారదీక్ష చేసి ప్రాణాలర్పించింది పొట్టి శ్రీరాములు. (అనుబంధం-VIలో వివరాలు



చూడవచ్చు.) ఆయన మరణం తర్వాత ఆంధ్ర రాష్ట్రం మద్రాసు లేకుండానే ఏర్పాటయ్యింది. అందుకే అంబేద్కర్ ఆంధ్ర రాష్ట్రం ఏర్పాటు గురించి మాట్లాడుతూ పొట్టి శ్రీరాములుకు పిండం పెట్టినట్లు రాష్ట్రాన్ని ఏర్పాటు చేసిండ్రని వ్యాఖ్యానించిండు. మరోవైపు మద్రాసు లేకున్నా సరే మాకు హైదరాబాద్ యుక్త విశాలాంధ్ర కావాలని అయ్యదేవర కాళేశ్వరరావు డిమాండ్ చేసిండు. కమ్యూనిస్టులు ఆంధ్ర రాష్ట్రంలో అధికారంలోకి రావడం కష్టమని భావించి, ఉద్యమం ఉధృతంగా ఉన్న తెలంగాణ వారికి సాహిత్య రంగంలో తగిన గుర్తింపు రావడం లేదనే భావనతో ఏర్పాటయిన 'తెలంగాణ రచయితల సంఘం' ఫజల్ అలీ కమీషన్‌కు విశాలాంధ్ర కావాలనే విజ్ఞాపన సమర్పించింది. అంటే సాహితీకారుల్లో తెలుగు వారమంతా ఒకటే అనే భావన పెరిగింది. సమైక్య రాష్ట్రం ద్వారా ఇరు ప్రాంతాల సాహిత్యానికి ఆదరణ పెరుగుతుందని భావించిండ్రు. ఆంధ్ర ప్రాంత రచయితలని పిలిచి, తుఫ్రాన్, ఆలంపురంలలో సభలు నిర్వహించిండ్రు. శ్రీశ్రీ అధ్యక్షతన హైదరాబాద్‌లో విశాలాంధ్ర సభను ఏర్పాటు చేసిండ్రు. ఎన్ని చేసిన ఈనాటికి భావ సమైక్యత తెలంగాణ వారిలో రాలేదనేది సత్యం. ఏరు దాటే వరకు ఓడమల్లయ్య ఏరు దాటినంక బోడ మల్లయ్య అనడం ఆంధ్రపాలకులకు ఆది నుంచి అలవాటే. దాంట్లో భాగంగానే విశాలాంధ్ర పట్ల తెలంగాణ ప్రజల్లో ఉన్న అపనమ్మకాల్ని, భయాల్ని పోగొట్టడానికి కల్లబొల్లి కబుర్లు చెప్పి మాయజేసిండ్రు. మొదటి నుంచి విశాలాంధ్ర వాదాన్ని ముందుకు తీసుకుపోయిన నీలం సంజీవరెడ్డి పెద్ద మనుషుల ఒప్పందం ఇంకు తడి ఆరకముందే ఉల్లంఘనలకు తెరదీసిండు. చేసుకున్న ఒప్పందం ప్రకారం ఉపముఖ్యమంత్రి పదవి తెలంగాణ వారికివ్వాలి. అయితే ఆరోవేలు లాంటి పనిచెయ్యని ఉపముఖ్యమంత్రి ఉంటేంది లేకుంటేందని అసలు ఆ పదవి తెలంగాణ వారికివ్వకుండ తొలి ఉల్లంఘన చేసిన ఘనత ఆయనది. ఉప ముఖ్యమంత్రి పదవి ఇవ్వకపోవడమే గాకుండా దాన్ని ఆరోవేలుతో పోల్చి దాని వల్ల ఉపయోగం లేదని హేళన జేసిండ్రు. అప్పటిదాకా ఆయన ఆంధ్రరాష్ట్రంలో ఉప ముఖ్యమంత్రి అన్నది గుర్తుంచుకోవాలె. అలాగే విశాలాంధ్ర ఏర్పాటు సమయంలో ఆంధ్ర తలసరి ఆదాయం తెలంగాణతో పోలిస్తే చాలా తక్కువగా ఉండడమే గాకుండా, బడ్జెట్‌లో నిధులు లేక ఆర్థిక ఇబ్బందులు ఎదుర్కొంటుండేది. అదే హైదరాబాద్ రాష్ట్రంలో మిగులు బడ్జెట్‌తో ఉండింది. ఉద్యోగుల జీత భత్యాలు దేశంలోనే మెరుగైనవిగా పేరుండింది. ఈ రెండు కలయికల వల్ల తెలంగాణకు అన్యాయం జరుగుతుందనే వాదనను ఆంధ్రులు అలాంటి అపనమ్మకం అవసరమే లేదు మేం మీకు బ్లాంక్ చెక్ ఇస్తున్నాం అని చెప్పిండ్రు. ఇది 1969 నాటికి అవును బ్లాంక్ చెక్ ఇచ్చిండ్రు కాని సంతకం పెట్టడం మర్చిపోయిండ్రుగా మారింది.

నందికొండలో నాగార్జున సాగర్, కృష్ణపట్టణములో గోదావరి కోసం ప్రాజెక్టులు కట్టి రెండు ప్రాంతాలు సస్యశ్యామలం కావాలని కోరుకున్నారు. దీని కోసం హైదరాబాద్ రాష్ట్ర నిధులే ఎక్కువ ఖర్చు పెట్టింద్రు. నెహ్రూ నాగార్జున సాగర ప్రాజెక్టుకు శంఖుస్థాపన చేస్తూ కృష్ణానదీ జలాలు ఉభయ ప్రాంతల ప్రజలకు అవిభాజ్యమైన ప్రేమబంధంగా ఉంటుందని' చెప్పిండు. వాస్తవానికి కృష్ణానదీ నీళ్లు కె.ఎల్. రావు లాంటి ఇంజనీర్ల మాయోపాయం వల్ల తెలంగాణకు దక్కకుండా పోయాయి. ఎనిమిది లక్షల తెలంగాణ ఎకరాలకు నీళ్లందించేందుకు రూపొందించిన ఈ ప్రాజెక్టు డిజైన్, కేంద్రాన్ని మార్చి ఆంధ్ర ప్రాంతానికి ప్రయోజనం కలిగేలా చర్యలు తీసుకుంద్రు. ఈ నదీ పరివాహక ప్రాంతమైన మహబూబు నగర్ జిల్లా వలసలకు కేంద్రంగానే ఉండగా, నల్లగొండ జిల్లా నిత్యం ఫ్లోరైడ్‌తో వంకర కాళ్లతో పోరాడుతూనే ఉంది. ప్రత్యేక తెలంగాణ కోరుకునే వారు ఫజల్ అలీకి సమర్పించిన వినతి పత్రంలో ఆంధ్రులు అభివృద్ధి చెందినవారు. తెలంగాణ వారు అమాయకులు ఈ ఇద్దరి మధ్య దోస్తీ కుదరదని చెప్పింద్రు. వలస వాదులు దోపిడి చేస్తారనే అభిప్రాయాన్ని వ్యక్తం చేసింద్రు. ఈ అభిప్రాయాలన్నీ తర్వాతి కాలంలో వాస్తవరూపం దాల్చాయి. ఆంధ్ర ప్రాంతంలో బ్రిటిషు వారి పరిపాలన, సేద్యానికి ఆనకట్టల నీళ్లు రావడంతో ఏర్పడ్డ మిగులుతో విద్యావకాశాలు (రేట్‌స్కూల్స్) ఏర్పడ్డాయి. అదే తెలంగాణలో విద్యావకాశాలు చాలా తక్కువగా ఉండేవి. వీటిని అసరాగా చేసుకొని ఆంధ్రప్రాంతం వారు తెలంగాణ వారికి కొలువుల్లో వాటా లేకుండా చేస్తారని భావించి తెలంగాణ వాదులు విశాలాంధ్రను వ్యతిరేకించారు. విశాలాంధ్రను వ్యతిరేకించేవారిని జోకొట్టడం కోసం నిజమైన స్ఫూర్తితో అమలుకు నోచుకోని రక్షణలు కల్పించింద్రు. ఈ రక్షణలకు ఆ తర్వాతి కాలంలో ప్రెసిడెంట్ రాజ్యాంగ బద్ధత కల్పించినప్పటికీ ఎన్నడూ పట్టించుకోలేదు. తెలంగాణలో విద్యావకాశాలు తక్కువగా ఉండడమే గాకుండా, బోధన అంతా ఉర్దూ మాధ్యమంలో జరిగేది. చిన్న చదువులకే ఉద్యోగాలు రావడమే గాకుండా, మిగులు బడ్జెట్ కూడా ఉండడంతో వేతనాలు కూడా ఆంధ్ర ప్రాంతం వారితో పోల్చుకున్నట్లయితే అధికంగానే ఉండేవి. అయితే విశాలాంధ్ర ఏర్పాటు (ఇంకా చెప్పాలంటే హైదరాబాద్‌పై పోలీసు చర్య కాలం నుంచే) నుంచే ఆంధ్ర ప్రాంతం వారు దొంగముల్కీ సర్టిఫికెట్లు సృష్టించి వందలు, వేల సంఖ్యలో తెలంగాణ వారికి న్యాయంగా దక్కాల్సిన ఉద్యోగాల్లో చేరిపోయింద్రు. దీంతో తెలంగాణ ప్రజలకు రక్షణ కల్పిస్తుందని భావించిన ఈ షరతు కూడా అంతిమంగా ఆంధ్ర వారు రావడానికి రహదారిని ఏర్పర్చిందంటే తెలంగాణ వారికి అడుగడుగున జరిగిన అన్నాయం ద్యోతకమౌతుంది. ఇప్పటి వరకు విశాలాంధ్ర వాదులు రాసిన సమాచారం మాత్రమే మనకు అందుబాటులో ఉండి



మొత్తం తెలంగాణ ప్రజలు సమైక్యాంధ్రను కోరుకున్నారనే భావనను కల్పించింద్రు. అయితే ఈ పుస్తకాలనే కొంచెం పరిశీలనగా చూసినట్లయితే తెలంగాణ ప్రజలు తిరుగుబాటు చేసిన తీరు తెలుస్తుంది. 1948 కాలంలో విద్యార్థి ఉద్యమానికి నాయకత్వం వహించిన భాయి రామ్మూర్తి నాయుడు ప్రత్యేక తెలంగాణ కోసం విద్యార్థుల్ని ఏకం చేసి అన్యాయానికి వ్యతిరేకంగా గళమెత్తిండు. ముల్కీ ఉద్యమకారులు బూర్గుల రామకృష్ణారావుని శ్రీ కృష్ణదేవరాయాంధ్ర భాషానిలయ స్వర్ణోత్సవాల్లో పాల్గొనకుండా అడ్డుకున్నది అందరికి తెలిసిందే. ప్రత్యేక తెలంగాణ వాదులు 1955లో బూర్గుల విశాలాంధ్రకు మద్దతు పలికిన అనంతరం ఆయనకు వ్యతిరేకంగా ర్యాలీలు నిర్వహించారు. బూర్గుల ప్రయాణిస్తున్న కారుని కోఠీ ఫిరోజ్ పార్క్ ముందు దగ్ధం చేసింద్రు. ప్రత్యేక తెలంగాణ వాదులందరూ ర్యాలీగా వెళ్లి డిసెంబరు ఎనిమిది 1955 సంవత్సరంలో నిజాంషాహీ రోడ్డులోని విశాలాంధ్ర మహాసభ కార్యాలయంపై దాడి చేసి తమ నిరసన వ్యక్తం చేసింద్రు. ఈ దాడికి మహబూబు నగర్ జిల్లాకు చెందిన మానోపాడు గోవిందరెడ్డి, పాల్వాయి గోవర్ధన్ రెడ్డిలు నాయకత్వం వహించింద్రు. అంతెందుకు ఆంధ్రోద్యమ పితామహులు మాడపాటి హనుమంతరావు కూడా ఫజల్ అలీ నివేదికను స్వాగతిస్తూ ఐదేండ్ల వరకు తెలంగాణను ప్రత్యేకంగా ఉంచి ఆ తర్వాత ఆ శాసనసభ్యుల అభిప్రాయం మేరకు నిర్ణయం తీసుకోవచ్చని తేల్చి చెప్పిండు. ఇది విశాలాంధ్ర వాదులకు మింగుడు పడలేదు. ఐదేండ్లు తెలంగాణను ప్రత్యేకంగా ఉంచినట్లయితే రోజు గొడవలు జరుగుతాయనే కుంటిసాకులు చెప్పి సమైక్యం చేసింద్రు. అంటే తెలంగాణ వాళ్లని గొడవకు దిగేవాళ్లుగా ప్రొజెక్టు చేయడంలోనే ఆంధ్రా వలసవాదుల ఇంట్రెస్టులున్నాయని స్పష్టమవుతుంది. ఈ నాటకాన్ని ఆంధ్ర పాలకులు ఇప్పుడు మతం పేరిట, ప్రత్యేక హైదరాబాద్ రాష్ట్రం పేరిట ముందుకు తీసుకొస్తుంద్రు.

# Annexures

## Annexure - I

## కాలక్రమంలో ఎస్సార్సీ

కూర్పు: సంగిశెట్టి శ్రీనివాస్ (ప్రొఫెసర్ హరనాథ్ సహకారంతో)

తెలంగాణ ఇప్పుడు కాకుంటే ఇంకెప్పుడు రాదు అనే స్థితికి చేరుకున్న ప్రస్తుత పరిస్థితుల్లో ప్రత్యేక రాష్ట్ర వాదులందరూ తమ గళాన్ని మరింత బలంగా నివిపించాల్సి సమయం ఆసన్నమయింది. కోస్తాంధ్ర వలసవాదులు చేస్తున్న కుతర్కాలకు ధీటైన జవాబులిచ్చేందుకు తగిన సమాచారం, అంకెలు మనకిప్పుడు అందుబాటులో ఉన్నాయి. రాష్ట్రాల పునర్విభజనకు సంబంధించి దేశంలో వివిధ సందర్భాల్లో వచ్చిన కమిటీలు, వాటి నివేదికలు, అవి అమలు జరిగిన తీరుని కాలక్రమ ప్రకారంగా ఇక్కడ ఇవ్వడమైంది.

| | |
|---|---|
| 1801 | మద్రాస్ ప్రెసిడెన్సీ ఏర్పాటు |
| 1827 | బొంబాయి ప్రెసిడెన్సీ ఏర్పాటు |
| 1833 | బెంగాల్ ప్రెసిడెన్సీని విడదీసి ఆగ్రా ప్రెసిడెన్సీ ఏర్పాటు |
| 1833 | అన్ని ప్రావిన్సియల్ ప్రభుత్వాలు, కేంద్ర ప్రభుత్వ ఏజెంట్లుగా వ్యవహరించసారంభించాయి. |
| 1836 | బెంగాల్‌ని విడదీని పశ్చిమ బిహార్ ప్రాంతాలతో కలిపి లెఫ్టినెంట్ గవర్నర్ నేతృత్వంలో నార్త్-వెస్ట్ ప్రావిన్స్ ఏర్పాటు |
| 1849 | పంజాబ్ ప్రావిన్స్ ఏర్పాటు |
| 1861 | సెంట్రల్ ప్రావిన్స్ ఏర్పాటు |
| 1874 | 1826లో బెంగాల్ ప్రెసిడెన్సీలో భాగమైన అస్సామ్‌ని విడదీసి చీఫ్ కమీషనర్ ప్రావిన్స్‌గా ఏర్పాటు |
| 1877 | నార్త్ వెస్ట్ ప్రావిన్స్‌లో అవద్ విలీనం |
| 1901 | పంజాబ్ నుంచి నార్త్ వెస్ట్ ప్రావిన్స్‌ని విడదీసి ఆగ్రా, అవద్‌లతో కలిపి యునైటెడ్ ప్రావిన్స్ ఏర్పాటు |
| 1905-07-19 | బెంగాల్‌ని (అ) ఈస్ట్ బెంగాల్, అస్సామ్, (ఆ) బెంగాల్, బీహార్, ఒరిస్సా, ఛోటానాగపూర్‌గా విడదీశారు. బెంగాల్ విభజనను వ్యతిరేకించడం ద్వారా పరోక్షంగా కాంగ్రెస్ భాష ప్రముక్త రాష్ట్రాలకు మద్దతుగా నిలిచింది. బెంగాల్ విభజనను వ్యతిరేకించడం ద్వారా పరోక్షంగా భాషా రాష్ట్రాలకు కాంగ్రెస్ మద్దతు నిచ్చినట్లయింది. |



| | |
|---|---|
| 1908 | బీహార్‌కు ప్రత్యేకంగా కాంగ్రెస్ కమిటీని ఏర్పాటు చేయటం జరిగింది. అప్పటికి బీహార్ ప్రత్యేక ప్రావిన్స్‌గా లేదు. |
| 1911 | పరిపాలన పరంగా, రాజకీయంగా ఇబ్బందులు ఎదురుకావటంతో బెంగాల్ విభజనను ఉపసంహరించుకొని పునరేకీకరణ జరిగింది. |
| 1912 | చీఫ్ కమీషనర్ ప్రావిన్స్‌గా అస్సామ్ పునఃఏర్పాటు |
| 1917 | ఆంధ్రకు ప్రత్యేకంగా కాంగ్రెస్ కమిటీ ఏర్పాటు |
| 1920 | నాగపూర్‌లో జరిగిన సమావేశంలో కాంగ్రెస్ భాషా ప్రయుక్త రాష్ట్రాలు ఏర్పాటు చేయాలని తీర్మానించింది. |
| 1928 | ప్రత్యేక రాష్ట్రం కావాలని ఒరిస్సా వారు సైమన్ కమిషన్‌కు విన్నవించుకున్నారు |
| 1936 | ఒరియా భాష మాట్లాడే ప్రాంతాలతో ఒరిస్సా ప్రావిన్స్ ఏర్పాటు |
| 1937 | కలకత్తా సమావేశంలో కాంగ్రెస్ పార్టీ భాష ఆధారంగా ఆంధ్ర, కర్ణాటక, ప్రావిన్స్‌ల ఏర్పాటుకు డిమాండ్ చేసింది. |
| 1938 | వార్ధాలో జరిగిన కాంగ్రెస్ పార్టీ వర్కింగ్ కమిటీలో కూడా ఆంధ్ర, కర్ణాటక, కేరళలను భాషా ప్రయుక్త రాష్ట్రంగా ఏర్పాటు చేయాలని తీర్మానించింది. |
| 1945 | కాంగ్రెస్ తన ఎన్నికల మానిఫెస్టోలో సాధ్యమైనంత వరకు భాషా, సంస్కృతి ప్రాతిపదికన రాష్ట్రాలు ఏర్పాటు చేసేందుకు ప్రతి కేసును క్షుణ్ణంగా పరిశీలిస్తుందని హామీ ఇచ్చింది. |
| 1947-11-27 | నెహ్రూ భారత పార్లమెంటులో మాట్లాడుతూ ఇప్పుడు దేశ రక్షణే ప్రధానమని చెప్పాడు. అయితే డ్రాఫ్టింగ్ కమిటీ సూచన మేరకు భాషా ప్రముక్త రాష్ట్రాల కమీషన్ ఏర్పాటు. దీన్నే ధార్ కమిషన్ అంటారు. ఈ ధార్ కమిటీ ఆంధ్ర, కర్నాటక, కేరళ, మహారాష్ట్రల కేసులను పరిశీలించింది. |
| 1948-12-10 | డ్రాఫ్టింగ్ కమిటీకి ధార్ కమిషన్ నివేదిక సమర్పించింది. ప్రస్తుతం దేశంలో ఉన్న క్లిష్ట పరిస్థితుల్లో భాష ప్రముక్త రాష్ట్రాల ఏర్పాటు చేయటం తగదని తేల్చేసింది. రాష్ట్రాల ఏర్పాటుకు పరిపాలన సౌలభ్యాన్ని చూసుకోవాలే తప్ప భాషను ప్రధాన ప్రతిపాదికగా తీసుకోకుడదని కూడా చెప్పింది. ఈ కమిటీ చేసిన సూచనల్లో |

ముఖ్యమైనవి 1. భౌగోళికంగా అనుకూలత, 2. ఆర్థిక స్వయం సమృద్ధి, 3. పరిపాలన సౌలభ్యం 4. భవిష్యత్తులో అభివృద్ధి కాగల శక్తి 5. విస్తృత స్థాయిలో ఆ ప్రాంతంలో నివసించే ప్రజలందరి మధ్యన (ఒకే ఏకాభిప్రాయం ఉండాలి. మెజారిటీలో ఉన్నవారు బలవంతంగా తమ అభిప్రాయాలను మైనారిటీ (ఒకే భాష మాట్లాడే వారయినప్పటికీ) రుద్దకూడదు.

1948 - 12 - ? జైపూర్‌లోజరిగిన కాంగ్రెస్ సమావేశంలో ధార్ కమిషన్ సూచనలు చర్చకు వచ్చాయి. వీటిని అధ్యయనం చేసి సమగ్ర విధానాన్ని రుపొందించేందుకు వీలుగా జె.వి.పి., కమిటీని నియమించింది. బాష ప్రయుక్త రాష్ట్రాల విషయంలో కాంగ్రెస్ నియమించిన తొలికమిటీ ఇది. ఇందులో జవహరాల్ నెహ్రూ, వల్లవభాయ్ పటేల్, పట్టాభి సీతారామయ్య సభ్యులుగా ఉన్నారు. వారి పేర్లలోని మొదటి అక్షరాలతో ఈ కమిటి ప్రసిద్ధి

1949-04-? జెవిపి కమిటి తమ రిపోర్ట్‌ని కాంగ్రెస్ పార్టీకి నివేదించింది. కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ దీన్ని ఆమోదించి, 1951 ఎన్నికల మానిఫెస్టోలో కూడా ఈ అంశాన్ని చెర్చింది. ఈ కమిటీ చేసిన సిఫార్సుల్లో ముఖ్యమైనవి. నూతన రాష్ట్రాల ఏర్పాటుకు భాష అనేది ప్రధాన ప్రాతిపదిక అయినప్పటికీ విత్త ఆర్థిక పరిపాలనా సౌలభ్యాలు కూడా పరిగణనలోకి తీసుకోవాలని చెప్పింది. తమిళనాడు, ఆంధ్ర ప్రావిన్సియల్ కాంగ్రెస్ పార్టీలు ఒప్పుకున్నాయి కాబట్టి ఆంధ్ర రాష్ట్ర ఏర్పాటుకు సమ్మతించింది. అయితే మెసూరు ప్రజల అంగీకారం లేకపోవటంతో కర్ణాటకపై నిర్ణయాన్ని ప్రకటించలేదు.

1949-11-25 జెవిపి కమిటీ సూచన ఆధారంగా కేంద్ర ప్రభుత్వం ఒక విభజన కమిటీని ఏర్పాటు చేసింది. ఈ కమిటీలో పి.ఎస్. కుమారరాజ, చైర్మన్ (మద్రాసు రాష్ట్ర ముఖ్యమంత్రి) సభ్యులుగా టంగుటూరి ప్రకాశం పంతులు, బెజవాడ గోపాలరెడ్డి, నీలం సంజీవ రెడ్డి, కళా వెంకటరావు, ఆంధ్రేతర సభ్యులుగా భక్తవత్సలం, టి.టి కృష్ణమాచారి, మాధవమీనన్, సుబ్రమణ్యం ఉన్నారు. అయితే టంగుటూరి మద్రాసు రాష్ట్రానికై పట్టుబట్టడంతో 1950లోనే ఏర్పడాల్సిన ఆంధ్ర రాష్ట్రం



1953లో గానీ నోచుకోలేదు.

1950-01-26 ఇండియన్ యూనియన్ హైదరాబాద్ రాజ్య విలీనం

1950 యునైటెడ్ ప్రావిన్స్ ఉత్తర ప్రదేశ్‌గా మారింది.

1952-12-? మద్రాసు ప్రావిన్స్‌లోని తెలుగు మాట్లాడే ప్రాంతాలతో కలిపి, మద్రాసుని మినహాయించి ఆంధ్ర రాష్ట్ర ఏర్పాటుకు ప్రభుత్వం సిద్ధంగా ఉందని ప్రధాని పార్లమెంటులో ప్రకటించాడు. ఈ రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణలో దేశ భద్రతకు ముప్పురాకుండా చూసుకోవాలని తీర్మానించింది.

1953-05-? కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ రాష్ట్రాల ఏర్పాటుకు సంబంధించిన విషయంలో జాతి సమైక్యత, జాతీయ భద్రత, రక్షణ, సాంస్కృతిక, భాష, పరిపాలన సౌలభ్యం, విత్త,ఆర్థిక ప్రగతిని రాష్ట్రస్థాయిలో, జాతీయ స్థాయిలో దృష్టిలో ఉంచుకొవాలని తీర్మానించింది.

1953-08-10 ఆంధ్ర రాష్ట్ర ఏర్పాటుకు బిల్లుని పార్లమెంటులో ప్రవేశపెట్టడమైంది.

1953-08-17 ఆంధ్ర రాష్ట్ర ఏర్పాటుకు బిల్లు సభ ఆమోదం పొందింది.

1953-10-01 ఆంధ్ర రాష్ట్ర అవతరణ

1953-12-22 నిష్పక్షపాతంగా రాష్ట్రాల పునర్వవస్థీకరణ జరిపేందుకు కేంద్రం ఒక కమిటీని ఏర్పాటు చేస్తుందని, ఆ కమిటీ రాష్ట్ర ప్రజల సంక్షేమం, జాతీయ ప్రయోజనాలను, కాపాండేందుకు కృషి చేస్తుందని అప్పటి ప్రధాని పార్లమెంటులో ప్రకటించారు. ఈ కమిటీకి జస్టిస్ ఫజోల్ ఆలీ అధ్యక్షుడుగా, పండిత్ హృదయనాథ్ కుంజ్రూ, సర్దార్ కె.ఎం. ఫణిక్కర్ సభ్యులుగా నియమితులయ్యారు

1954-02-24 పునర్వ్యవస్థీకరణ పట్ల ఆసక్తి గల వారు తమ వాదనలను, వినతులను తమ దృష్టికి తీసుకురావల్సిందిగా కమిటీ పత్రికా ప్రకటన జారీ చేసింది.

1954-13-01 నిష్పక్షపాతంగా ప్రజాభిప్రాయ సేకరణకు న్యూఢిల్లీలో శ్రీకారం చుట్టిన రోజు

1954-04-08 ప్రజాభిప్రాయ సేకరణకు భారత దేశ వ్యాప్తంగా పర్యటనకు శ్రీకారం చుట్టిన తేది. 104 ప్రదేశాలు తిరిగి 38వేల మైళ్లు ప్రయాణించి. తొమ్మిది వేల మందిని ఇంటర్వ్యూ చేసి రిపోర్టు తమారు

| | |
|---|---|
| | చేయడమైంది. |
| 1954-04-24 | ప్రజలు తమ వినతి పత్రాలు సమర్పించుకోవడానికి ఆఖరి తేది. కమిటీకి అందిన డాక్యుమెంట్ల సంఖ్య 1,52,250. |
| 1955-06-30 | రా.పు.క నివేదిక సమర్పించడానికి విధించిన గడువు |
| 1955-07-30 | ప్రజాభిప్రాయ సేకరణకు పర్యటన ముగిసిన రోజు |
| 1955-09-30 | రా.పు.క నివేదిక సమర్పించినరోజు. |
| 1956-11-01 | ఆంధ్ర ప్రదేశ్ అవతరణ |
| 1956 | 1968 వరకు మద్రాసు రాష్ట్రంగా పిలవబడ్డ తమిళనాడు ఏర్పాటైంది |
| 1956 | 1972 వరకు మైసూర్ రాష్ట్రంగా పిలవబడ్డ కర్ణటక రాష్ట్రం అవతరణ |
| 1956 | మధ్య ప్రదేశ్ ఏర్పాటు |
| 1956 | కేరళ ఏర్పాటు |
| 1960 | బొంబాయి రాష్ట్రం నుంచి మహారాష్ట్ర ఏర్పాటు |
| 1960 | గుజరాత్ రాష్ట్రం ఏర్పాటు |
| 1963 | నాగాలాండ్ రాష్ట్రావతరణ |
| 1966 | 17వ రాష్ట్రంగా హర్యానా అవతరణ |
| 1971 | భారతదేశ 18వ రాష్ట్రంగా హిమచల్ ప్రదేశ్ అవతరణ |
| 1972 | మణిపూర్ రాష్ట్రం ఏర్పాటు |
| 1972 | మిజోరాం రాష్ట్రావతరణ |
| 1972 | త్రిపుర అవతరణ |
| 1975 | 22వ రాష్ట్రంగా సిక్కిం అవతరణ |
| 1986 | 24వ రాష్ట్రంగా అరుణాచల్ ప్రదేశ్ అవతరణ |
| 1987 | గోవా రాష్ట్రావతరణ |
| 2000-11-01 | చత్తీస్‌ఘడ్ రాష్ట్రావతరణ |
| 2000-11-09 | 27వ రాష్ట్రంగా ఉత్తరాంచల్ అవతరణ |
| 2000-11-15 | 28వ రాష్ట్రంగా ఝూర్ఖండ్ అవతరణ |



*Annexure - II*

# Sri Bagh Pact

The following is the text of Sri Bagh Pact, deriving its name from the famous Garden villa of Desodharaka K. Nageswara rao Pantulu, in Madras, where it was discussed and drawn up. (Pact between the Rayalaseema and those of Coastal districts from Berhampore to Madras)

UNIVERSITY: The committee is of the opinion that two University Centres are to be developed under the Andhra University, one at Waltair and the other at Anantapur, so as to distribute the centres of culture over the Andhradesa, and create opportunities for social cultural intercourse amongst the Andhra and locate colleges in areas favourable to the subjects dealt with.

IRRIGATION: That to ensure the rapid development of the agricultural and economic interests of Rayalaseema and Nellore on the level of the Coastal districts, schemes of irrigation should, for a period of ten years or such longer period as conditions may necessitate, be given a preferential claim especially in respect of the utilisation of the waters of Tungabhadra, Krishna and Pennar, giving for ten year exclusive attention in respect of major projects beneficial to these areas.

That whentever the question of sharing waters arises, the needs of the aforesaid areas be first met and that this policy be implemented as from today in the administration of the province. LEGISLATURE: That, in the matter of general seats in the Legislature, the distibution shall generally on an equal districts basis.

It is agreed that the location of the University, the Headquarters and the High Court may advantageously be in different places so as not to concentrate all civic importance at the same centre. Accordingly, it is agreed that, while the University may continue to be where it is (Watair),

| | |
|---|---|
| | చేయడమైంది. |
| 1954-04-24 | ప్రజలు తమ వినతి పత్రాలు సమర్పించుకోవడానికి ఆఖరి తేది. కమిటీకి అందిన డాక్యుమెంట్ల సంఖ్య 1,52,250. |
| 1955-06-30 | రా.పు.క నివేదిక సమర్పించడానికి విధించిన గడువు |
| 1955-07-30 | ప్రజాభిప్రాయ సేకరణకు పర్యటన ముగిసిన రోజు |
| 1955-09-30 | రా.పు.క నివేదిక సమర్పించినరోజు. |
| 1956-11-01 | ఆంధ్ర ప్రదేశ్ అవతరణ |
| 1956 | 1968 వరకు మద్రాసు రాష్ట్రంగా పిలవబడ్డ తమిళనాడు ఏర్పాటైంది |
| 1956 | 1972 వరకు మైసూర్ రాష్ట్రంగా పిలవబడ్డ కర్ణటక రాష్ట్రం అవతరణ |
| 1956 | మధ్య ప్రదేశ్ ఏర్పాటు |
| 1956 | కేరళ ఏర్పాటు |
| 1960 | బొంబాయి రాష్ట్రం నుంచి మహారాష్ట్ర ఏర్పాటు |
| 1960 | గుజరాత్ రాష్ట్రం ఏర్పాటు |
| 1963 | నాగాలాండ్ రాష్ట్రావతరణ |
| 1966 | 17వ రాష్ట్రంగా హర్యానా అవతరణ |
| 1971 | భారతదేశ 18వ రాష్ట్రంగా హిమచల్ ప్రదేశ్ అవతరణ |
| 1972 | మణిపూర్ రాష్ట్రం ఏర్పాటు |
| 1972 | మిజోరాం రాష్ట్రావతరణ |
| 1972 | త్రిపుర అవతరణ |
| 1975 | 22వ రాష్ట్రంగా సిక్కిం అవతరణ |
| 1986 | 24వ రాష్ట్రంగా అరుణాచల్ ప్రదేశ్ అవతరణ |
| 1987 | గోవా రాష్ట్రావతరణ |
| 2000-11-01 | చత్తీస్‌ఘడ్ రాష్ట్రావతరణ |
| 2000-11-09 | 27వ రాష్ట్రంగా ఉత్తరాంచల్ అవతరణ |
| 2000-11-15 | 28వ రాష్ట్రంగా ఝార్ఖండ్ అవతరణ |



*Annexure - II*

# Sri Bagh Pact

The following is the text of Sri Bagh Pact, deriving its name from the famous Garden villa of Desodharaka K. Nageswara rao Pantulu, in Madras, where it was discussed and drawn up. (Pact between the Rayalaseema and those of Coastal districts from Berhampore to Madras)

UNIVERSITY: The committee is of the opinion that two University Centres are to be developed under the Andhra University, one at Waltair and the other at Anantapur, so as to distribute the centres of culture over the Andhradesa, and create opportunities for social cultural intercourse amongst the Andhra and locate colleges in areas favourable to the subjects dealt with.

IRRIGATION: That to ensure the rapid development of the agricultural and economic interests of Rayalaseema and Nellore on the level of the Coastal districts, schemes of irrigation should, for a period of ten years or such longer period as conditions may necessitate, be given a preferential claim especially in respect of the utilisation of the waters of Tungabhadra, Krishna and Pennar, giving for ten year exclusive attention in respect of major projects beneficial to these areas.

That whentever the question of sharing waters arises, the needs of the aforesaid areas be first met and that this policy be implemented as from today in the administration of the province. LEGISLATURE: That, in the matter of general seats in the Legislature, the distibution shall generally on an equal districts basis.

It is agreed that the location of the University, the Headquarters and the High Court may advantageously be in different places so as not to concentrate all civic importance at the same centre. Accordingly, it is agreed that, while the University may continue to be where it is (Watair),

The High Court and metropolis be located in suitable place in the Coastal districts and the Rayalaseema (including Madras) the choice being given to the Rayalaseema.

It shall, however, be open to vary these terms by common consent.

| | |
|---|---|
| Sd/- K. Koti Reddy<br>(Chairman of the committee) | Sd/- B. Pattabhi Sitaramayyya |
| Sd/- Kallur Subba Rao | Sd/- Konda Venkatappayya |
| Sd/- L. Subbarama Reddy. | Sd/- Pappuri Ramacharlu |
| Sd/- H. Sitarami Reddy. | Sd/- R. Venkatappa Naidu.<br>(December, 1937) |

ಌ ಉ ಉ ಌ



*Annexure - III*

# Fazal Ali Commission Report

359. Further, reorganisation of States in the South is dependent in a large measure on the future of Hyderabad. Hyderabad is a State with a population of 18.7 millions, of which 47.8 percent speak telugu, 24.3 percent Marathi, 11.6 percent Urdu, 10.5 percent Kannada and 5.8 percent other languages. In the preceding chapter we have already recommended the transfer of the two districts of Hyderabad, namely Raichur and Gulbarga, to the proposed Karnataka State. The future of the rest of this State is directly relevent to the examination of certain important proposals regarding the adjoining areas. This is, therefore, one of the major problems with which this Commission has to deal.

360. There has been a general demand, with popular support behind it, that the State should be disntegrated on the basis of linguistic and cultural affinity. This demand does not rest morely on linguistic grounds. It has been argued that States like Bombay, Madras and Madhya Pradesh, though heterogeneous in charecter, have achieved a fair measure of progress and have acquired considerable experience in the working of the democratic form of Government. In the case of Hyderabad, however, it is contended that the State has long been an artificial political unit and that the progress of the people who have remained backward cannot be accelerated unless its three component regions are attached to more advanced units. This step is also said to be necessary for the liquidation of the undemocratic tradition which, it is stated, is still deep-rooted in this State.

361. On the other hand, it has been argued before us that for more than six hundred years, from the time of the Bahmani Kings, the area has been an integrated unit with common geo-political features, and that the State represents in miniature a real cultural synthesis and an intermingling of Indian people and should,

therefore be preserved as a model for other areas to imitate. A further argument for the maintenance of the status quo is that Hyderabad, is permitted to exist as a unit, could become a centre of north Indian Culture and become the carrier of Hindi to the South.

362. It is important to bear in mind that the three areas of Hyderabad known as Telangana, Karnataka and Marathwada here substantially united only under the authority of the Asaf Jahi dynasty. This unity was not based on a free association of the people, but rested on the weak foundation of personal rule. With the democratisation of the State, this superimposed and superficial unity has already broken down in effect.

363. Public sentiment, both within and without the State overwhelming the insistent on the need for the disintegration of the State. The Congress party, though divided on the questions when Telangana should be a separate State or be united with Andhra, is unanimous regarding the issue of disintegration. The continuance of the existing unit for any considerable length of time would be the opinion of this body, retard the growth of the people of Hyderabad. Every other organised political party that has appeared before us, however disunited on other points, has shown striking of animity of this question. In the Marathwada area particulary there is evidence of deep feeling in this matter born doubtless of historical reasons. From the views expressed by different parties and members of the State Legislature it is clear that only a negligible minority favours the maintenance of the status quo.

364. Not only is the opposition to the disintegration of the State confined to minor sections, but the arguments on which this oppositon is based also do not bear scrutiny. We are not impressed by the claim that during the last two hundred years a specific deccani culture has developed in the whole area and that this culture is a major contribution of the unity of India. The common culture of Hyderabad, like the unity of the State, is



something that has been imposed and in no way represents a common pattern of living among the people of Hyderabad. Outside the city of Hyderabad, and to a lesser degree Aurangabad. Bidar and Gulbarga there is little that could be called a common culture.

365. Geographically, Hyderabad is divided into two distinct regions, the Deccan laves region and the remaining region - the Deccan region corresponding more or less with Marathwada. The demographic features are also so different that a casual observer proceeding from Aurangabad to Warangal may see the difference between the people not merely in their language but also in the clothing, special customs, manners etc. The geopolitical argument and the consequent claim to unity will, therefore, be seen to has no substance.

366. As far the unity of the State for the propagation of Hindi in the South, it is true that with the background of Urdu education, Hindi can easily be made popular in Hyderabad. The obvious suggestion, however, is not only that Hindi should replace Urdu as the meduim of instruction in the Osmania university, but that the former Government's policy of instruction through Urdu in the primary and middle schools should be continued (now, of course, through Hindi) throughout the State. It is most unlikely that a majority of the Telugu speaking members of the existing legislature still agree to use in the middle and secondary schools any language except Telugu. Likewise, in Marathwada education in anything but Marathi will not be tolerated. The argument that the propagation of Hindi will be easy if Hyderabad is retained in its present form takes no note of the far-reaching effects of the democratisation of the State.

367. Thus, it will be seen that the plea for the continuation of Hyderabad rests on weak foundations. As we assess political friends in the State, we are left in no doubt that if it is maintained as one administrative entity it will not acquire that minimum measure of internal cohesion which is necessary for smooth and efficient administration. Continuance of the existing structure

will also keep number of important reorganisation problems unsolved and thereby inpede the stabilisation of the proposed units in the South.

368. There is one point which will have to be considered in consequence of a change in the present character of the State, namely, the position of the Urdu-speaking people of the twin cities of Hyderabad and Secunderabad who constitute 45.4 percent of the population. They seem to entertain the fear that if Hyderabad became the capital of either Telangana or Vishalandhra, they would stand to suffer culturally and economically. There is some justification for this fear. The remedy that some people have suggested that of making the cities a centrally-administered area does not appear to be feasible. Other measures will, therefore, have to be adopted to give adequate protection to the linguistic, cultural and other interests of the large Urdu-speaking people in the twin cities. These measures should, in our opinion, include the recognition of the special position of Urdu in the educational institutions and in the administration. Steps will also have to be taken to ensure that the Urdu-speaking people are not discriminated against in the matter of recruitment to services.

**The case for Vishalandhra**

369. The next question which we have to consider is the future the telugu-speaking areas of the existing State of Hyderabad, with particular reference to the demand for the creation of Vishalandhra.

370. It is unneccessary for us to trace the history of the Andhra agitation in any great detail, because the Andhra State is now in existence, having been established on Ist October, 1953. In point of fact, however, the arrangements which were made in1953 have not been regarded by the Andhra in the new State, especially in the circars, as final : and the case for the creation of Vishalandhra remained substantially unexamined.



371. The advantages of a larger Andhra State including Telangana are that it will bring into existence a State of about 32 million with a considerable hinterland, with large water and power sources, adequate mineral wealth and valuable raw materials. They will also solve the difficult and vexing problem of finding a permanent capital for Andhra, for the twin cities of Hyderabad and Secunderabad are very well suited to be the capital of Vishalandhra.

372. Another advantage of the formation of Vishalandhra will be that the development of the Krishna and Godavari rivers will there by be brought under unified control. The Krishna and the Godavari projects rank amongst the most ambitious in India. They have been formulated after a prolonged period of inactivity, during which for various technical and administrative reasons, only anicuts in the delta area have been built. Complete unification of either the Krishna or the Godavari valley is not, of course, possible. But if only independent political jurisdiction, namely, that of Telangana, can be eliminated, the formulations and implementation of plans in the eastern areas in these two great river basins will benefit both directly and indirectly from this development, there is a great deal to be said for its amalgamation with the Andhra State.

373. The economic affiliations of Telangana with the existing Andhra State are also not unimportant. Telangana has in years scarcity a sizeable deficit in food supplies. The existing Andhra State, however, has normally a surplus which Telangana may be able to use. The existing State of Andhra has likewise no coal, but will be able to get its supplies from Singareni. Telangana will also be able to save a great deal of expenditure on general administation, in case it is not established as a separate unit.

374. The creation of Vishalandhra is an ideal to which numerous individuals and public bodies, both in Andhra and Telangana

has been passionately attached over a long peiod of time and unless there are strong reasons to the contrary, this sentiment is entitled to considertaion.

**The case for Telangana**

375. The case for Vishalandhra thus rests on arguments which are impressive. The consideraion which have been urged in favour of a separate Telangana State are, however, not such as may be lightly, brushed aside.

376. The existing Andhra State has faced a financial problem of some magnitude ever since it was created; and in comparison with Telangana, the existing Andhra State has a low per capita revenue. Telangana, on the other hand, is much less likely to be faced with finanicial embarrassment. The much higher incidence of land revenue in Telangana and excise revenue of the order of Rs.5 crores per annum prinicipally explain this difference. Whatever the explanation maybe, some Telangana leaders seem to fear that the result of unification will be to exchange some settled sources of revenue, out of which development schemes may be financed, for financial uncertainty similar to that with which Andhra is now faced. Talangana claims to be progressive and from an administrative point of view, unification, it is contended, is not likely to confer any benefits on this area.

377. When plans for future development are taken into account, Telangana fears that the claims of this area may not receive adequate consideration in Vishalandhra. The Nandikonda and Kushtapuram (Godaviri) projects are, for example among the most important which Telangana or the country as a whole has undertaken. Irrigation in the coastal deltas of these two great rivers, however, also being planned. Telangana, therefore, does not wish to lose its present independent rights in relation to the utilisation of the waters of the Krishna and the Godavari.

378. One of the principal causes of opposition to Vishalandhra also



seems to be the apprehension felt by the educationally-backward people of Telangana that they maybe swamped and exploited by the more advanced people of the coastal area. In the Telangana districts outside the city of Hyderabad education is woefully backward. The result is that a lower qualification than in Andhra is accepted for public services. The real fear of the people of Telangana is that if they join Andhra they will be unequally placed in relation to the people of Andhra and in this partnership the major partner will derive all the advantages immediately, while Telangana itself may be converted into a colony by the enterprising coastal Andhra.

379. Telangana, it has further been urged, canbe a stable and viable unit considered by itself. The revenue receipts of this area on current account have been estimated at about Rs.17 Crores and although the financing of the Krishna and Godavari Projects will impose a recurring burden on the new State by way of interest charges, the probable deficit, if any, is unlikely to be large. In favourable conditions, the revenue budget may even be balanced or indicate a marginal surplus. This fairly optimistic forecast can be explained or justified by a variety of reasons.

380. One important reason is, of course, that the existing Hyderabad State and Telangana as part of Hyderabad have benefitted considerably from the implementation from April, 1952 of the Finance Commission's recommendations. The increase in central payment from out of the divisible pools of income tax and central excise which has been possible under the present arrangements and the reduction in expenditure for which credit canbe taken, as the situation in Telangana improves, more or less offset the loss on account of the abolition of internal customs duties ; and if the scope which exists for raising the yield of certain State heads of revenue is fully explored, the financial position of Telangana need not cause anxiety.

